# వారిజ

'లత'



★

దేశి కవితా మండలి; విజయవాడ-2

## శ్రీ వెంకటేశ్వరునకు

ఆవేదనకీ- అన్వేషణకీ ఆధారం
ఏదో...ఎక్కడో నీవే తెలియచెప్పాలి!
అందుకే ప్రభూ ఈ అంకితం;
అంతకన్న ఇంకేమీ ఇవ్వలేను కనుక!



౫

# వారిజ

'వారిజ' ఆ పేరు యెందుకో నన్ను లోగడ ఆరు నెలలనుంచీ అపరిమితంగా ఆకర్షిస్తున్నది. నేను స్త్రీని, ఆమె కూడా స్త్రీ. అయినా ఆ పేరు నన్ను ఆకర్షించటం ఎక్కువయిందిగాని తగ్గలేదు. గత రెండుసంవత్సరాలనుంచీ ఆమెను గురించి రకరకాల కథలు వింటూవస్తున్నాను.

ఆఫీసుకు సంబంధించిన ఒక పనిమీద వెడుతూ రైలుకోసం ప్లాట్‌ఫారంమీద కూర్చుని మీనమేషాలు లెక్కపెడుతున్న నాకు 'వారిజా' అనే పిలుపు వినిపించింది.

ఉలిక్కిపడి తిరిగిచూశాను. గాని ఆ వారిజ యెక్కడా కనిపించలేదు. మళ్ళీ యథావిధిగా ట్రంకుపెట్టెమీదకూర్చుని కునికిపాట్లుపడటం ప్రారంభించాను.

విజయవాడలో ఈ వారిజను గురించి రకరకాల వదంతులు వున్నాయి. ఒకళ్ళు చెప్పినదానికీ, మరొకళ్ళు చెప్పిన దానికీ బొత్తిగా సంబంధంలేనికథలు ఆమెనుగురించి బోలెడు విన్నాను.

ఆ ప్లాట్‌ఫారంమీద ఉన్న రణగొణ ధ్వనిని మర్చిపోయి రైలువచ్చేలోగా ఒకకునుకుతీద్దామని వ్యర్థప్రయత్నం చేయసాగాను.

వారిజా!

మళ్ళీ ఉలిక్కిపడి ట్రంకుపెట్టెమీద సర్దుకుకూర్చుని నాలుగువైపులా చూశాను. ఉహూఁ- లాభంలేదు. ఇంతలో

రైలు వచ్చేసింది. "వారిజతో నాకున్న సంబంధం యింతే మాత్రమే! కథలుమాత్రం కావలసినన్ని" అన్నది రామలక్ష్మి.

"రెండుసంవత్సరాలుగా ఆమెనుగురించి వింటున్నావు కదా ఆరునెలలనుంచీ ఆకర్షించటానికి కారణం?"

"ఆరు నెలలనాడు నేను విన్న కొత్తకథ ఆ ఆకర్షణ కలిగించింది."

"ఇంతకూ నువ్వామెను చూడలేదన్నమాట!"

"లేదు. అస లీ గొడవంతా దేనికిట?" అని ప్రశ్నించింది రామలక్ష్మి.

"ఆ పేరు నన్నాకర్షించింది" అని మెల్లిగా జవాబు చెప్పాడు నళినీకాంతరావు.

రామలక్ష్మి పకపకా నవ్వి "నీ బెంగాలీ నామధేయం ఆమెని అంతగా ఆకర్షించలేదేమో?" అన్నది.

"వేళాకోళంమాని సరిగా జవాబియ్యి లక్ష్మీ, ఆమెని చూడాలనివుంది" అన్నాడు నళిని.

"ఆమె వారిజ. నీవు నళినీకాంతుడివి. షార్టుకట్ నళినివి; కాబట్టి చూడాలనుకోవటం అట్టే అందరాని కోరికకాదు. కాని, ఆమెను చూసినవాళ్ళు, దిక్కులేని పక్షులైపోతారని బహుజనుల అభిప్రాయం."

"సీరియస్‌గా అడుగుతున్నాను లక్ష్మీ, ఆమెని చూడాలంటే ఎలా?"

ఆ మార్గం ఏదో నువ్వే తెలుసుకుని నాక్కూడా చెపితే నేనూ చూస్తాను" అన్నది రామలక్ష్మి.

"ఆ దిక్కు-లేని పక్షుల్లో నువ్వూ ఒకదానివి అయి పోతావేమో!" సందేహం వెలిబుచ్చాడు నళిని.

"అయినా ఫరవాలేదు. నేను ఆడదాన్ని"

"నీ మొహంగాని... ఈ వూళ్ళోవుంటూ ఆమాత్రం పలుకుబడిలేనందుకు నిజంగా నువ్వు సిగ్గుపడాలి"

"అది వున్నవాళ్ళెవరూ మా మేనేజరుదగ్గర నాలుగు రోజులు పనిచెయ్యలేరు" అని నవ్వింది రామలక్ష్మి.

"పోనీ మీ ఆయనకి తెలియదూ?"

"అసలింతకూ సంగతి ఏమిటో చెబుదూ?"

"ఆమెను ప్రేమించాను"

"అఘోరించావు- గాని నిజంచెప్పు"

"నిజం నెమ్మదిగా చెబుతానుగాని- ఆగు నెలలనాడు నువ్వు విన్న కథేమిటి చెప్పు?" అన్నాడు నళిని సిగరెట్ వెలిగిస్తూ.

"చెప్పటానికి నాకేం అభ్యంతరం లేదుగాని వినడానికి కొంచెం బాధగా వుంటుంది" అన్నది రామలక్ష్మి.

"ఆప లామెగారి వయసెంత?"

"మీ కొలీగ్ చెప్పినప్రకారం పాతికకీ ముప్ఫయికీ మధ్య వుంటుంది మా పక్కింటి ముసలాయన కథనం ఏమిటంటే అరవయికి తక్కువ వుండవని. మాఆయన అనటం ముప్ఫయిఅయిదూ, నలభైకి మధ్య వుంటాయని"

"చిత్రింగావుంది వీళ్ళల్లో ఎవరైనా ఆమెను చూచారా?

"లేదు అందరూవిన్నారు. మా పక్కయింటి ముస లాయనమాత్రం చూశానని కోస్తాడు."

"అయితే ఆయనని యింటర్వ్యూ చేద్దామా?"

" ఆయన ఊళ్ళో లేడు."

" ఇంతకూ ఆమె ఎవరుట ? "

" ఏవయసువాళ్ళకి ఆ వయసులో కనిపించే ఆ విచి త్రి స్త్రీ ఏ స్వభావం కలవాళ్ళకి ఆ స్వభావం కలదిగాకూడా కనిపిస్తుందనుకుంటాను."

" ఎందుకని ? " ఇంకో సిగరెట్ వెలిగిస్తూ ప్రశ్నిం చాడు నళిని.

" మాతమ్ముడు డిటెక్టివు నవలలు చదువుతాడు. వాడి ఉద్దేశ్యం ఆవిడ మారువేషంలో తిరుగుతున్న హంతకు రాలని. మావూరి మహాకవి ఆలమూరి అచ్యుతరామయ్యగారి అభిప్రాయం: విమల గాంధర్వవిద్య తెలిసిన వరూధిని అని. నటుడిగా ఫస్టుప్రైజ్ కొట్టిన సుబ్బారావు ఆమె గ్రేటా గార్బో అంతనటి అని నమ్ముతున్నాడు. ఇకపోతే మావూరి షావుకారు నిమ్మళ్ళలుసు పెరుమాళ్ళయ్యగారికి ఆవిడ చాల డబ్బుగలదని నికరంగా అభిప్రాయం వుంది. మఠంలో సాములారు ఆవిడ గొప్పభక్తురాలంటాడు." అని పూర్తి చేసి మంచినీరు తాగింది రామలక్ష్మి.

"సరే, ఆరునెలలనాడు నువ్వువిన్న కథఏమిటిచెప్పు?" అన్నాడు నళిని.

" అదుగో మా ఆయన వచ్చారు. భోజనాలయినాక యిష్టంవచ్చినంతసేపు చెపుతాను" అని లేచింది రామలక్ష్మి.

" ఎవరి సంగతి " అన్నాడు వెంకటేశ్వర్లు అప్పుడే లోపలికివచ్చి చెప్పులువిడుస్తూ.

" వారిజ సంగతి " అని జవాబిచ్చింది రామలక్ష్మి.

" భేష్! వినదగిన కథ " అని లోపలికి వెళ్ళాడు వెంకటేశ్వర్లు.

"నీవంట తినటానికి, నీ కథలు చదవటానికి ప్రత్యేకమైన తెలివితేటలు కావాలి లక్ష్మీ " అన్నాడు నళిని.

" వంటా తినకతప్పదు; కథలూ చదవకతప్పదు—ట్రాజెడీ అది! "

" సర్లే వారిజ ఇల్లు ఎక్కడో తెలుసా ?"

" మొన్నిమధ్య మా మహిళామండలి కార్యదర్శి సావిత్రి, స్త్రీజన సంక్షేమశాఖల్లో ఒకరైన సుభద్రమ్మగారు ఈవిషయంలో నే జుట్టూ జుట్టూ పట్టుకున్నారు "

" ఎందుకూ ? "

వారిజఇల్లు మొగల్రాజపురం కొండలమధ్య ఉన్నదని సుభద్రమ్మగారు అన్నది. సావిత్రి కొంచెంకూడా ఆలస్యం చేయకుండా కృష్ణలంకలో నన్నది. ఒక అయిదునిముషాల తరువాత సుభద్రమ్మగారి నవరం సావిత్రి చేతిలో ఉన్నది."

"భేష్! ఇంతకూ ఆవిడ ఆకారం ఎలావుంటుంది?"

" ఆ విషయంలో ఈవూరి స్త్రీలకు అంత మంచి అభిప్రాయం లేదు. పురుషులుమాత్రం ఎవరికి తోచినట్లు వారు వూహించుకుని ఆనందిస్తూ వుంటారు."

ఇంతలో వెంకటేశ్వర్లు రేడియో ట్యూన్ చేశాడు. ఒక మధురగానం ఆ యంత్రంలోనుంచి వెల్లువలా ప్రవ

హించి ఆ ముగ్గురినీ ముంచివేసింది. పాటఅయిపోయిన తరువాత-

"ఆపాట ఎవరు పాడాగో తెలుసా? నళినీ?" అని ప్రశ్నించింది లక్ష్మి.

"మోహనమూర్తి కదూ?"

"అవును. భారతదేశంలోని గొప్ప విద్వాంసుల్లో ఒకడు. శాస్త్రీయ సంగీతం ఎంతకట్టుగా పాడతాడో లలిత సంగీతం అంత మజాగా పాడతాడు. కచేరీలమీద, సినిమాల మీద చులాగ్గా నెలకి నాలు గయిదువేలు సంపాదిస్తాడు"

"ఇప్పుడు మోహనమూర్తి గుణసంకీర్తనం దేనికి?"

"ఈ ప్రపంచంలో ఊహాసుందరి వారిజని తెలిసిన ఏకైక మానవుడు అతడేనని అందరూ అంటుంటారు."

"చెప్పావుకదూ! ఏమిటేమిటి, చెప్పు చెప్పు!" అని సిగరెట్ వెలిగించాడు నళిని.

"వేళాకోళం అనుకు నేవు నేనుచెప్పేకధ? ఇది పచ్చి నిజం. అని ఋజువు చేసేందుకు చాలా ఆధారాలున్నయ్"

"శుభం."

"మధుర ప్రశాంత సాయంత్రాలలో ఒంటరిగా కూర్చున్నప్పుడు నా ఊహల్లో వారిజే సుడితిరుగుతుంది. ఎవరీ రహస్యమయ నారి? ఎవరీ విచిత్ర స్త్రీమూర్తి? ఇంత మంది ఇన్ని విధాలుగా తనను గురించి చెప్పుకుంటుంటే; ఒక్కతడవనాన్న తన నిజస్వరూపాన్ని లోకానికి చూపించాలనే ఊహాకూడా రాని ఈ వారిజ ఎవరు? నాకీ అంతర్యచరిత్రలో మహా విప్లవాన్ని రేపి ప్రపంచాన్ని గడ్డిపరకలా

తీసివేసిన ఈ అద్భుత వనిత ఎవరు? ఆమెను చూడాలని నాకు కోరిక కలిగింది. విశ్వప్రయత్నాలు చేశాను. ఆ విశ్వప్రయత్నాలకు ఫలితంగా ఆమె ఇంటిని చూడగలిగాను."

"చెప్పవేం మరి?"

"ఒకనాటి మిట్టమధ్యాహ్నం తెగించేసి వాళ్ళింటికి బయలుదేరాను. ఎండ పేల్చివేస్తున్నది. వారిజ! ఆ పేరులో ఎంతో చల్లదనం ఉన్నది. ఆ చల్లదనపు ఛాయల్లో వాళ్ళింటికి వెళ్లాను. ఆ ఇల్లు విశాలమైన అడివిలాంటికోటలో ఉంది. గేటుదగ్గర కుక్కలూ గూర్ఖాలూ మొదలైన హంగామా లేవీ లేవు. కనుక సరాసరి లోపలికి వెళ్ళిపోయాను.

"ఒక విశాలమైన సావిడికి పక్కగాఉన్న ఒక గదిలో నుంచి మోహనమూర్తి గానం వినిపిస్తున్నది. ఆ పెద్దహాలులో అనధికారంగా ప్రవేశించినాదుకు సిగ్గుపడాలని అప్పటికి అనిపించింది నాకు. ముందుకు పోవటానికి ధైర్యంలేదు. ఇంత దూరమూవచ్చి వెనక్కి పోవటానికి ప్రాణం ఒప్పటంలేదు. ఆ పైన మోహనమూర్తి పాడుతున్న సూరదాస్ భజనగీతం నకన్నక్కడనుంచి పోనివ్వటంలేదు.

ఇంతలో అదృష్టవశాత్తూ మోహనమూర్తి బయటికి వచ్చాడు. అతను నన్ను ఎరుగును. 'హల్లో, ఏమిటిలా వచ్చారు?' అని ప్రశ్నించాడు. 'దారే పోతుంటే మీపాట వినిపించి లోపలికి వచ్చా''నని పచ్చి అబద్ధం ఆడేశాను. అతను నమ్మి ఉండడు బహుశా. కాని నమ్మినట్లు నటించాడు. కాసేపు ఆమాటా ఈమాటా అయిన తరువాత ఏమీ తెలియనట్లు 'ఇది ఎవరి ఇల్లండీ అని' అడిగాను. అతను సీరియస్‌గా అయి

పోయి అదేదో ఘోరమైన ప్రశ్న అన్నట్లు నావంకచూసి మెదలకుండా ఊరుకున్నాడు. నేను మాత్రం తక్కువ తిన్నానా! తిరిగి ఆప్రశ్నే మళ్ళీ అడిగాను. ఇక తప్పదురా భగవంతుడా అన్నట్లు ముఖం పెట్టి, 'ఈ ఇల్లు వారిజదండీ!' అన్నాడు. 'మరి ఆవిడ కనిపించ దేమిటి?' ఇంకో ప్రశ్న వేశాను. 'ప్రస్తుతం ఇక్కడ లేదండీ మైసూరు వెళ్ళింది' అన్నాడు. నేను వచ్చేశాను."

"ఇంతకూ వారిజ ఇల్లుమాత్రం చూసివచ్చావు అన్నమాట" అన్నాడు నళిని.

"అవును. ఆ తరువాతకూడా ఆ యింటిమీదుగా అయిదారు తడవలు వెళ్ళాను. వెళ్ళినప్పుడల్లా మోహన మూర్తి పాట వినిపించేది. ఒకసారి గ్రామఫోనులో, ఒకసారి రేడియోలో, ఒకసారి టేపురికార్డుమీద, మరొకసారి అతనే పాడుతుండేవాడు. నాకూ మోహనమూర్తి పాట చాలఇష్టమే కాని పిచ్చిలేదు. వారిజకిమాత్రం మోహనమూర్తి పాటఅంటే చాల యిష్టమని తేల్చుకున్నాను" అన్నది వక్కపొడి నోట్లో వేసుకుంటూ లక్ష్మి.

"బహుశా అత డామెని ప్రేమించివుంటాడంటావా!" అని సిగరెట్ గట్టిగా పీల్చాడు నళిని.

"ఆవిడమొహం ఈ జన్మలోచూడని నువ్వే ప్రేమించానని అన్నప్పుడు, అతను ప్రేమించటంలో ఆశ్చర్యం లేదు. ఇంతకూ వారిజనిగురించి నీబోటి రాజకీయవేత్త ఆరా తీయుటం చిత్రంగా వుంది. ఏ యిండియా రాయబారిణి

గానో ఆవిడని పంపుతున్నారేమిటి కొంపతీసి?" అని ప్రశ్నించింది రామలక్ష్మి.

"అదలా వుంచు. ఇప్పుడు నీకు ఆకర్షణ కలిగించిన విషయం మోహనమూర్తి వారిజ ఇంట్లో కనిపించటమేనా?"

"అక్షరాలాను, ఎందుకంటే మోహనమూర్తి మహాగాయకుడు అతని పాటకు ప్రతి స్త్రీకూడా లొంగిపోతుంది. ఇంతకాలమూ స్త్రీచేత ఆరాధించబడ్డ మోహనమూర్తి ఇప్పుడు ఒక స్త్రీకి లొంగిపోయాడంటే ఆ స్త్రీ యెంతగొప్పదో ఆలోచించు" అన్నది రామలక్ష్మి.

"మోహనమూర్తికి స్త్రీ లొంగిపోతుందని నీ కెలా తెలుసు?"

"నువ్వు అలాంటి ప్రశ్నలు మా ఆయన లేనప్పుడు అడగాలి" అని పకపక నవ్వింది రామలక్ష్మి.

ఇంతవరకు మాట్లాడకుండా వింటున్న వెంకటేశ్వర్లు సమాధిలోనుంచి బయటపడి-

"ఈ ప్రపంచంలో స్త్రీ హృదయంలో ఏముందో తెలుసుకోటం చాలా కష్టం నళినీ" అన్నాడు.

"ఏముంటుంది బావగారూ- రెండు చిరునవ్వులూ, కాసిని కన్నీళ్ళూ, ఒక మగవాడూను" అన్నాడు నళిని.

"ఒక మగవాడంటే నేను చచ్చినా ఒప్పకోను. కనీసం ముగ్గురయినా వుంటారు" అన్నది బింగమూతితో రామలక్ష్మి.

"నువ్వు చెపుతున్నది నీ సంగతా; వారిజ సంగతా?"

"ఏడిచినట్లుంది. మా ఆయన యెదురుగుండా నా సం గతి యెలా చెపుతాను?"

"అయితే వారిజ సంగతేనా?"

"తప్పకుండాను"

"మరి ఇందాక నాకు వారిజనుగురించి ఏమీ తెలియ దన్నావుగా?"

"నిజం తెలియదన్నానుగాని కథలు చాలా తెలుసు. ఆ కథల్లో కొన్ని నిజం అవచ్చు."

"ఏవి? అవికూడా సెలవియ్యి మరి"

"అస లిదంతా దేనికో చెప్పు."

"ఇందాకే చెప్పాను ప్రేమించానని!"

"నీ మొహం నీకూ నాకూ ప్రేమేమిటి? నిజంచెప్పు నళినీ" అన్నది రామలక్ష్మి.

"ఏం? నేను ప్రేమించలేననా? ప్రేమించటానికి అన ర్హుడిననా? ప్రేమించటం చేతకాదనా? ఏమిటి నీ ఉద్దేశ్యం."

"నా ఉద్దేశ్యం ఇదేదీకాదు. నువ్వేదో రాజకీయపు టెక్కులో ఉన్నావని" అని నవ్వింది రామలక్ష్మి.

"కొంతమటుకు-అదీ నిజమేకాని ప్రేమకూడా లేకపోలేదు"

"నీ ప్రేమా నువ్వూ పాడుగాను, నిజం చెప్పవయ్యా గోల" అని విసుగునటిస్తూ అన్నది రామలక్ష్మి.

"ఏమీలేదు లక్ష్మి- ఆవిడనిగురించి రకరకాల కథలు వినటంతో తెలుసుకోవాలనే కుతూహలంతప్ప మరేంలేదు"

"ఇప్పటికీ నిజంచెప్పనట్టు తోస్తున్నది. నిన్ను మోహనమూర్తికి పరిచయంచేస్తాను అలా అయితే..."

"అలాగే చెయ్యి. ఈవూళ్ళో మూడు నెలలు ఉండాల్సి వచ్చేట్టుంది. కాలక్షేపానికి ఏదో కావాలిగా మరి" అని నవ్వాడు నళిని. ఆ చర్చ అంతటితో ఆగిపోయింది.

* * *

ఆ తరువాత పదిరోజులకి ఒకపాటకచ్చేరీలో మోహనమూర్తిని నళినీకాంతరావుకి పరిచయంచేసింది రామలక్ష్మి—

"చిన్నపిల్లవాడిలా అమాయకంగా ఉన్న ఈ యువకుడు భారతదేశ ప్రఖ్యాత గాయకుల్లో ఒకడైన మోహనమూర్తి" అని నవ్వింది రామలక్ష్మి. ఆమాటకి మోహనమూర్తికూడా నవ్వి—

"రామలక్ష్మిగారు నన్ను అలా పొగుడుతూనే ఉంటారు లెండి. అది ఆవిడ అలవాటు" అన్నాడు.

"అవునండీ, మీరు ప్రఖ్యాత గాయకుల్లో ఒకరు అవునా; కాదా? ముందాసంగతి చెప్పండి" అన్నది రామలక్ష్మి.

"అందరూ అలాఅనే అంటారు. కేవలం ఒక్క వ్యక్తి తప్ప."

"ఆ వ్యక్తి వారిజేనా?" అని వెంటనే అడిగేసింది రామలక్ష్మి. అవునన్నట్లు తలవూపాడు మోహనమూర్తి.

"మీ పాటే ఆమెకు నచ్చకపోతే ఇక కేవలం ఏ సరస్వతీదేవో దిగిరావాలి" అన్నాడు నళిని; మోహనమూర్తి కొన్నిక్షణాలు మాట్లాడలేదు - తరువాత:

"ఆమె సరస్వతీదేవిలాగానే పాడుతుంది" అన్నాడు. ఆ మాటకి రామలక్ష్మి,నళినీకాంతరావుకూడా ఉలిక్కిపడ్డారు.

"ఆమెలా పాడగలిగినవాళ్ళని నేను యెక్కడా చూడ లేదు. రెండు రాగాల ఛాయలతో కొత్తరాగాల్ని కల్పిస్తూ ఆ రాగాల ఒదుగులో కొత్త వాక్యాలను సృష్టిస్తూ ఒక వినూతనమైన సంప్రదాయం ఆమె సృష్టించింది. ఇప్పుడు నేను నేర్చుకుంటున్నది అదే" అన్నాడు మోహనమూర్తి.

"మరయితే ఆమె కచేరీలు యెందుకు చెయ్యదు?" అని సందేహం వెలిబుచ్చింది రామలక్ష్మి.

"ఆవిడ మనలాగ యెప్పుడు కావాలంటే అప్పుడు పాడదు. ఆ సంగతే అడిగితే 'నేను యితర్ల కోసం జీవించటం మానేశాను' అన్నది."

"మీరు ఎలా నేర్చుకుంటున్నారు?"

"సృష్టిలో ఏ కళకయినా ప్రతిస్పందన అనేది ముఖ్య గుణం అనిపిస్తుంది. ఆమెలో ఉంచి ఒక నూతనరాగం సృష్టించా లని నాకు అనిపిస్తే నేను మొదట ఆలాపిస్తాను. ఆ ఆలాపన అందుకుని ఆమె పాట పూర్తి చేస్తుంది."

"ఒకవేళ మీలాగా పాడగలిగినవాళ్ళు ఆమెకి తటస్థించకపోతే?......" సందేహం వెలిబుచ్చింది రామలక్ష్మి.

"బహుశా కొత్తరాగాల్ని సృష్టించేది కాదు" అన్నాడు మోహనమూర్తి.

"మీలాంటి మహాగాయకుడిని కూడా ముగ్ధుణ్ణి చేయ గలిగిన ఆమె పాట ఒకసారి వినాలనివుంది" అన్నది రామ లక్ష్మి.

"వినచ్చునుకాని, ఆమె పాడమన్నప్పుడు పాడదు. ఆవిడ పాడుతున్నప్పుడే మనం వినాలి. అది కుదరటం కష్టం"

"ఆకష్టాన్ని మీరు వికటీసేయండి. మీ రెప్పుడు పాడ తారో చెప్పండి. అప్పుడే వస్తాం" అన్నది రామలక్ష్మి.

"వస్తాం- అని బహువచనంలో అంటున్నారు. మీరు తప్ప మరొకరు రావటానికి వీలులేదు. మిమ్మల్నయినా ధైర్యంగా రమ్మనటానికి ఒక కారణం ఉంది. మీరు వ్రాసిన వన్నీ ఆవిడ నిత్యాపారాయణం చేస్తుంది. మిమ్మల్ని చూస్తే బాగుండుననికూడా ఒకటి రెండుసార్లు అనుకుంది" అన్నాడు మోహనమూర్తి. ఆ మాటకి నళిని కాంతరావు గతుక్కు మన్నాడు.

"శుభం! ఎప్పుడు రమ్మంటారోకూడా సెలవీయండి మరి" అన్నది రామలక్ష్మి.

"రేపుసాయంత్రం అయిదింటికి" అని వెళ్ళటానికి లేచాడు మోహనమూర్తి. అతను వెళ్ళిపోయినాక "లక్ష్మి! నేనుకూడా చీరకట్టుకుని నీతో రానా?" అన్నాడు నళిని. "చీర కట్టుకుని నాతో రానక్కరలేదుగాని మాఇంట్లో మాత్రం ఉండు, మాఆయనకి తోడుగా" అన్నది లక్ష్మి.

* * *

తోటలా కనిపిస్తున్న ఆ అడవిలోంచి విమల గాంధర్వం అలలుఅలలుగా వచ్చి లోకాన్ని ముంచివేస్తున్నది. అప్పుడే గేటులో అడుగుపెట్టిన రామలక్ష్మికి అందులో ఒక అల విసురుగావచ్చి తాకి ఉక్కిరిబిక్కిరి చేసింది.

అది హిందూస్తానీ కాదు... కర్ణాటకమూ కాదు. లలిత సంగీతం అసలేకాదు. అందులో భాషకి అందని భావమేదో అంతర్గతమై ఉన్నది. అది ఉత్త ఆలాపన. ఆ ఆలాపనలో

కొత్తలోకాలకు వాకిళ్ళు తెరుచుకున్నాయ్. కళ్ళముందు రంగు రంగుల చిత్రాలు తిరిగిపోతున్నాయ్.

మహాగాయకులైన ఆ స్త్రీపురుషుల కంఠాల్లోంచి ఉజ్వలరాగ స్రవంతి నాట్యమాడుతూ ప్రవహిస్తున్నది. ఆ ప్రవాహ వేగానికి స్తంభీకరించిన ప్రకృతి ఒక మహా చిత్రకారుడు వేసిన చిత్రంలా నిశ్చలంగా ఉంది. ఆ చిత్రంలో తనుకూడా ఒక భాగం అయిపోయింది రామలక్ష్మి.

ఒక అరగంటసేపు ఈమాధురీఝరి ప్రవహించిన తరువాత మోహనమూర్తి ఆ ఇద్దరు స్త్రీలనీ ఒకరి కొకర్ని పరిచయం చేశాడు రామలక్ష్మి వారిజకేసి చూడటం ప్రారంభించింది. ఆ తరువాతెప్పుడో వారిజని గురించి ఒకచోట ఇలా వ్రాసింది ఆమె

'వారిజని వర్ణించటానికి ప్రయత్నించటం అంత మంచి పని కాదు. అది నా సమర్థత కాదని మరోసారి విన్నవించుకుంటున్నాను. అందంగా మాటలుకూర్చి చదివే వాళ్ళకు ఉద్రేకం పుట్టించడమే కాకుండా నఖశిఖ పర్యంతం అత్యద్భుతంగా వర్ణించి గాబరా ఎత్తించేసి... ఇక వర్ణించటం నావల్ల కాదు... అనే రచనా చమత్కృతి నాకూ బోలెడువుంది. కాని వారిజ విషయంలో మాత్రం దాన్ని ఉపయోగించ బుద్ధి పుట్టలేదు. కథ చెప్పినట్లు చెప్పటం ప్రారంభిస్తే బోలెడన్ని అబద్ధాలు చెప్పాల్సివస్తుంది. అందుచేత ముక్తసరిగా మాత్రమే ఆమెను గురించి చెప్తాను.

ఆమె నల్లగా ఉంటుంది. ఆ నలుపు, నీలి కలువపువ్వులాట్టి విచిత్రమైన కాంతితో కూడిన నలుపు. ఇలాంటి ఛాయ

ఇంకెక్కడా నేనుచూడలేదు. ఆమె ముఖం కోమలమైన నీలి కువలయం. అతిసుకుమారమూ అతి మార్దవమూ అత్యాశ్చర్య కరమూ అయిన ఒక విచిత్రజ్యోతి ఆ నలుపులో కలిసి మనని ఏదో నూతనస్వర్గానికి తీసుకు వెడుతుంది.

ఆమెకళ్లు నల్లనివి.అవి ఇంద్రజాలికుడి చేతిలోని మాంత్రిక మణుల్లాటివి.ఆమెకి రెప్పపాటు తక్కువ. నిర్నిమేషాలూ భావరహితాలూ అయిన ఆమె సుందరనేత్రాలు ఎదటి వాళ్ళని నిశ్శబ్దాగా పిల్చివేస్తయ్యి. నిర్నిమేషమైన ఆమె దృష్టిని భాషలో వ్యక్తం చెయ్యడం చాలా కష్టం.

ఆమెవయసు పద్దెనిమిది మొదలు ఏభై దాకా ఎంతైనా కావచ్చును. ఆమెకళ్లు, ఆమెఛాయా, ఈ రెండూ ఇంకెవరికీ చూడలేను. నేను అతిశయోక్తులు దొర్లకుండానే వారిజని వర్ణించాను. ఆమె వారిజ.నీలికలువపువ్వు.'

మొట్టమొదట వారిజని చూసినప్పుడు ఏభావం ఆమె మనసులో కలిగిందో అదే అయిదారేళ్ళ తరువాత ఆమె వ్రాసింది. వారిజకూడా రామలక్ష్మిని అదే దృష్టితో చూస్తున్నది.

రామలక్ష్మి అందమైనది. ఆమెఛాయ సంపంగిరేకు ఛాయ.

"నమస్కారం రామలక్ష్మిగారూ! కూర్చోండి.మీరు వస్తారని మోహనమూర్తి చెప్పాడు" అన్నది వారిజ.ఆమాటకి ఉలిక్కిపడింది రామలక్ష్మి. ఈ కంఠం ఎక్కడో విన్నకంఠం "మిమ్మల్ని చూడాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను" అంటూ కూర్చున్నది రామలక్ష్మి.

"నేనూ అనుకుంటున్నాను అదే విషయం. మీరు అతిశయోక్తి అనుకోకుండా ఉంటే ఒక్క విషయం చెపుతాను. మీరు ఏదివ్రాసినా అంత గొప్పగా వ్రాస్తారు కాని......"

"కాని?"

"కాని మీరచనల్లో సోమర్సెట్, మాఘమ్‌చలం, గోపీచంద్ మల్లాది రామకృష్ణశాస్త్రి, మొదలైనవారిఛాయలు కనిపిస్తాయి క్షమించాలి ఇలా అంటున్నందుకు. మీరేం అనుకోరని నాకు తెలిసే అంటున్నాను" అన్నది వారిజ.

రామలక్ష్మి నవ్వి, "మీరు శరత్‌నీ, ఠాకూర్‌నీ వదిలేశారు. వాళ్ళఛాయలుకూడా నాలో ఉన్నయ్" అన్నది. అందరూ పకపకా నవ్వుకున్నారు.

"ఏది ఏమయినా మీరు గొప్పరచయిత్రిలు"అన్నది వారిజ.

"ఇంతసేపూ మీరు నన్నుగురించి. పొగిడారు.ఇప్పుడు మిమ్మల్నిగురించి నిజం చెపుతాను" అన్నది రామలక్ష్మి

"చెప్పండి. మీలాంటివారిచేత వర్ణింపబడటంకన్న అదృష్టం మరేముంది."

"మీలాంటి వ్యక్తిని నేను చూడలేదు. బహుశా శిలి కలువల్ని నీహారికల్ని కలిపి మిమ్మల్ని సృష్టించివుంటాడు బ్రహ్మ" అన్నది రామలక్ష్మి.

"మేఘమల్హార్‌నీ, దీపక్‌నీ కలిపి నన్ను సృష్టించాడు! బ్రహ్మదేముడు అని మోహనమూర్తి అభిప్రాయం" అని మోహనమూర్తి వేపు ఓరగాచూసింది వారిజ.

"నా శావా సూరి, ఒక గాయకుడు ఉత్తమరాగాల తోనూ, ఒకరచయిత్రి ఉత్తమ వాక్యాలతోనూ నిన్ను పోల్చారు. నువ్వు గర్వపడాలి" అన్నాడు మోహనమూర్తి.

"మీరెప్పుడూ తెల్లచీరలే కడతారా!" అన్నది రామలక్ష్మి.

"తప్పితే కాషాయవస్త్రాలు కడతాను" అని వారిజ.

"రాగరంజితమైన హృదయం కాషాయధ దింపటం అంతమంచిపని కాదని నేనెపుడూ వారిజతో ఉంటాను" అన్నాడు మోహనమూర్తి వారిజవంక చూస్తూ.

"ఆ పని ఒక్క వారిజమాత్రమే చేయగ మోహనమూర్తిగారూ! మనబోటివాళ్ళకి అది సాధ్యంకాదు అధవా ప్రయత్నించినా రాగరంజితమైన మన అంతర్యం చిరిగి వాలిసిపోతుందిగాని కాషాయ వర్ణంలోకి రాదు" అన్నది రామలక్ష్మి.

ఉత్తమ కళాకారులూ, సంస్కారవంతులూ అయిన ఆ స్త్రీపురుషులు ముగ్గురూ కొన్నిక్షణాలు ఎవరి అంతర్యంలోకి వారు తొంగిచూసుకున్నారు.

మోహనమూర్తిహృదయంలో కొత్తరాగాలు మూర్తి కడుతుంటే, వారిజ అంతర్యంలో మోహనమూర్తి ఛాయా రూపం ఉన్నది. రామలక్ష్మి హృదయంలో వారిజకథ సుడితిరుగుతున్నది. ఉన్నట్లుండి రామలక్ష్మి పకాలున నవ్వి-

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను వారిజగారూ" అన్నది.

"నిరభ్యంతరంగా స్వీకరిస్తాను... అదే మొగాడి ప్రేమ అయితే కాస్త వెనుకాముందూ చూడాల్సివచ్చేది" అని మోహనమూర్తివంక చూసింది వారిజ. ఆ చూపులోంచి మె హృదయం తొంగిచూసింది. అదిచూసి మోహనమూర్తి ంచుకున్నాడు. "కాని ఆ మగవాడెంత అదృష్టవంతుడు గా కూ! నేను మాత్రం అతన్నిచూసి తప్పకుండా పడతాను" అని నవ్వింది రామలక్ష్మి. వారిజకూడా

"కాని ఆ మగవాడుమాత్రం అలా అనుకోడు. అదే విచిత్రం" అన్నది.

"మీరు ఇంత త్వరగా మీ హృదయాన్ని నాముందు పరుస్తారని నేను అనుకోలేదు" అన్నది రామలక్ష్మి.

"నేనూ అనుకోలేదు... కాని మీముందు ఏదీ దాయాలని అనిపించటంలేదు." అని నిట్టూర్చింది వారిజ.

"మీరు ఒక్క కొత్తరాగాన్నిమాత్రమే కాదు, కొత్త అనుభూతుల్నికూడా సృష్టించగలరు. మిమ్మల్ని చూడకుండానే ప్రేమించే వ్యక్తులు ఎందుకు అలా గుడ్డివాళ్ళలాగా ప్రేమిస్తారో ఇప్పుడు నాకు అర్థమయింది" అన్నది రామలక్ష్మి.

"అలాంటి వాళ్ళెవరైనా మీదృష్టిలో ఉన్నారేమిటి?"

"మా నళినీకాంతరావు అందులో ఒకడు. ఇంకా చాలామందిని చూశాను. ప్రస్తుతం విజయవాడనగరంలో ఇద్దరు పెద్దమనుష్యులు కలిసినా, ఇద్దరు జేబుదొంగలు కలిసినా, ఇంకో ఇద్దరు వేదాంతులు కలిసినా మీచర్చే జరుగుతూ ఉంటుంది."

"చర్చించదగిన విషయం నాలో ఏముంది?"

"నిజం చెప్పాలంటే మీలో ప్రతిదీ చర్చించదగిన విషయమే... ఎప్పటికయినా గొప్ప నవలా రచయిత్రిననే పేరు నేను తెచ్చుకోగలిగితే అది మిమ్మల్ని చిత్రించటంవల్లనే జరుగుతుంది వారిజగారూ!" అన్నది రామలక్ష్మి.

"తప్పకుండా అలా చేయండి. ఎప్పుడో ఒకసారి నా కథంతా మీకు చెపుతాను" అన్నది వారిజ. కొంచంసేపు ఎవరూ మాట్లాడలేదు.

"రండి మోహనమూర్తిగారూ! నన్ను ఇంటిదాకా పంపించివద్దురుగాని" అని లేచి నిలబడింది రామలక్ష్మి. వారిజ కూడా లేచి నమస్కారంచేసి "మళ్ళీ ఎప్పుడు కనిపిస్తారు?" అన్నది.

"నాకు ముందుచూడాలనిపిస్తే నేను వస్తాను; మీకు ముందుచూడాలనిపిస్తే ఫోను చేయండి" అని నంబరు ఇచ్చింది రామలక్ష్మి.

ఎర్రటి ఆ కొండమీద వెన్నెల విచిత్రంగా కురుస్తున్నది అందమైన స్త్రీ పాపిడితీసుకున్నట్లుగా ఉన్న దారివెంట మోహనమూర్తీ, రామలక్ష్మి నడుస్తున్నారు.

"ఈ ప్రాంతాన్ని ప్రజాశక్తినగర్ అని కాదూ అంటారు?" అని హఠాత్తుగా అడిగింది రామలక్ష్మి.

"నాకు సరిగా తెలియదు... ఇంతకూ వారిజనిగురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"అద్భుతమైన స్త్రీ"

"అంత అద్భుతమైన స్త్రీ కాకుండా ఉంటే బాగుండేది"

"అప్పుడా ప్రత్యేకతే ఉండదు. ఇంతకీ మీరేదో చెప్పాలని చెప్పలేక పోతున్నారు. అవునా?"

"అవును. చెప్పాలనుకున్న దేదో వెంటనే చెప్పేసే సాహసం నాలో ఉండటానికి నేను స్త్రీని కాదుగా మరి" అని నవ్వాడు మోహనమూర్తి.

"మీరు కేవలం కొత్తరాగాలు నేర్చుకోటానికే వారిజ శిష్యరికం చేస్తున్నారా?-అన్నది కొద్దిగా సందేహంగా ఉన్నది" అని నవ్వింది రామలక్ష్మి.

"నువ్వీపాటికి అంతా గ్రహించే ఉంటావు?"

"గ్రహించాను. లోకమంతా ఆరాధిస్తున్న ఆ స్త్రీ మీకు......సరే పోనీండి. ఇంక రిక్షామీద వెడతాను; మీరు వెళ్ళండి" అని రిక్షాని కేకేసింది రామలక్ష్మి.

రిక్షాపక్కనే సైకిలుమీద వస్తున్న వ్యక్తిని పరీక్షగా చూసి పకపకా నవ్వటం ప్రారంభించింది రామలక్ష్మి.

"నీకు నవ్వుగానే ఉంటుంది. ఇంతసేపు ఏం చేశావు?" అన్నాడు నళిని.

"ఆమెను నేనూ ప్రేమించాను" అని మళ్ళీ నవ్వటం ప్రారంభించింది రామలక్ష్మి.

*　　　*　　　*

పరమ సుందరమైన మోహనరాగం ఆలాపిస్తున్నది వారిజ.

"వారిజా, ఎప్పుడూ అదే రాగం ఆలాపించటంలో నీ ఉద్దేశ్యం" అన్నాడు మోహనమూర్తి.

"ఆ రాగం నాకు చాలా ఇష్టం. ఆ రాగంలోనే నా బతుకు ఇమిడిఉన్నది" అని తిరిగి పాడటం ప్రారంభించిందామె.

"ఆ రాగం నేను భరించలేను."

వారిజ నవ్విందిగాని పాట ఆపలేదు. మోహనమూర్తి విసుగ్గా లేచి నిలబడి ఆమెను పిలిచాడు.

"వారిజా!"

"ఏమిటి?"

"ఏదయినా కొత్తరాగాన్ని పాడు."

"ఇవ్వాళ నాకు పాత పాటే పాడాలనిపిస్తున్నది."

"దానికి కారణం బెంగుళూరునించి వచ్చిన ఉత్తరమేనా?"

"అవును...ఏమయినా అపరాధమా?"

"ఎందుకో ఆ పాతపాట నాకు బాగుండటంలేదు."

"నేను ఒకరికోసం జీవించటంలేదు జిజ్జూ" అన్నది వారిజ. మోహనమూర్తికి అది ముద్దు పేరు.

"నన్ను బాధించటంలో నీ కేమయినా ఆనందం లభిస్తే నా అభ్యంతరం ఏమీలేదు... కాని..."

"కాని?"

"కాని...ఏమీలేదులే పోనివ్వు."

"చెప్పు మరి దాయటం దేనికి?"

"ఇప్పుడు చెప్పలేను".

చేతిలో ఉన్న వీణని బలంగా మీటింది వారిజ. ఒక తీగ తెగి విసురుగావెళ్ళి మోహనమూర్తి చెంపకి తగిలింది. వారిజ ఖంగారుపడి అతని చెంపని అనుకోకుండా స్పృశించి చెయ్యి వెనక్కి తీసుకోబోయింది.

మోహానమూర్తి తన చెంపమీదవున్న ఆమె చేతిని తియ్యనీకుండా తన చేతితో నొక్కిపెట్టి "వారిజా!" అన్నాడు.

ఆ ఒక్క పిలుపుతో వారిజకి తన బ్రతుకంతా జ్ఞప్తికి వచ్చింది. ఇదే ఆప్యాయతతో తనని ఇదివరకు చాలామంది పిలిచారు. కాని ప్రస్తుతం ఆ పిలుపుకోసమే తను ఎదురు చూస్తున్నది.

వారిజా! ఆ పిలుపు తాన్ సేన్ గానమూ, కాళిదాసు కవిత్వమూ కలిపిన ఒక మహాగీతిక. ఆ పిలుపు మహాగాయకుడు మోహానమూర్తి పిలుపు అది ఒక కళాకారుని రాగ రంజితమైన హృదయంలోంచి వెలువడిన చిరుగీతి.

"వారిజా... వారిజా... వారిజా"

ఈ పిలుపు ఇదివరకు చాలాసార్లు వింది ఆమె.

* * *

అస్సాం తేయాకు తోటల్లో తనుకళ్లు తెరిచింది. తన తల్లి ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబంలోని స్త్రీ అని తనకి తరువాత తెలిసింది

తన తల్లిని తల్చుకుంటేనే తనకి అపరిమితమైన అసహ్యం కలుగుతుంది. చాపల్యంచేత తప్పటడుగు వేసి జీవితం నాశనం చేసుకొన్న ఆ దౌర్భాగ్యురాల్ని తను ఎప్పుడూ క్షమించలేదు. ఆమె చివరి రోజుల్లో భయంకరమైన కుష్టు రోగం వలన బాధపడి చనిపోయింది. అప్పుడు కూడా తను మాత్రం జాలిపడలేదు.

కట్టుకున్న భర్తనీ, కమ్మటి సంసారాన్ని, పిల్లల్ని, కాలతన్నిన పాపిష్టురాలు... ఆమె కడుపునే పుట్టింది. వారిజ

ఆంధ్రదేశంలోని ఒకపల్లెటూరిలో, నిష్ఠకీ, ఆచారానికీ పేరు పడిన వెలనాటి వైదిక కుటుంబంలో పుట్టి, అంతకన్న నిష్ఠకల కుటుంబంలోకి కోడలుగా వెళ్ళి, ఇద్దరు పిల్లల తల్లి అయింది. ఆమె, భర్త సదాచార సంపన్నుడు. నిత్యాగ్నిహోత్రి.

ఒకరోజు తడిబట్టతో చెరువునీళ్ళు తెస్తున్న తనని ఎవరో చూస్తున్నట్లనిపించింది ఆమెకి. వెనక్కి తిరిగిచూసి నిలువునా ఒణికిపోయింది ఆమె. తన నారీత్వంలోని కిటికీలు కొన్ని అప్పుడే తెరుచుకున్నాయా! అనిపించింది. వసంతాగమనంతో మొక్కలు మొగ్గతొడిగినట్లు, అంతు తెలియని ఒకవిచిత్రశక్తి ప్రభావంతో అగ్నిపర్వతాలు పగిలినట్లు, వర్షాకాలంలో కృష్ణానదికి వరదవచ్చినట్లు, ఆ తడిబట్టల్లోఉన్న ఆమె స్త్రీత్వం కదలబారింది.

తత్ఫలితంగా సంసారాన్ని, బిడ్డల్ని, సౌఖ్యాన్ని వదిలివేసి అస్సాం టీ తోటల్లో ఒక మారుమూల గుడిసెలో తన కడుపున పుట్టిన బిడ్డచేతనే అనుక్షణమూ ద్వేషింపబడుతూ కుష్ఠురోగంతో చావాల్సిన దుర్గతి పడుతుందని ఆమెకి ఆ క్షణంలో తెలిస్తే బహుశా అలా చేసిఉండకపోయేదేమో.

ఏది ఏమయినా స్నానంచెయ్యనిదే పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టని ఆ స్త్రీ అస్సాం టీయాకుతోటలో కూలీగా చేరి రెండాకులూ ఒకమొగ్గచొప్పున తుంచుతూ జీవించటం ప్రారంభించింది ఆమెను ఇల్లుదాటించి తీసుకువచ్చినవాడు అతిత్వరలోనే అంతర్ధానమయినాడు.

అందు కామె విచారించలేదు కూడా. పగల్లా తోటల్లో పనిచేసి సాయంత్రం గుడిసెకువచ్చి ఏం తింటుందో,

ఏం తినదో ఆ అంతర్యామికే తెలియాలి. మిగతా కూలీలందరికీ ఆ బాపనమ్మారంటే ఎక్కడలేని అభిమానమూను.

ఏనాడూ ఆమె తలదువ్వుకోటమూ, నవ్వటమూ చేయలేదు. పగలల్లా పనిచేసి సాయంత్రం ఆ మురికి గుడిసెలో చింకిచాపమీద పడిఉన్నప్పుడు,

మునిపల్లెలాంటి తన పల్లెటూరూ, దేవతార్చనచేసి పురుషసూక్తం చదువుతున్న భర్తా,వృద్ధురాలైన అత్తగారూ, గుమ్మడిపళ్ళలాంటి తన ఇద్దరుపిల్లలూ తప్పకుండా గుర్తుకి వచ్చి ఉంటారు. అప్పుడయినా ఆమె పశ్చాత్తాప పడిందో, లేదో ఆ భగవంతుడికే తెలియాలి.

ఈ పరిస్థితిలో ఒక ఫ్రెంచిదొర టీ తోటల్లో ఉద్యోగిగా వచ్చాడు. తలదువ్వుకోకుండా చింపిరిబట్టల్లో నిశ్శబ్దంగా పనిచేసుకుని పోతున్న ఈ స్త్రీ అతనికి ఆకర్షణనీ,ఆశ్చర్యాన్ని కలిగించింది. ఒక నెలరోజులు నడిచినతరువాతగాని దొర తన వెంబడి తిరుగుతున్న సంగతి గ్రహించలేదు. ఆమె ఒకసారి నవ్వుకుని తన్ని పరీక్షగా చూసుకుంది.

చింకిగుడ్డలచాటునించి తొంగిచూస్తున్న ఈ నాలుగు బొమికలలోనూ ఇంకా స్త్రీత్వం మిగిలివున్నదా? అనిపించింది ఆమెకి. ఈ సృష్టిలోఉన్న నాశనంలేని పదార్థాలలో స్త్రీత్వం ఒకటి అన్న సంగతి ఆమెకు తెలియలేదు. ఇంకో విచిత్రం ఏమిటంటే, ప్రతిస్పందన అనేది మానవహృదయానికి ఒక శాపం.

ఆ శాపఫలితంగానే ఆమె దొరకి లొంగిపోయింది. బాపనమ్మారు గుడిసెలోంచి దొరబంగళాలోకి మారటం

ఎవరికీ ఆశ్చర్యం కలిగించలేదు. పైగా ఆమె అదృష్టానికి అందరూ అభినందించారుకూడా.

ఆమె అందుకు ఆనందించలేదు, విచారించానూలేదు. విధికీ, కాలానికీ లొంగిపోయి యాంత్రికంగా జీవించటం అలవాటయింది ఆ సమయంలోకూడా తన జాతినీ, నమ్మకాన్నీ ఆమె వదలలేదు. ఏకాదశులూ, శనివారాలుఉంటుంది. మాంసంతినదు. దొరతో ఒక్క దైహికసంబంధం మినహా మరేమీ ఆమెకు ఆనందం కలిగించటంలేదు.

దొరకిమాత్రం ఆమెఅంటే ప్రాణం. ఆమెకళ్ళల్లోనూ, ముఖంలోనూ, ఉన్న పవిత్రతనిచూసి అతను చాలా ఆశ్చర్యపోయేవాడు. నాగరికతకీ, విచ్చలవిడికీ పేరుమోసిన ఫ్రాన్సులో ఏ స్త్రీలోనూ, కనిపించని పవిత్రతా, ప్రత్యేకతా పతితురాలైన ఈ బ్రాహ్మణయువతిలో కనిపించి అతడిని ముగ్ధుడిని చేసినయ్.

ఆమెకూడా క్రమంగా ఆ జీవితానికి అలవాటుపడింది. అప్పుడప్పుడు నవ్వుతుందికూడా. ఆ రోజు దొరకి పండుగ. ఫ్రాన్సులో తనకి ప్రధానంఅయిన స్త్రీ విషయం పూర్తిగా మర్చిపోయినాడు. అతను సరిగ్గా దొరబంగాళాలో ప్రవేశించిన మూడు సంవత్సరాలకు ఆమెగర్భవతి అయింది. ఆ సంగతి తెలిసిన రోజున దొర చాలా ఆనందించాడు. ఆమె మొగంలో చిరునవ్వు తిరిగి పూర్తిగా అంతర్హితమై పోయింది.

దొర చాలా సంస్కారవంతుడు, చదువుకున్నవాడు. ఉద్రేకాలకూ, చాంచల్యానికీ పేరుమోసిన ఫ్రెంచిరక్తమూ, శాంతానికీ, నిగ్రహానికీ కేవలమైన ప్రాచీన బ్రాహ్మణ

రక్తం, పంచుకుని ఒక తుఫానునాటి అర్ధరాత్రి వారిజ ఈభూమి మీద పడింది.

ఆమెజన్మకి తల్లి దుఃఖిస్తే తండ్రి ఆనందించాడు. అయితే తల్లి పైకిదుఃఖించలేదు; తండ్రి పైకిఆనందించాడు. ఆ పిల్లని తండ్రి వర్జీనియా అంటాడు. తల్లి వారిజా అంటుంది. వారిజబాల్యం తండ్రి శిక్షణలో గడిచింది. పొరపాటున కూడా తల్లి ఆమెను దగ్గరకుతీసేదికాదు ఆ పిల్లనిచూస్తేనే ఆమెకు భయం.

ఈ పరిస్థితిలో పిల్ల బాధ్యతనీ, భారాన్ని తనే తీసుకున్నాడు దొర. వారిదిసి ఒక విచిత్రమైన నలుపు. ఆ ఛాయ ఎలా వచ్చిందో దొరకి తెలుసు. ఆమెతల్లి వారిజని కడుపులో ఉండగా విషం తిన్నది. గర్భంపోగొట్టుకోవాలని ఆమె ఉద్దేశ్యం. కాని అలాజరుగలేదు. ఫ్రెంచిదొర రక్తఛాయల్లో పెరుగుతున్న ఆపిండానికి విషం చక్కని నీలి మొఖమల్ ఛాయ ఇచ్చింది.

ఆఛాయ ఈ ప్రపంచంలో మరెవరికీ ఉండటానికి వీల్లేదు. తండ్రిదగ్గర ఫ్రెంచిభాష. నేర్చుకుంటూ, తల్లి మాట్లాడుతున్నప్పుడు విని తెలుగుని అభిమానిస్తూ వారిజ పదేళ్ళ పిల్ల అయింది.

తల్లిఅంటే వారిజకి అసహ్యం. వారిజ అంటే తల్లికి భయం. వారిజ పుట్టిన తరువాత దొరకీ, ఆమె తల్లికీ దేహ సంబంధంకూడా తీరిపోయింది ఆ పెద్ద బంగాళాలో ఏకాదశులుంటూ ఏమూలో పడిఉంటుంది ఆమె. ఆవిడ సంగతి ఎవరూ పట్టించుకోరు.

ఆ తేయాకుతోటల మధ్యనే వారిజబాల్యం గడిచింది. ఆమె శ్యామలవర్ణం మరింత స్వచ్ఛమయినది. ఆమె పదిహేనవఏట దొర హఠాత్తుగా చనిపోయాడు. వారిజకి జీవతంలో మొదటితడవ అనుభవమైన దుఃఖం ఇదే.

దొర తనకున్నసర్వస్వాన్ని వారిజకి ఇచ్చిపోయినాడు. ఆ ఆస్తితో అయిదు తరాలవరకూ హాయిగా బ్రతకవచ్చును. తండ్రిపోయినాక అక్కడఉండటం చాలా కష్టం అనిపించింది ఆమెకు. తల్లితో ఆ విషయం చెప్పింది ఈపదిహేనేళ్ళనించీ తల్లి తనతో మాట్లాడిన మాటలు ఏ అయిదారో ఉంటాయి.

"నేనురాను నువ్వెళ్ళు"అన్నది ఆవిడ.

వారిజ తనఆస్తిఅంతా డబ్బుగా మార్చుకుని మద్రాసు వెళ్ళిపోయింది. ఆమెకు మైనరువెళ్లేదాకా గవర్నమెంటే గార్డియన్. అ తరువాత తన తల్లినిగురించిన కబుర్లు రెండే తెలిసినాయి. ఒకటేమో తేయాకుతోటలో కూలిచేసుకుంటున్నదని... రెండోది కుష్టురోగంతో బాధపడుతున్నదనీ.

రెండోతడవ తను డబ్బుపంపింది. తల్లి ఆ డబ్బు తీసుకోలేదు. తరువాత తెలిసిన కబురు ఆమె చనిపోయిందనే; ఆ వార్త విన్నప్పుడు వారిజ కొద్దిగా చలించింది. మరుక్షణం లోనే మామూలుగా అయింది. దూరపుచుట్టరికంఉన్న ఏ ముసలమ్మో పోయినట్లుగా ఆమెకు అనిపించింది.

నాలుగయిదు రోజులు పోయినాక ఆమెకు ఒక ఉత్తరం వచ్చింది. అందులో రెండుపేర్లు, వాటి చిరునామాలు ఉన్నాయి. క్రిందగా 'వీళ్ళు నీ అన్నలు' అనిఉంది. వారిజ

విసుగ్గా వాటివంకచూసి పెట్టిలోపడేసి వెంటనే ఆ సంగతి మర్చిపోయింది.

వారిజలో ఒక విచిత్రస్వభావం ఉన్నది. అదేమిటంటే తనెప్పుడూ ఎదటవాళ్ళకు ఒక సమస్యగా ఉండాలని ప్రయత్నించటం. ఆ ప్రయత్నంలో ఆమె గెలిచిందనే చెప్ప వచ్చును.

ఇక ఆ తరువాత మద్రాసులో ఆమె జీవితం రక రకాల వ్యక్తులతో గడిచింది.

అ తరువాతెప్పుడో వారిజకథ వ్రాస్తూ రామలక్ష్మి ఇలా వ్రాసింది. "వారిజకథకీ, శరత్ బాబు వ్రాసిన శేష ప్రశ్నలో కమలకథకీ చాలా పోలిక ఉన్నది. ఆ కె కూడా ఇలాగే జన్మిస్తుంది. ఇలాగే తేయాకుతోటల్లో పెరుగు తుంది. అయితే వారిజకీ, కమలకీ వ్యక్తిత్వంలో ఏమాత్రమూ పోలిక లేదు. వారిజ ధనవంతురాలు, కమలికి ఆ అదృష్టం లేదు.

ఏది ఏమయినా అది కథ, ఇది జీవితం, ... అలా అను కోటానికికూడా వీలులేదు. ఒకసారి ఏదోమాటలసందర్భంలో ఒక ప్రఖ్యాత బెంగాలీ రచయిత వాళ్ళ నాన్న స్నేహితుడని అన్నది వారిజ.

బహుశా ఆ రచయిత శరత్ చంద్రుడే కావచ్చును. విచిత్రమైన ఈ కథని ఆయన కథావస్తువుగా తీసుకునే ఉండ వచ్చును. కాని ఇంకో కేమిటంటే, కథలో మొదటి భాగం మాత్రమే ఒకటి- మిగతా కథలు వేరు"

* * *

మోహనమూర్తి చెక్కిలిమీద, తనచెయ్యి అలాగే ఉంది. ఆ అయిదారు క్షణాల్లో గత జీవితం అంతా జ్ఞాపకం వచ్చింది, వారిజకి. వారిజ అలా నిశ్చేష్టురాలైపోవటం చూసిన మోహనమూర్తి మళ్ళీ "వారిజా" అన్నాడు. ఆ పిలుపుతో ఈ లోకంలో పడ్డది వారిజ. ప్రపంచమూ, ప్రకృతీ కూడా మోహనరాగాన్ని ఆలాపిస్తున్నయ్.

స్త్రీగా రకరకాల అనుభవాలలో మొదటి అనుభవం జ్ఞాపకం వచ్చింది, వారిజకి. తను అనంతమైన సంపదతో వచ్చి మద్రాసులో ఉంటున్నది... క్షమిస్తే ఇక్కడ చిన్నవిషయం. "వారిజకి ఏ వయసులో ఏ అనుభవం జరిగిందనే ప్రశ్న అప్రస్తుతం. ఆమెకు వయసులేదు. మానససరోవరంలో ఒక కమలాలుంటాయి; ఒకసారి వికసిస్తే ఇక తిరిగి వాడిపోవు. ఎంతకాలం? అనే ప్రశ్నకి కూడా సమాధానం నాకు తెలియదు" రామలక్ష్మి వారిజని గురించి పై మాటలు వ్రాసింది. అందుకోసమే ఏ వయసులో అనే విషయం మనకథకి అనవసరం... వారిజ ఒక్కసారి వెనక్కినడిచి తన మొదటి అనుభవం దగ్గర ఆగింది.

తల్లి పాపం పిల్లల్ని వెంటాడినప్పుడు వాళ్ళేంచేస్తారు?- అన్న ప్రశ్నకి ఈనాటికీ సమాధానంలేదు. షేక్స్పియర్ మహాకవి ఇది పరిష్కరించడానికి ప్రయత్నించి లాభంలేక విరసపెట్టి అందరినీ చంపేసి చేతులుకడుక్కున్నాడు.

ప్రకృతి, వాంఛ, మానవత్వం వీటికి నీతితో ఎంత వరకు సంబంధం?- అన్నది ఒక సమస్య. నిజం చెప్పాలంటే నీతికి వీటితోనే సంబంధం ఉందేమో! "అశాశ్వతమైన మానస

వుడి పరిమిత జీవితంలో నీతిపేరిట శిక్ష అనుభవించే కాలం అధికం అయినప్పుడే అతనిలో విప్లవాత్మకమైన నిప్పు రాజు తుంది. నీతిసౌధాలు శాశ్వతంగా కాకపోయినా తాత్కాలి కంగానయినా కాలిపోతాయి.

శేషించిన మానవత్వం ఆభస్మాన్ని ధరించి విలయతాం డవం ప్రారంభిస్తుంది. అప్పుడే వారిజలాటి వ్యక్తులు ఆ శేష భస్మంలోంచి మరో నూతనసౌధ నిర్మాణం ఆరంభిస్తారు.

ఆ మహాసౌధంలోనికి ఎటు వెళ్ళాలో తెలియని కొందరు దానిముందు నిలబడి ఆశ్చర్యంగాచూస్తూఉంటారు.

మేడమీదనుంచి ఒక స్నేహితురాలు దారేవెళ్ళటం చూసి గబగబా మెట్లుదిగి వస్తున్న వారిజ సగంమెట్లు దిగి ఒక యువకుడికి 'ఢీ' కొంది. తల ఎత్తి అతనివంక చూసింది. అతనూ అలాగే ఆమెవంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ప్రపంచం తిరిగిపోతోంది. సముద్రాలు గతులు తప్పాయి. లోకానికి లోకమూ, ఎక్కడకో వేగంగా ప్రయా ణిస్తున్నది.

ఆలోచన, బుద్ధి, ఆంతర్యం, చైతన్యం-అన్నీ ఒక రక్త సంబంధంకోసం ఆరాటపడటం ప్రారంభించాయి. ఆ రక్తం అగ్నిద్రావకంలా మరిగిపోతోంది. ఎవరు? ఎవరికక్కడ?

ఆ యువకుడు తెప్పరిల్లి "మీరు?" అన్నాడు.

"వర్జీనియా" అని సమాధానం ఇచ్చింది వారిజ.

"సంతోషం! మీరుఅచ్చ హిందూస్త్రీలా ఉన్నారు?" అని ఇంగ్లీషులో సమాధానం ఇచ్చాడు ఆ యువకుడు.

"ఇంతకీ మీరెవరో చెప్పారుకాదు!" అన్నది వారిజ అచ్చమైన ఆంధ్రభాషలో.

అతడు ఆశ్చర్యపోయి "మీరు తెలుగు ఎలామాట్లాడుతున్నారు!" అన్నాడు.

"మీ వేషంచూసి దొర అనుకుని నా పేరు వర్జినియా అని చెప్పాను నేను వారిజను."

"వారిజ" ఈ పేరు మెడికల్ కాలేజీ ఆవరణలో తను చాలాసార్లు విన్నాడు... అసలు తను ఇక్కడికెందుకొచ్చినట్లు? దారేపోతున్నవాడికి ఈ మేడలో ఎవరుంటున్నారో చూడాలనే కోరిక ఏ అజ్ఞాతశక్తి ప్రేరేపణో అతనికి తెలియలేదు.

"పైకిరండి, కాఫీతీసుకుని వెడుదురుగాని" అని ఆహ్వానించింది వారిజ. ఇద్దరూ పైకివెళ్లారు. కూర్చున్నతరువాత "ఇంతకీ మీరెవరో చెప్పారుకాదు!" అన్నది ఆమె.

"నా పేరు సత్యనారాయణ. నేనిక్కడ మెడిసిన్ చివరి ఏడు చదువుతున్నాను. మా తమ్ముడు రమణమూర్తి. 'లా' చదువుతున్నాడు"అని జవాబు ఇచ్చాడుఅతను.

వారిజకి సమాధానం ఎలాఇవ్వాలో తెలియలేదు. తను ఎవరినని చెపుతుంది? తన జాతి ఏది? తను ఏ ప్రశ్న అతనినుంచి వస్తుందని భయపడుతోందో ఆ ప్రశ్న అతను అడగనే అడిగాడు.

"మీరెవరు?"

వారిజ తెలివిగా నవ్వి "నేను స్త్రీని...ఎవరూ స్త్రీని 'మీరెవరు?' అని అడగకూడదు" అన్నది.

అవును ఆమె స్త్రీ. హిమగిరి శిఖరాన్నుంచి రాలిపడిన తెలుగుముద్ద, అర్ధరాత్రి స్మశానంలో కనిపించే మంట, చందమామలోంచి జారి రాలిన వెన్నెలరేఖ, అవును. ఆమె స్త్రీ.

అతనుకూడా నవ్వి "మీరు స్త్రీలన్నమాట నిజమే... 'ఆవులు' అన్నమాట ఆవుకీ ఆవుకి భేదం తెలియ చెయ్యకపోయినా 'అది ఎవరి ఆవు?' అన్నప్రశ్న వాటి వ్యక్తిత్వాన్ని విడగొట్టేస్తుంది. నే నడిగిన ప్రశ్న అది. మీ రెవరికి సంబంధించినవారు?" అన్నాడు.

"ఇంతవరకూ కేవలం నాకు నేనే సంబంధించి ఉన్నాను" అని పెంకిగా జవాబిచ్చింది వారిజ.

"చెప్పటం ఇష్టంలేకపోతే పోనియ్యండి... మీ రంగు చాలా విచిత్రంగా ఉంది. గాజుసీసాలో లేత నీలం నీళ్ళు కదులుతున్నట్లు... ..."

"మీరు డాక్టరుగా! ఇదేమన్నా జబ్బేమో సెలవియ్యండి."

"జబ్బుకాదుగాని పురాణాల్లో కృష్ణుడిని నీలమేఘశ్యాముడని వర్ణించటం విని అదంతా హంబక్ అనుకున్నాను"

"ఇప్పుడు?"

"అది నిజమే అనిపిస్తున్నది. కొంపతీసి మీరు నీలం రంగు పూసుకోలేదుకద?"

"కొంచం చర్మంకోసి లాబొరేటరీకి పంపుతారా ఏమిటి? నాకూ బాధగానే ఉంది ఈ రంగు" అని నవ్వింది వారిజ.

"ఇంత అందమైన రంగు ప్రపంచంలో ఉంటుందని ఎవరయినా చెపితే ప్రాణంపోయినా నమ్మేవుండేవాడిని కాదు."

"శాస్త్రిగారూ! మీరు నన్నెపుడయినా చూశారా?"

"లేదు"

"నేను మాత్రం మిమ్మల్ని ఎక్కడో చూశాను. ఎంత ఆలోచించినా గుర్తు రావటంలేదు."

శాస్త్రి కొద్దిగా కలవరపడ్డాడు ఆ మాటకి. కాని వారిజ కళ్ళల్లో మరో దుర్భావంలేదు.

ఎప్పుడూ నవ్వుతూనే ఉంటుంది. అతని మొగం. కోపంవచ్చినప్పుడు అతను ఆ కోపాన్ని నవ్వుతూనే చూపిస్తాడు. జీవితాన్ని పరిపూర్ణంగా అర్థంచేసుకున్న వేదాంతిలా నవ్వుతూవుంటాడు శాస్త్రి.

ఆ నవ్వు ఎదటివాళ్ళకి అద్దంలాటిది. ఆ అద్దంలో ప్రతి వాడూ తనని తను చూసుకోవచ్చును.ఆ నవ్వుచూసి వారిజ కలవరపడ్డది. ఇతనెవరో తనవాడు. తనకి, ఇతనికీ ఏదో అజ్ఞాత సంబంధం ఉంది.

"మిమ్మల్నిమాత్రం ఎక్కడో చూశానండీ" అన్నది.

"బహుశా పూర్వజన్మలో నేమో" అని మళ్ళీ నవ్వాడు అతను.

"అయిఉండవచ్చు" అన్నది వారిజ తలవంచుకుని.

శాస్త్రి ఉలిక్కిపడ్డాడు. 'ఎవరీ అమ్మాయి? కాస్త నీతిశీలలు ఒదులుగా ఉన్నట్లున్నాయి!' అనుకుని పైకి తన ఉలికిపాటుని వ్యక్తపరచకుండా లేచినుంచుని-

"మళ్లీ రెండురోజుల్లో వస్తాను. ఈలోగా నన్ను ఏ జన్మలో చూశారో జ్ఞాపకం తెచ్చుకోండి" అని వెళ్ళిపోయి నాడు.

అతను వెళ్ళిపోయినాక వారిజ చాలాసేపు ఆలోచించింది. ఎక్కడచూసిందీ ఎంతకీ గుర్తు రాలేదు. నిజంగా ఒక వేళ పూర్వజన్మలోనే చూసిందేమో! ఆ ఊహాకి తనలో తనే నవ్వుకుని సోఫాలో వెనక్కివాలి కళ్ళుమూసుకుంది వారిజ.

రెండురోజుల్లో వస్తానన్నవాడు వారం రోజులకికూడా రాలేదు శాస్త్రి.

వారిజకి ఎందుకో చిరాకు అనిపించింది. పనిమనిషి మీదా, వంటమనిషిమీదా రెండుమూడు తడవలు విసుక్కుంది కూడా. ఒకనాటి సాయంత్రం వారిజ చదువుకుంటూ ఉండగా ఒక యువకుడు పైకివచ్చి నమస్కారంచేసి ఒకచీటీ ఇచ్చాడు.

"వారిజగారూ!

నేను రాలేకపోయినందుకు క్షమించండి. ఊరికి వెడుతున్నాను పదిరోజులలో వచ్చి మిమ్మల్ని చూస్తాను.

సత్యనారాయణశాస్త్రి"

వారిజ ఆ చీటీచదువుకుని తలెత్తి ఆ యువకుడివంక చూసింది. అతనిలో శాస్త్రి పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. బహుశా ఇతనే రమణమూర్తి అయివుంటాడు. శాస్త్రిని ఎక్కడో చూశానని ఎలా అనుకుందో సరిగ్గా

ఋతన్నిచూసీ అలాగే అనుకుంటోంది ఆమె. 'ఎక్కడో చూశాను! ఎక్కడ? ఏమో!'

"కూర్చోండి- మీ పేరు రమణమూర్తి కదూ?"

"అవును"

"శాస్త్రిగారు ఊరికివెళ్లి ఎన్నిరోజులయింది?"

రమణమూర్తి కొద్దిగా సిగ్గుపడి "వారం అయింది. అప్పటినుంచీ చీటీ తెచ్చిఇద్దామనే అనుకుంటూ బద్ధకించాను" అన్నాడు.

"సరే పోనీండి... మీరు 'లా' చదువుతున్నారా?"

"అవును"

లేతగా, తెల్లగా, అప్పుడే విచ్చిన గడ్డిపూవులా ఉన్న రమణమూర్తితో శాస్త్రిని పోల్చటం ప్రారంభించింది వారిజ.

శాస్త్రి గంభీరుడు, జీవితాన్ని అర్థంచేసుకున్న ఉన్నతుడు; కళ్ళజోడుచాటునుంచి ప్రపంచాన్ని వెక్కిరిస్తూ ఉంటాయి అతని కళ్ళు... ప్రపంచం తనని వెక్కిరిస్తుందేమో అని కళ్ళజోడు చాటుచేసుకుంటున్నట్లుంటాయి రమణమూర్తి కళ్లు.

ఈ అన్నతమ్ములిద్దరూ కూడా విచిత్రంగానే ఉన్నారు అనుకుంది వారిజ. రమణమూర్తికూడా వారిజని విచిత్రంగా చూస్తున్నాడు. వాత్సల్యంగా అతనివంకచూసి నవ్వింది వారిజ.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"మీకూ, మీ అన్నగారికీ ఆకారంలో పోలిక లున్నాయిగాని స్వభావంలో లేవనుకుంటాను- అవునా?" అన్నది వారిజ.

"మా అన్నయ్యని ఇదివరకు ఒకసారే చూశారు. మీరు-నన్ను చూడటం ఇప్పుడే మొదటిసారి. అప్పుడే మా స్వభావాన్నిగురించి మీ రెలా నిర్ణయిస్తారు?"

"మిమ్మల్నిద్దరినీ నేను బాగా ఎరుగుదు ననిపిస్తున్నది. మీ చేతిలో పుస్తకం ఏమిటి?"

"హామ్లెట్"

"అతని తల్లినిగురించి మీ అభిప్రాయంఏమిటి?"

"ఏమీ లేదు. ఆమెతల్లి, అంతే! అయినా సారస్వతం యొక్క ఉద్దేశ్యం జీవితసమస్యలకి సమాధానం ఇవ్వడం కాదనుకుంటాను. తల్లితండ్రిల పాపం పిల్లల్ని వేడిపిస్తు న్నప్పుడు వారేం చేస్తారు?-అన్నప్రశ్నకి అతను సమాధానం ఇవ్వలేక పోయినాడు."

"ఎట్లా జీవించడం- అన్నదానికన్న ఎట్లా చావడం- అన్నదానికి అతను సరిఅయిన సమాధానం ఇచ్చాడు...సరే పోనివ్వండి - మీ నాన్నగారు ఏం చేస్తూ ఉంటారు?"

"చేసేందుకేముంది? ఆయన అగ్రహారీకుడు, ఆస్తి ఉన్నది."

"మీ అమ్మగారు ఉన్నారా?"

ఆ ప్రశ్నకి రమణమూర్తిముఖం వాడిపోయింది. కొన్నిక్షణాలు అతను మాట్లాడలేదు. తరువాత-

"చనిపోయినారు" అన్నాడు.

వారిజకి తన తల్లి జ్ఞాపకంవచ్చింది. తనతల్లి ఊహ వచ్చినప్పుడు ఆమె రమణమూర్తిలాగా ఏనాడూ విచారం కనిపించనీయదు ... కనిపించటానికి మనసులో ఉంటేగా! తల్లిని కల్పుకుంటేనే అతను విచారిస్తున్నాడు. అతని తల్లి ఉత్తమురాలు. తన తల్లి ...?

"మీా నాన్నగారు ఉన్నారా? "

"ఉన్నారు"

"అదృష్టవంతులు. నా కెవరూ లేరు" అన్నదివారిజ. ఆమెకి దొర జ్ఞాపకంవచ్చాడు. ఫారిన్నునుంచి వచ్చి తనని ఇండియాకి అర్పించి అతను జీవితం చాలించాడు. జాతికీ మతానికీ, అతీతంగా జన్మించిన తనకి హిందూసంఘం ఏ స్థానం ఇస్తుందో తనకి తెలుసు! కనకే ఆమె తన జాతిని, మతాన్ని ఏనాడూ చెప్పదు అందుకే ఆమె లోకానికి ఒక సమస్య...లోకానికేకాదు; తనకి తనే ఒక మహాసమస్య. ఆమె కళ్ళల్లో నీరు నిలిచింది అది చూసి రమణమూర్తి ఆశ్చర్యపోయినాడు.

"క్షమించండి రమణమూర్తిగారూ! మీాకు కొంచం కాఫీకూడా ఇవ్వలేదు" అని లోపలికి వెళ్ళింది వారిజ. రమణమూర్తి ఆ గదిని పరిశీలించటం ప్రారంభించాడు.

ఆగది గోడలన్నీ లేత ఆకాశంరంగులో ఉన్నయ్. మూలల్లో ఎత్తుబల్లలమర్చి దానిమీాద పూలకుండీలు అమర్చి ఉన్నాయి. అందులో ఉన్న పూలన్నీ నీలం పూలు.

నేల అంతా లేత నీలపు తివాచీ ఉంది... కిటికీలోంచి ఆకాశం విరిగినపాలలాగా కనిపిస్తోంది. అంటే నీలం. విచిత్రమైన రంగు.

వారిజ ఇచ్చిన కాఫీతాగి బయటపడ్డాడు రమణమూర్తి. "మళ్లీరండి" అన్నది వారిజ.

బుద్ధిగా కోనసీమ పల్లెటూర్లో పెరిగిన తన మనసులో ప్రారంభమయిన ఈ కలవరం ఏమిటో రమణమూర్తికి అర్థం కాలేదు. వారిజ కులగోత్రాలు తనకి తెలియవు. స్వచ్ఛమైన తెలుగు మాట్లాడటంచేత తెలుగుపిల్ల- అనిమాత్రం తెలుస్తున్నది. వాకిట్లో బోర్డుమీాద మిస్ వర్జీనియా అనిఉంది... కొంపతీసి అన్నయ్య ఈమెను ప్రేమించలేదుగదా? ఆ ఊహకి రమణమూర్తి వణికిపోయినాడు ఎటు నడుస్తున్నదీ తెలియకుండా పోయింది.

ఒకవేళ అన్నయ్యే ఈమెను ప్రేమిస్తే...అతని మనసులో అసూయలాటి భావం తళుక్కు-మన్నది.

అన్నయ్య డాక్టరు. వాడికి జాతి మతాల పట్టింపులు లేవు. కాని తనకెందుకో జాతి మతాలమీాద నమ్మకం పోలేదు. ఈ లేత నీలపు వారిజని అన్నయ్య పెళ్లిచేసుకోటానికి నాన్న ఒప్పుకోడు. ఈ వయసులో తన తండ్రిని సుఖపెట్టాలనే ఉద్దేశ్యం అన్నయ్యకి తప్పకుండా ఉంటుంది కాబట్టి ఆ ప్రమాదం లేదు. రమణమూర్తికి ఏదో బరువుదించినట్లయింది.

వర్జినియా! బహుశా క్రిష్టియనేమో! మరి వారిజ అన్న పేరేమిటి? ఈ అమ్మాయి కొన్ని అబద్ధాలు ఆడు తున్నది.

ఈ వారిజ తమ నిశ్చలతని నాశనంచేసింది. భూత కాలమూ భావికాలమూ లేని మొగవాడికి, మిగిలిఉన్న వర్త మానాన్ని కూడా ఖైదుచేస్తుంది స్త్రీ. ఆ స్త్రీజాతికి ఏకైక ప్రతినిధి ఈ వారిజ.

తలఎత్తి ఆకాశంవంక చూశాడు రమణమూర్తి. మబ్బులు వారిజ ముంగురుల్లా కదులుతున్నయ్. తెలివి డబ్బూ ఉన్న స్త్రీకి అందంకూడా ఉండటం ప్రపంచానికి చాలా అనర్థదాయకం.

అంధకారాన్ని ఛేదించే స్త్రీనేత్రాలు నీలిమబ్బుల్లో నిలిచి మెరుస్తున్న సౌదామినీద్వయం ద్రాక్షరసాన్ని కన్నీటిగా వర్షిస్తుంటే అది త్రాగి మగవాడు మత్తెక్కి మధురస్వప్నంలో మహాశిల అవుతాడు. ఆ శిలకి హృదయం లేదని మళ్ళీ ఆ స్త్రీయే నిందమోపుతుంది.

రమణమూర్తికి ఆ గాలి-చీకటి భయం అనిపించాయి. ప్రపంచం పనిమీద వెడుతూ దిగవిడిచి పోయిన పసిపాపలా ఉంది అతని అవస్థ. అతని మనసులో అనంతమైన ఒంటరి తనం గూడుకట్టింది.

చాంచల్యమా! నీ పేరే స్త్రీ ... విచిత్రమా! నీవే వారిజవు ...

వాన వచ్చేట్లుంది. రమణమూర్తి గబగబా నడవటం ప్రారంభించాడు. కాని అతడు తడిసే పోయినాడు.

* * *

మనస్సులో జరుగుతున్న యుద్ధాలుబహిర్గతంకాకుండా చేసుకోటం ఆడదానికి చేతకాదు. పైగా అదేదో ప్రత్యేకత అని భ్రమిస్తుందికూడా. ఆ భ్రమనే కొందరు ఆయుధం అనుకుంటే మరికొందరు అలంకారం అనుకుంటారు. ఒక భ్రమతోనే బాధపడటంలో వాళ్ళకు సానుభూతి లేదు.

ఇతరులు జాలిపడాలి. అప్పుడే తృప్తి. ఆ ఇతరులు కూడా తమకి కిష్టమైన మగవాళ్ళుగా ఉండాలి. బహిర్గతమైన బాధతాలూకు అంతరార్థం బాధో, మోహమో, కోపమో నిర్ణయించుకోలేని అబల స్త్రీ.

వారిజ సరిగ్గా అలాటి స్థితిలోనే ఉంది. రమణమూర్తి వచ్చివెళ్ళిన తరువాత వారం గడిచింది. మళ్ళీ ఇద్దరిలో ఎవరూ రాలేదు. వాళ్ళిద్దరికోసం తను ఎందుకు ఎదురు చూస్తోందో, తన మనసులో ఉన్నది ఏమిటో; ఆమెకేమీ బోధపడటంలేదు.

వారిజ సన్నని సిల్కుచీర కట్టుకున్నది. కుడిచేతికి ఒక రాళ్ళగాజు, ఎడమచేతికి ఒక గడియారం ఉన్నాయి. కుడీ చేతిలో ఒక గులాబీపూలగుత్తి ఉన్నది. ఆమెప్రక్కనున్న టేబిలుమీద ఒక అందమైన నీలిగాజుపళ్లెంలో నల్లద్రాక్షపళ్ళు ఉన్నయ్. ఆమెకళ్లు అందంగా అగాధంగా ఉన్నాయి.

ఆమెచేతిలో ఒక కాశీమజలీపుస్తకం ఉన్నది. అందులో ఒక విచిత్రంగా ఉన్న కథ ఆమె చదువుతున్నది.

సాహిత్యంలోనూ రక్తంలోనూ కూడా మన స్వభావాలను ఒకమార్గంలో పెడుతున్న వ్యక్తులుంటూనే

ఉంటారు. వాళ్ళ ప్రభావం మనమీద ఉంటూనే ఉంటుంది. యుగయుగాలుగా వస్తున్న మానవచరిత్రలో తన చరిత్ర కూడా ఒక అధ్యాయం అనిపించింది వారిజకి.

ఆ పరిస్థితులూ, ఆ సంఘటనలూ తన జీవితంలో అనుభవంలోకి రాకపోయినా అది తన చరిత్రే! చెడుకూ, అపవిత్రతకీ అందం దిద్దుతున్న ఆ కథలూ, నవలలూ ఆమెకి ఇష్టం. ఆ కథల్లో వాళ్ళంతా తనకి సన్నిహితులు.

పుస్తకాన్ని పక్కనపెట్టేసి లేచి నిలబడింది వారిజ. అందాకా ఆమెఒడిలోఉన్న గులాబీపూలగుత్తి తివాచీమీద పడ్డది. దాన్ని చూస్తుంటే ఎందుకో జాలిఅనిపించింది ఆమెకి. సరిగ్గా ఆ సమయంలోనే శాస్త్రి లోపలకి అడుగుపెట్టాడు. వారిజ అపరిమితమైన సంతోషంతో అతనికి ఎదురుపోయి,

"భలేవారే! ఇన్నాళ్ళకా రావటం!" అన్నది. శాస్త్రి కూర్చుంటూ వారిజకేసి పరీక్షగా చూడటం ప్రారంభించాడు.

"ఏమిటి అలాచూస్తారు?"

"ఏమీలేదు. నేను ఏదో ఒక నాగలోకంలోకి ప్రవేశించినట్లు ఉన్నది. ఇక్కడంతా నీలమయం."

"మీరు డాక్టరుకదా! ఈ నీలం రంగు పోయేమార్గం ఏదయినా చెప్పుదురూ"

"ఆ నీలంరంగే మీ ప్రత్యేకత... మీరు సంగీతం కూడా పాడతారేమిటి?" అన్నాడు శాస్త్రి, ఆ గదిలో ఒక పక్కగాఉన్న వీణనిచూసి.

"ఏం, మీరు పాడరా?" అన్నది వారిజ ఓరగాచూస్తూ.

"నా ప్రశ్నకి అది సమాధానం కాదు."

"నా ప్రశ్నకి మీరసలు సమాధానమే ఇవ్వలేదు!"

"ఈ మధ్య ఊరికి వెళ్ళాను. మీకు మా వాడిచేత చీటీ పంపాను. అందలేదా?"

"అందిందిలెండి. మీనాన్నగారు ఎలా ఉన్నారు?"

"భేష్ ! మొత్తానికి వివరాలన్నీ తెలుసుకున్నారన్న మాట."

"ఏం, నేరమా?"

"ఎన్నటికీ కాదు."

"మరి"

"ఊరికే అన్నాను వారిజగారూ! మరి నేను వెళ్ళనా?"

"ఏమంత తొందరగా వెళ్ళిపోతున్నారు? కొంచెంసేపు కూర్చుని వెళ్ళండి."

"కూర్చోటానికి కాదు... కాని."

"కొంచం కాఫీతాగి వెళుదురుగాని" అంటూ వారిజ లోపలికి వెళ్ళింది.

సత్యనారాయణశాస్త్రి విచిత్రమైన స్థితిలోపడ్డాడు. మనస్సు చాలా విచిత్రమైనదని అతనికి తెలుసునుగాని ఇంత విచిత్రమైనదని అతనికి తెలియదు. అతను డాక్టరు. ఉద్వేగాలకూ, ఊహాలకూ మెదడులో ఎక్కడో ఒక ముడతగాని దేహంలోని చిన్న నరంగాని కారణం అవటం అతనికి ఆశ్చర్యాన్ని కలిగిస్తూఉంది.

విచిత్రంగాఉన్న శారీరక పరిస్థితులమీద ఆత్మ ఆధారపడి ఉన్నదనటం మరో చిత్రం. ఇవన్నీ అలాఉంచి బ్రతుకుని

గూర్చి చెప్పిన ఏ నిర్వచనంకూడా బ్రతుకుతో పోలిస్తే బ్రతు కంత ప్రాధాన్యమైనదిగా కనిపించటంలేదు.

ఆత్మకంటే... ఇంద్రియాలనుంచి తెలుసుకొనే విష యాలకే ప్రాధాన్యం యిస్తాడు శాస్త్రి. ఇప్పుడు అతని శరీరం ఒకరకమైన ఇంద్రియానుభూతి కోరుతోంది. యెవరో హఠ యోగంచేత అతనిలో నిద్రాణమైన కుండలినీశక్తిని రెచ్చ గొట్టినట్లుంది. సర్వరూపిణియైన ఆ మహాశక్తి అతని వెన్ను ముకలోంచి చరచరా పైకి పాకివస్తున్నది. అతని ఇంద్రి యాలు ఏదో కోరుతున్నాయ్.

సహజంగా శాంతమూర్తి అయిన శాస్త్రి తనస్థితికి తనే ఆశ్చర్యపోయినాడు. తనలో యింత వాంఛ వున్నదా?

కాఫీతీసుకుని వచ్చిన వారిజని మహాసాహసంతో తన మీదికి లాక్కున్నాడు శాస్త్రి. వారిజ హడలిపోయి కెవ్వున కేక వేసింది. శాస్త్రి పట్టువిడవలేదు. ఆమెను నలిపి చంపి వేయాలన్నంత వాంఛతో తన శరీరానికి అదుముకున్నాడు శాస్త్రి.

వారిజ భయంతో ఒణికిపోతున్నది. ఇది డ్రాయింగు రూము. వంటమనిషి, పనిమనిషి వస్తారు.

"శాస్త్రీ! నన్ను వదలిపెట్టు" అన్నది.

"వదలాలనిపించటంలేదు" అన్నాడు శాస్త్రి. అతని కంఠంలో ఒకరకమైన జీరవున్నది.

"నా మాటవిని ఇప్పుడువదులు, ఇది సమయం కాదు... నీకు నామీద ఎంత వాంఛవుందో నాకూ నీమీద అలాగే

ఉంది" అన్నది యెలాగో మాటపెగుల్చుకొని వారిజ. శాస్త్రి ఆమెని గాఢంగా ముద్దుపెట్టుకుని-

"ఒక పదినిముషాలు నామాటవిను" అన్నాడు.

వారిజ మాట్లాడ లేదు. ఆమెరక్తనాళాల్లో ప్రవహించే రక్తం నైన్‌లాటి ఘోరించేరక్తం. ఆమెలో భయంపోయి వాంఛే మిగిలింది. అయినా-

"ఇది బ్రాహ్మీముహూర్తం శాస్త్రీ! మరీ ఇంత ఒళ్లూపై మరచిపోతే ఎలా" అన్నది.

శాస్త్రి ఆమెను ఒదిలి సరీగా కూర్చున్నాడు వారిజ గబగబా బైటకివెళ్ళి అయిదు నిముషాల్లోవచ్చింది. స్నానం చేసి వచ్చినట్లుంది ఆమె వైఖరి. శాస్త్రి ఆమెనుచూసి-

"స్నానంచేశావా?" అన్నాడు.

"అప్పుడు నువ్వూచేస్తావా" అన్నది వారిజ.

శాస్త్రికీ వారిజకీమధ్య ఇప్పుడు తెరవమీ లేనట్లుగా వుంది. ఒక్క కౌగలింతతో వాళ్లిద్దరూ ఒకరి కొకరు నువ్వు అయిపోయినారు. చెయ్యను అన్నట్లు తలవూపాడు శాస్త్రి. వారిజ ఒకసారి దర్వాజాబైట చూసి గబగబా వచ్చి శాస్త్రి ఒడిలో కూర్చుని అతన్ని గట్టిగా తనకేసి అదుముకుని-

"నేను హిందూస్త్రీని కాదు శాస్త్రీ! ఫ్రెంచి యువతిని.—నాలో . సీతిశీలలు గట్టిగా లేవు—కాని నువ్వు శ్రోత్రియ బ్రాహ్మణుడివి - నీ కీ చాపల్యమేమిటి?" అన్నది.

"కామంకూడా కుండలినీశక్తి-అని యోగులు అంటారే అలాంటి దే వారిజా—దాన్ని హఠంచేత నువ్వు రెచ్చగొట్టావు ఏ జన్మలోనో! లేక ఈ జన్మలో నేనో!... నీవు నాకు

ఆత్మీయురాలివి—నీమీద నాకున్న ప్రేమని ఇంకోవిధంగా చూపించటం నాచేతకాక నిన్ను కౌగలించుకున్నాను. స్త్రీ పురుషశరీరాలవటంచేత వాంఛాపరిపూర్తి అవసరంఅయింది'' అన్నాడు శాస్త్రి.

"సరిగ్గా నాకూ అలానే అనిపిస్తుంది... ఇంకో తమాషా- నిన్నేకాదు...రమణమూర్తిని చూసినా నాకు అలాగే అనిపిస్తుంది'' అన్నది వారిజ.

శాస్త్రి సాలోచనగా వారిజవంకచూసి "రమణమూర్తినిచూస్తే కూడా అలానేవుందా?'' అన్నాడు. వారిజ అవునని తలవూపింది.

"ఇది విచిత్రంగానే వుంది'' అన్నాడు తలవంచుకొని శాస్త్రి.

"నువ్వు అపార్థంచేసుకుంటే నేనేం చెప్పలేనుగాని అది నిజం'' అన్నది వారిజ.

"నేను అపార్థం చేసుకోవటంలేదు. అలా చేసుకునే మనస్తత్వం కూడా కాదు నాది. కాని కారణం ఆలోచిస్తున్నాను'' అన్నాడు శాస్త్రి. వారిజ మాట్లాడలేదు. అతని ఒడిలోంచి అవతల సోఫాలో కూర్చుంది.

"ఇంతకూ నువ్వు ఫ్రెంచి పిల్లవా'' అని మరోప్రశ్న వేశాడు శాస్త్రి.

"అవును. నేను ఫ్రెంచిదొరకే, హిందూస్త్రీకి జన్మించిన అక్రమ సంతానాన్ని'' అన్నది వారిజ. శాస్త్రి నవ్వి -

"సృష్టికి సక్రమమూ అక్రమమూ లేదు వారిజా! స్త్రీ పురుష శరీరాలు సృష్టిచేయడంలో, అసహజంగాని,

అపార్థంచేసుకోడానికి కారణంగాని లేదు. సంఘజీవితాన్ని శాసించిన స్మృతికర్తల దృష్టికి నీవు అక్రమ సంతానానివి అయినా, భగవంతుడి సృష్టికి నీవు సక్రమసంతానానివే... నాబోటి వైద్యుడి దృష్టికి నీవొక పరిశీలించదగ్గ విచిత్రవ్యక్తివి కూడా" అని నవ్వాడు శాస్త్రి.

"అయితే నీకు అసూయలేదా శాస్త్రీ!"

"లేదు"

"అలా అయితే నీవు భగవంతుడితోనే సమానం."

"ప్రేమలోనూ, వాంఛలోనూ బలాత్కారానికీ లోభానికీ స్థానంవుండదు వారిజా. అప్పుడప్పుడు ప్రేమకొద్దీ బలవంతచేయడం సంభవించినా బలాత్కారం అనేది నా స్వభావానికి విరుద్ధం.ఎప్పుడయితే బలాత్కారంలేదో అప్పుడే అసూయకూడా ఉండదు. కేవలం జీవితమొక్కటే నాదిగా అనుకుంటాను" అన్నాడు శాస్త్రి. వారిజ ఆశ్చర్యపోయి-

"అసూయ లేకపోతే ప్రేమే లేదంటారు, దాని సంగతి?" అన్నది.

"వ్యక్తిత్వానికి ప్రాధాన్యం ఇస్తున్న నేటి సాంఘికజీవితంలో అసూయఉండక తప్పటంలేదు...వ్యక్తిగత మమతాశూన్యమయిన ఒకనాటి మానవజీవితంలో అసూయ మచ్చుకు కూడా ఉండేదికాదు"

"నువ్వుచెప్పేది నాకు అర్థంకావటంలేదు"

"ఇవయి అయిదు వందల సంవత్సరాలకిందట మానవుడి సంఘనిర్మాణం మరోమాదిరిగా ఉండేది. అప్పటి మానవజాతిలో వేరు వేరు కుటుంబాలుండేవి కావు. వ్యక్తి

సంబంధం లేకపోవటమే వారి మహోన్నతమైన మానవత్వా నికి చిహ్నంగా ఉండేది."

"అయితే వాళ్ళ కుటుంబాలన్నీ కలిసేఉండేవా!"

"అదికాదు. వారిలో అసలు కుటుంబమే లేదు"

"మరి వివాహాలు?"

"అప్పటివారి ఆచారాలు వింటే ఇప్పటివారుఅవినీతి-అని అపహసిస్తారు... కాని నిజంచెప్పాలంటే ఆనాటి మానవుడే సుఖంగాబ్రతికాడనిపిస్తున్నది. ఆ కాలంలో స్త్రీ ఒక రిదికాదు. ఏ ఒకనికీ ఆమె భార్యకాదు. ఏ స్త్రీకీ అతను భర్త కాదు. ఏస్త్రీ ఏ పురుషుడికయినా సంబంధించి ఉంటుంది."

"మరి అలాటపుడు తండ్రికి స్థానంవుండదు."

"అవును. అంతమాత్రంచేత ఏ శిశువూ ప్రేమనుంచి వంచితమవటం జరిగేదికాదు. ఆమాటకొస్తే ఇంకా అధికంగా ప్రేమించబడేది; ఈ శిశువు నాశిశువు కాకూడదా-అని ప్రతివాడూ భావించటంవలన ఆ శిశువు ఇంకా ప్రేమ పాత్రమవుతుంది."

"వారి ఈ పద్ధతి పశుప్రాయంగా లేదూ!"

"ఇప్పటివాళ్ళకి అది అలాగే తోస్తుంది... యువకులు సోదరులు,—వృద్ధులు తండ్రులు,—యువతులు చెల్లెళ్ళు,—ఇలాగే వారు ఉండేవారు. కేవలం కామోద్రేకులై నప్పుడే వారు స్త్రీ పురుషులు-అప్పుడూ ఆనందమేగాని కామం లేదు-ఆనాటి ఈర్ష్యారహిత సాంఘిక జీవితంలో హద్దులు లేకుండానే హద్దులు పాటించేవారు-ఇప్పుడు మనలోవున్న నీది, నాది, అనే ఊహ వారికి ఉండేదికాదు. అందుచే వారి

జీవితం సుఖంగా ఉండేది-దీన్నిబట్టి చూస్తుంటే సృష్టి అవటమే ముఖ్యంగాని సృష్టి ఎలా అయిందన్నది ముఖ్యంకాదు"

"కాని..."

"కాని లేదు; ఏమీలేదు" అందుకే నువ్వు ఫ్రెంచి దొరకీ హిందూస్త్రీకీ పుట్టిన అక్రమ సంతానాన్ని- అని సిగ్గు పడవలసిన పనిలేదు. అది సాంఘిక దృష్ట్యా తప్పయినా, సృష్టికర్త దృష్టిలో తప్పుకాదు."

"అది తప్పనే దృష్టితోనే నేను నా తల్లిని అసహ్యించుకున్నాను" అన్నది వారిజ విచారంగా.

"అజ్ఞానంచేత పొరపాటుచేశావు. ఈనాటి సాంఘిక నిబంధనల ప్రకారం ఆమె తప్పుచేసింది. విశాలమైన మానవ చరిత్రలో ఇంతమటుకూ అనుసరిస్తూ వచ్చిన ఆచారాన్ని చూస్తుంటే మనం ఎంత అజ్ఞానంలో బ్రతుకుతున్నామో అర్థం అవుతుంది. ఏ పద్ధతి ఏ కాలంలో సుఖంగా ఉంటుందని తోస్తే......ఆ కాలంలో ఆ పద్ధతిగా ఉండే సంఘాన్ని నిర్మించుకున్నాడు మానవుడు. మొదట్లో అతడు సుఖానికే ప్రాధాన్యత ఇచ్చాడు. అప్పుడతడు జ్ఞానికనుక... ఇప్పుడు సంఘానికే ప్రాధాన్యత ఇస్తున్నాడు. యుగయుగాలుగా నడిచిన చరిత్రని తిరిగిచూస్తే ఏ నియమంగాని నిబంధనగాని మారుతూరావటమే కనిపిస్తుందిగాని నిలకడగా ఉన్నట్లు ఎక్కడా కనిపించదు. ఈ పరిస్థితిలో అది తప్పు; ఇది ఒప్పు అని తీర్పు ఇవ్వటానికి మనకి అర్హత లేదు. అలా తీర్పుయివ్వటానికి ప్రయత్నించటం మనకున్న అల్పజ్ఞానాన్ని ప్రదర్శించుకోటమే అవుతుంది"

"మరి అమ్మ తప్పుచేయలేదా?"

"మీ అమ్మ ఏతప్పుచేసిందో నాకు తెలియదు... ఆ తప్పు కేవలం స్త్రీ పురుషులకి సంబాధించినదే అయితే అది తప్పు అనిపించుకోదు. ప్రస్తుత సంఘాన్ని అనుసరించి అది తప్పేఅయినా దృష్టి విశాలమయినప్పుడు అది తప్పు కానే కాదు."

"నువ్వు అంటున్నమాటలు నాకు చిత్రంగా ఉన్నయ్యి శాస్త్రి" అన్నది వారిజ.

"నేను డాక్టరుని. అయినా చరిత్ర నాకు అభిమాన విషయం. ఇప్పుడు నేను చెప్తున్న ఈ విషయాల్లో అసత్యం లేదు కాని ఈ మాటలు ఎవరన్నావింటే నన్ను నిందిస్తారు ఆ సంగతి నాకూ తెలుసు... బ్రతకవలసినవాడిని కనుక పైకి నేనూ నీతిగానే మాట్లాడుతూవుంటాను... కాని అప్పుడప్పుడు నిజం చెప్పాలనిపిస్తూ ఉంటుంది" అన్నాడు శాస్త్రి.

"కాని శాస్త్రీ! నేను చాతుసిలా ప్రవర్తించాను మా అమ్మవిషయంలో" అని నిట్టూర్చింది వారిజ.

"గడిచినదాన్ని గురించి ఆలోచించటం వలన ప్రయోజనం లేదు వారిజా!" అన్నాడు శాస్త్రి.

"నా కథ నీకు వినాలని లేదా?"

"లేదు"

"ఎందుకని?"

"ఏముంటుంది? ఏదో పొరపాటు చేసిందని లోకంచేత భావించబడుతున్న ఒక స్త్రీ కథ అయిఉంటుంది. రేపు నీకో

స్త్రీని పరిచయం చేస్తాను. ఆకథ విన్నతరువాత నీ కథ చెబుదువుగాని" అంటూ శాస్త్రి లేచాడు.

వారిజ అతన్నోసారి కౌగలించుకుని "రేపు వస్తావు కదూ!" అన్నది.

"తప్పకుండా వస్తానమ్మా" అన్నాడు శాస్త్రి.

"అమ్మా! ఏమిటి?"

"ఏం! ఎందుకు కాదు? స్త్రీలో మూడుపాళ్ళు మాతృత్వమూ ఒకపాలు స్త్రీత్వమూ ఉంటుంది. నా ఉద్దేశ్య ప్రకారంలోకంలో ఏ స్త్రీ అయినా ప్రేయసితోసహా అమ్మా అనటానికే అర్హురాలు"

"నీ అభిప్రాయాలన్నీ చాలా తమాషాగా ఉన్నాయి శాస్త్రీ!"

"మరి నేను వెడతాను" అంటూ వారిజని ముద్దపెట్టుకున్నాడు శాస్త్రి

వారిజ అతనిచేయి వదలకుండానే "రేపు రావాలి. ఆ అమ్మాయిని కూడా తీసుకురా" అన్నది. శాస్త్రి నవ్వుతూ,

"అలాగేలే- మరి చెయ్యివదులు." అన్నాడు. వారిజ అతని చేతిని ఒకసారి నొక్కి- వదిలివేసింది.

ఆమె లోపలికివెళ్ళి జరిగిన సంఘటనలని గురించి ఆలోచిస్తూ పడుకున్నది. అరగంట గడిచిందో; లేదో రమణమూర్తి వచ్చాడు.

అడుగులచప్పుడికి కళ్ళు తెరిచింది వారిజ. ఎదురుగుండా రమణమూర్తి.

"కూర్చోండి. ఏమిటిలా వచ్చారు?" అన్నది.

"మిమ్మల్ని చూడాలనిపించింది - వచ్చేశాను" అంటూ కూర్చున్నాడు రమణమూర్తి.

వారిజకి నవ్వువచ్చింది. ఈ అనిపించటానికి వెనకాల మరో అర్థం ఏమయినా ఉన్నదా? ఉండటంలో ఆశ్చర్యం లేదు. ఉండకపోవటంలోనే ఆశ్చర్యం ఉంది.

అనురాగం అంతర్యానికేసి తలపగలగొట్టుకు చస్తే ఆశ్చర్యపడవలసింది ఆంతర్యం కాదు. అదికూడా అనురాగం వంతే!

"చాలా సంతోషం" అన్నది వారిజ. కొంచెంసేపు వారిద్దరిమధ్యా నిశ్శబ్దం తల విరబోసుకుంది.

వారిజఊహాలలో శాస్త్రి నిండిపోయిఉన్నాడు. అతని సంస్కారం, అతని పాండిత్యం, అన్నిటినీ మించిన అతని లోకజ్ఞత ఆమెకు ఆకర్షణనీ అనురాగాన్ని కలిగించినయ్. ఈ రమణమూర్తి-వికసించటానికి కూడా ఓపికలేని విరజాజిలాటి ఈ రమణమూర్తి ... ఇతనంటే తనెందుకంత ఇష్టపడు తున్నది?

స్త్రీ. తన హృదయాన్ని సుందరమైన ఉద్యానవనంగా తయారు చేయాలని ప్రయత్నిస్తుంది. రకరకాల మొక్కలు నాటుతుంది. అయితే ఆ మొక్కలలో ఉమ్మెత్తమొక్కలు కూడా కలిసిఉంటయ్యి; లేదా పన్నీరుమొక్క అని భ్రమించింది; ఉమ్మెత్తమొక్కగా మారవచ్చును. ఈ రెంటిలో ఏదయినా ఫలితం మాత్రం విషాదాంతం...తన హృదయోద్యానంలో నిన్ననే మొదటిమొక్క నాటింది. ఆ మొక్క

అందమైనదీ అరుదైనదీ మాత్రమే కాకుండా మహావృక్షంగా మారి ఇతర్లని సేద తీర్చటానికి అనువైనది.

ఇప్పుడీ పేలవంగా ఉన్న పసిమొక్కని తీసికెళ్ళి నాటితే దానిని బ్రతికించటానికే బ్రహ్మప్రయత్నం చెయ్యాలి. నీళ్ళుపొయ్యాలి; నీడ నియ్యాలి. ఇన్ని అవస్థలు పడినా అది బ్రతుకుతుందో; బ్రతకదో! అనుమానమే... కాని చాలా సుందరమైన పసిమొక్క...

వారిజ తలెత్తి రమణమూర్తివంక చూసింది. అతను రెప్పవాల్చకుండా తననే చూడటం గమనించి తనలో తను నవ్వుకుంది. ఇతనితో మాట్లాడటానికి మాటలే దొరకటం లేదు... అతన్ని ఒళ్ళోకి తీసుకొని చీమకథ చెపుతూ చిచ్చి కొట్టి నిద్రబుచ్చితే... ఆ ఊహకి తనలో తనే నవ్వుకుంది ఆమె.

రమణమూర్తికి ఈ నిశ్శబ్దం నచ్చలేదు. తను రావటం ఆమెకి ఇష్టంలేదు కాబోలు–అనుకున్నాడు. లేచినిలబడి "నేను వస్తానండీ" అన్నాడు. అతని మనసులోఊహ గ్రహించింది ఆమె. కాని ఏమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా నమస్కరించింది. రమణమూర్తి మెట్లుదిగుతూ ఇక్కడికి రావటమనే పొరపాటు ఎందుకు చేశానా– అని పశ్చాత్తాపపడసాగాడు. బాల్కనీలో నిలబడి అతను కనిపించినంతమేరా చూసింది వారిజ. ఆమెహృదయంలో శాస్త్రి చంద్రుడైపోయినాడు. రమణమూర్తి నిశ్శబ్ద నీహారిక.

  

"జీవన వలయంలో ఏది ప్రారంభమో; ఎక్కడ అంతమో తెలుసుకోవాలంటే ఆ సృష్టికర్త కొక్కడికే అది సాధ్యం. మిరుమిట్లుగొలుపుతూ మహాభయంకరంగా పరిభ్రమిస్తున్న ఈ అగ్నిచక్రంలో తుదిమొదళ్ళని పరిశీలించటానికి బ్రతకదలుచుకున్నవాడెవడూ సాహసించడు... కాని అప్పుడప్పుడుకొందరు సాహసిస్తారు. ...ఆ కొందరిలో చాలామంది రచయితలై ఉంటారు. అందుకే రచయితలంటే నాకిష్టం." అన్నాడు శాస్త్రి.

శాస్త్రి, వారిజా, కాత్యాయనీ కూర్చున్నారు. లేత నీలంరంగు నక్షత్రచీరలో వారిజ సౌందర్యం కళ్ళకి మిరుమిట్లుగా ఉంది.

కాత్యాయనివయసు పాతిక ఉండవచ్చును. అనుభవాలూ, కన్నీళ్లూ ఆమెని మరి పదేళ్ళు పెద్దదాన్ని చేసినాయి. జనరల్ హాస్పటల్లో ఆమె నర్సు. శాస్త్రికి కాత్యాయని అంటే చాలా అభిమానం. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. శాస్త్రి అన్న మాటలకి కాత్యాయని నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు సిస్టర్" అన్నాడు శాస్త్రి.

"ఇది హాస్పటల్ కాదు డాక్టర్" అని మళ్ళీ నవ్వింది కాత్యాయని

"సరే... మరి ఎందుకు నవ్వావో చెప్పు" అన్నాడు శాస్త్రి.

"ఎందుకంటే, జీవితవలయం ఎంత భయంకరమైనదైనా అనుక్షణం ఆ వలయంలోంచి ఇటూఅటూ దూకక తప్పదు మనకి. అప్పుడప్పుడు నాలాంటివాళ్ళకి అవకాశం [illegible]

చర్చితంగా కూడా ఉంటుంది...ఇంకోటేమిటంటే మనం జీవితంలోని సారాన్నీ శోభనీ నెమరువేసుకోటంలో తృప్తీ ఆనందమూ ఉన్నది కాని జీవితంలోని మూలలకీ మలుపులకీ పోయి వెతకటంలో అర్థంలేదు సరికదా; సహ్యంకూడా కలుగుతుంది"

"నాకు తెలిసిన స్త్రీలలో ఒక్కతెకూడా నీవు నీభర్త కోసం చేసినత్యాగం చేసేవాళ్ళు కాదు. కాని లోకం కాత్యాయని మంచిది కాదంటుంది... స్త్రీలు వాళ్ళని అర్థం చేసుకోటం కష్టం" అని నిట్టూర్చాడు శాస్త్రి.

కాత్యాయని నవ్వి "ఒక స్త్రీ తన పాతరిబ్బన్‌ని వదిలి కొత్త రిబ్బన్‌తో జడేసుకుంటే అందంగానే కాకుండా ఆకర్షణీయంగా కూడా ఉంటుందన్న సంగతిని అంగీకరించే ఈ లోకం భర్తల విషయంలో అలా ఎందుకనుకోదో అర్థం కాదు. నాగరీకురాలైన స్త్రీకి ఇది ఎప్పుడూ చాలామంచిది. ఆరోగ్యంకూడా" అని పకపకా నవ్వటం ప్రారంభించింది ఆమె.

శాస్త్రికూడా నవ్వి "ఏభయియేళ్ళు దాటికూడా కొత్తరిబ్బన్లతో కాలంగడిపే వాళ్ళసంగతి!" అన్నాడు.

"వాళ్లు కేవలం అమృతమూర్తులు... అది సరేగాని అమృతం లేదూ!" అన్నది కాత్యాయని.

వారిజ వీళ్ళిద్దరి సంభాషణా వింటూ నిశ్శబ్దంగా కూర్చుంది. శాస్త్రి వారిజ ముఖంలో ఆశ్చర్యాన్ని పసిగట్టి;

"ఇలాగే మాట్లాడుతుంది కాచి! కాని చాలామంచిది కాదు కాచీ" అన్నాడు.

"అప్పను డాక్టర్ ... కాచీ-అని పిలిస్తేఆవిడ ఏమయినా అనుకోదూ?"

"ఏమీ అనుకోనులెండి కాత్యాయనిగారూ... శాస్త్రీ ఓవల్టీనా! కాఫీయా? టీయా? ఏం తాగుతారు చెప్పండి?" అన్నది వారిజ. కాత్యాయని ముఖం సీరియస్‌గా పెట్టి,

"నాకు ఇవేమీ అక్కరలేదు" అన్నది. వారిజ తెల్లబోయి శాస్త్రివంక చూసింది.

"ఖంగారుపడకు వారిజా! ... మరేంలేదు. కాచికి కాస్తంత ఘాటుపదార్థం కావాలి" అన్నాడు. వారిజకి ఇప్పుడు అర్థంఅయింది.

"కాని మాయింట్లో అదిలేదండీ!" అన్నది.

"మైడియర్ డాక్టర్! మీరు నన్ను అవమానించారు" అన్నది కాత్యాయని.

"ఊరుకో కాచీ! వారిజ ఖంగారుపడుతున్నది. నువ్వు కాఫీ తెప్పించు వారిజా! కాత్యాయని అలాగే మాట్లాడుతుంది." అన్నాడు శాస్త్రి.

వారిజ తేరుకొని లోపలికి వెళ్ళింది. శాస్త్రి కాత్యాయనివంక చూసి "నీ అల్లరివాగుడు కట్టిపెట్టు కాచీ! లేకపోతే దెబ్బలు తింటావు" అన్నాడు.

"అలాగే కాని మరి ఉత్తకాఫీ నాకునచ్చలేదు"

"ఈ నెలజీతమే కాకుండా నాదగ్గరకూడా చాలాతీసుకున్నావు. ఇంకా చాలామందిదగ్గర తీసుకుని ఉంటావు.

కాని ఇంకా నీకు తృప్తికలగలేదు. నిన్ను బాగుచెయ్యాలని నేను చేస్తున్న ప్రయత్నాలన్నీ వ్యర్థం అవుతున్నాయి" అని నిట్టూర్చాడు శాస్త్రి.

"జీవితంలో బాగుపడటం అనేది అంత ముఖ్యమా డాక్టర్" అన్నది కాత్యాయని.

ఇంతలో వారిజ కాఫీతీసుకువస్తూ కాత్యాయని అడిగిన ప్రశ్న విన్నది.

"చెప్పు శాస్త్రి! నేను అదేప్రశ్న అడుగుతూ వున్నాను. అసలు బాగుపడటం అంటే ఏమిటి? జీవితంలో ఈ బాగుకి ఇవ్వవలసిన స్థానం ఎక్కడ?" అన్నది.

శాస్త్రి వారిజవంక చూచి నవ్వుతూ "చాలా బరువైన ప్రశ్న అడిగావు వారిజా! దీనికి ఇంతమటుకు సరియైన సమాధానము ఎవరూ ఇవ్వలేదు. బహుశా ఇప్పుడు నేను ఇచ్చే సమాధానంకూడా సరియైనది కాకపోవచ్చును. ఒక వ్యక్తిని బాగుపడమని మనము సలహా ఇస్తున్నాము- అంటే మన ఆత్మనే ఇచ్చేస్తున్నామన్నమాట. ఇక ఆ వ్యక్తి మనని గురించి సహజపద్ధతిలో ఆలోచించటము మానేస్తాడు. తను చేసిన పాపాలకి ప్రతినిధులుగా కూడా మననే భావిస్తాడు. మనం పాడుతున్న గీతానికి అతడు అర్థంగా మారిపోతాడు. తనకోసం శృతిచేయని తంబుర మీటటం ప్రారంభిస్తాడు. కాని జీవితంలో బావుకున్న పరమార్థంవేరు. అది సంస్కారాన్ని సంపాదించుకోటానికి మనిషి చేసే సాధన. తనలోకి తను తొంగి చూచుకోటం, ఇదే జీవిత పరమార్థం. ప్రతి వ్యక్తి

తనపట్ల తాను నిర్వర్తించుకోవలసిన కనీసకర్తవ్యం తనను తను బాగుపరచుకోటం" అన్నాడు శాస్త్రి.

కాత్యాయని బద్ధకంగానవ్వి "ఒక్కముక్క నాకు అర్థంకాలేదు" అన్నది. వారిజ శాస్త్రివంకజూచి "ఇంతకూ జీవితంలో బావుకున్న ప్రాధాన్యత ఏమిటో మీరు చెప్ప లేదు" అన్నది.

"పోనిద్దురూ దిక్కుమాలినచర్చ... అయినా ఇందులో బాగుపడదల్చుకున్న వాళ్ళు ఎవరున్నారు!" అన్నాడు శాస్త్రి.

ముగ్గురూ పకపకా నవ్వారు కాఫీలు తాగటం పూర్తి అయినాక సంభాషణని ఎక్కడ తెంచాడో అక్కడ ముడి వేశాడు శాస్త్రి.

"నీవు కొంచెంసేపు వీణవాయించు వారిజా!...కనీసం అప్పుడన్నా బాగు అంటే ఏమిటో కాత్యాయని గ్రహి స్తుంది" అన్నాడు. వారిజ నవ్వుతూ వెళ్ళి వీణదగ్గర కూర్చుంది.

వారిజ ఎంత అందంగా ఉన్నది! ఒకవిధమైన ఆశ్చ ర్యంతో అరవిచ్చిన మందారమొగ్గలలాటి ఆ పెదవులు తాంబూలరాగంతో రాగరంజితాలు.

ఆ వీణమీద ఆమె మీటిన ప్రతిమీటుకూ అతను ప్రతిస్పందన పొందాడు. ప్రతిరాగానికీ కోమలమమైన చల నాన్ని అనుభవించాడు. ఒకవ్యక్తిమీద తన ప్రభావాన్ని ప్రసరితం చేయటంలో గానానికి ఉన్న శక్తి దేనికీ లేదు.

మహత్తరమైన ఒక ఆకర్షణా అంతకంటె మహత్తర మైన ఒక అద్భుతశక్తీ గానంలో ఉన్నయ్. మరే కళా యిలాటిదికాదు; మరే కళలోనూ తాత్కాలికమైన ఇంత ఆకర్షణ లేదు.

వారిజ మోహనరాగాన్ని ఆలాపిస్తున్నది.

ఆ లావణ్యావతిలోకి తన ఆత్మని ప్రవేశపెట్టి ఆ మోహిని హృదయంలో కారుణ్యాలు వెదుకుతున్నాడు శాస్త్రి. అతని భావాలూ, ఆలోచనలూ ఆ గానంలోని ఉద్వేగంతో కలిసి నూతన ఛందస్సుతో, లయతో, మోహన స్వనాలతో ప్రతి ధ్వను లిస్తున్నాయి

చల్లని సువాసనని తన రక్తనాళాల్లో ఎవరో నింపు తున్నట్లుగా ఉంది అతనికి. బహుశా అంతఆనందం ఇవ్వగలి గిన కళ వారిజచేతిలో ఉన్నదని శాస్త్రి అనుకోలేదు.

ఈ సంకుచిత శప్తయుగంలో అర్థంలేని ఆదర్శాల తోనూ ఊకదంపుసీతులతోనూ అబద్ధాలతోనూ అఘో రిస్తున్న మానవుడికి ఈమోహనరాగం ఎంత తృప్తినిస్తు న్నది?

స్వరం వేస్తున్నది వారిజ.

మానవుడు ప్రతి చిన్నవిషయాన్ని కొండంతచేసి చూస్తాడు. ప్రతిఅల్పవిషయాన్ని మహత్తరమైన బాధ్యతగా భావిస్తాడు. ఇదే అతడు అనాదిగా చేస్తున్న పొరపాటు. గుహలో బ్రతకటం ప్రారంభించిన మానవుడు పాడటం ఎలాగో నేర్చుకుంటే అతని చరిత్ర మరోదారిన నడిచే

దేమో ! బ్రతుకంతా ఒక మోహనరాగంగా గడుపుతూ వుండేవాడేమో! శాస్త్రి తన ఊహాకి తనే నవ్వుకున్నాడు.

కాత్యాయని స్థితి మరోలా ఉన్నది. ఆమె ఊహాలు పదేళ్లు వెనక్కి-పోయినయి...

అప్పటికి తనకి పదిహేనేళ్లు. కొత్తగా కాపురానికి వెళ్ళింది. తన భర్త తాలూకా ఆఫీసులో గుమాస్తా. నెలా ఖరున జీతం తీసుకువచ్చి తన దోసిటిలో పోసేవాడు. జీతం తక్కువ అనీ డబ్బుచాలదనీ తను ఏనాడూ అనుకోలేదు... భర్తని హృదయపూర్వకంగా ప్రేమించి ఆరాధించటంలో అపరిమితమైన తృప్తీ, మంచిపని చేస్తున్నప్పటి ఆనందమూ, ప్రతి భారతస్త్రీలాగానే ఆమెకూ అనుభవంలోకి వచ్చినయ్.

ఆమెకు త్వరలోనే తల్లి అయే భాగ్యం లభించింది. బ్రతుకంతా మోహనరాగంగా గడిచిపోతున్న ఆ సమయంలో విధి తనవంక వెర్రికోపంతో చూసింది. అంతవరకూ భర్తా, తనూ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. తనకిజాజి పూలు తేవటానికి భర్త బయలుదేరి బయటికి వెడుతుంటే కొడుకునికూడా తీసుకెళ్ళమంది. 'నేను వచ్చేసరికి వంటకానీ; అక లేస్తున్నది' అని చెప్పి కొడుకు నెత్తుకుని బయటికి వెళ్ళాడు భర్త.

అతను వెళ్ళిన అరగంటకే హాస్పటల్ నుంచి కబురు వచ్చింది. తను హడలిపోతూ పరుగెత్తింది హాస్పటల్ వరండాలో తన పసిపాపశవాన్ని అందించారు. లారీ మీదుగా పోవటంవలన భర్త కాళ్ళు తొడలవరకూ తెగిపోయినయి.

ఆతరువాత చెప్పేందుకు ఏముంది? పసివాడిని పారేసి భర్త సేవకి తిరిగివచ్చింది కాత్యాయని. అపూర్వమైన ఆమె

సేవాఫలితంగా అతను బ్రతికిబైటపడ్డాడు. అతని ఉద్యోగం పోయింది. కాత్యాయని ఏమాత్రం విచారించలేదు సరిగదా; ఇంకా ఎక్కువగా కూడా ప్రేమిస్తున్నది. ఆమె చదువుకోలేదు. అందుకని పగలంతా కూలిచేసి సాయంత్రం ఇంటికి వచ్చి ఆ తెచ్చినది వండి భర్తకి పెట్టి తను తినేది.

కాని ఈబ్రతుకుకూడా అట్టే రోజులు గడవలేదు. కాత్యాయని అంటే తనకున్న అభిప్రాయం మారటంవల్లనో మరేకారణంచేతో అతను వెళ్లిపోయినాడు. చంకలకింద కర్రలసహాయంతో అతను కదలగలడు.

అతనికోసం ఊరంతా గాలించింది కాత్యాయని. కనిపించలేదు. తిరిగి తిరిగి ఒక చర్చిముందు కళ్ళుతిరిగి పడిపోయింది.

ఆమెకు స్పృహ వచ్చేసరికి ఒక నర్సుఒళ్లో ఆమె తల ఉన్నది. ఆ తరువాతనే నర్సు ట్రైనింగయింది. దానికి మిషన్ వాళ్ళే సహాయం చేశారు... కాత్యాయని పూర్తిగా మారి పోయింది.

అప్పటి కాత్యాయని ముగ్ధ పరమ సుకుమారమూ, పవిత్రమూ అయిన స్త్రీ. మహాఇల్లాలు.

ఇప్పటి కాత్యాయని తాగుతుంది. నైతికంగా విలువలు లేనిది. ఎదటివాళ్ళు అసహ్యించుకునే దుస్థితిలోఉన్నది ఈ కాత్యాయని. నెలంతా పనిచేసిన జీతంరాగానే పట్టికెళ్ళి తాగేస్తుంది. తిండికి ఆమె ప్రాధాన్యం ఇవ్వటం ఏనాడో మానివేసింది.

ఈ స్థితిలో కూడా ఆమె సేవామూర్తి. అహర్నిశలూ రోగులకి సేవలు చేస్తుంది. ఎంతంటే, కాత్యాయని నైట్ డ్యూటీల్లో ఉంటే రోగులూ, డాక్టర్లూ కూడా నిశ్చింతగా నిద్రపోతారు.

ఎదటివాళ్ళు తనవల్ల ఏదికోరితే అది ఇచ్చేస్తుంది. తనకని ఏదీ ఆమె దాచుకోదు. ఏ డాక్టరుకయినా కాత్యాయని అంటే మంచి అభిప్రాయముంది కాని ఆమెవ్యక్తిగత ప్రవర్తనని అందరూ అసహ్యించుకుంటారు.

హౌస్‌సర్జనుగా ఉన్న సత్యనారాయణశాస్త్రికి కాత్యాయనిఅంటే అపరిమితమైన అభిమానం. ఆమెని త్రాగుడునించి తప్పించాలని అతను అనుక్షణమూ ప్రయత్నిస్తున్నాడు.

ఎంత పతివ్రతో అంత పతితగా మారిన కాత్యాయని అనుకోకుండానే డాక్టరుని అభిమానిస్తున్నది. అభిమానంలో స్వార్థం లేదు, త్యాగమే తప్ప.

వారిజ తన మోహనరాగాన్ని ఆపివేసింది. కాత్యాయని తనసమాధిలోంచి బయటపడింది. శాస్త్రి సిగరెట్ వెలిగించి నిశ్శబ్దంగా ఆ ఆనందాన్ని అనుభవించటం ప్రారంభించాడు.

కాత్యాయని ఉన్నట్లుండి పకపకా నవ్వి "హల్లో, డాక్టర్! వారిజగారి గానాన్ని విని ఆనందించే సంస్కారం నాకు లేదు" అన్నది.

"సంస్కారం అనే పదానికి అర్థంఏమిటో తెలుసునా? ఎదటివాళ్ళలో లోపాల్ని, బలహీనతల్ని క్షమించటం అన్న

మాట... అది నీలో కావల్సినంత ఉన్నది" అన్నాడు శాస్త్రి.

"కాని వారిజగారి వీణావాద్యంలో ఏ లోపాలూ లేవు. నాకు మీరు ఇచ్చిన సంస్కారపు సర్టిఫికెట్ కానీకి కొరగాదు."

"సరేలే! నీకు నైట్‌డ్యూటీ ఉందికదూ" అని జ్ఞాపకం చేశాడు శాస్త్రి. కాత్యాయని వెళ్లిపోయింది. కొన్ని క్షణాల 'అనంతరం కాత్యాయని ఎవరు?' అని ప్రశ్నించింది వారిజ.

ఆ కథంతా చెప్పాడు శాస్త్రి.

"మీరుచెప్పింది బాగానే ఉందికాని అంత పవిత్రురాలు ఇలా మారటం అనేది నాకు అర్థంకావటంలేదు. ఇప్పుడు ఇలా మారటంఅయినా అబద్ధంకావాలి; లేకపోతే మీరు చెప్పిన పవిత్రత మొదటినించీ లేకనయినాపోవాలి" అన్నది వారిజ.

"కాదు. మొదట్లో కాత్యాయని అంత ఉత్తమస్త్రీ ఈకాలంలో కనిపించదు... ఆమాట ఆమెను ఎరుగున్నవాళ్లు అందరూ అంటారు"

"అయితే ఇప్పుడీవిధంగా మారటానికి కారణం?"

"భలే... కారణం ఇంకేంకావాలి భర్తపోయి, బిడ్డపోయి. తినటానికి తిండిలేక, నా అనే వ్యక్తిలేక నానా అవస్థలూ పడటంకన్న కారణం ఏం కావాలి?

"అంతమాత్రంచేత ఇలాటికష్టాలు వచ్చిన వాళ్ళందరూ ఇలా తయారవుతున్నారా?"

అందరూ మొదట కాత్యాయనిఅంత పవిత్రంగా ఉండ కలిగారా?"

"ఎంతపవిత్రంగా ఉన్నదో అంత పతితగా మారటం గొప్పతనమా ?"

"కాకపోవచ్చును... కాని కాత్యాయనిలాటి స్త్రీనీ, కాత్యాయనిలాటి తల్లినీ కూడా ఎవరూ చూసిఉండరు. అకస్మాత్తుగా స్త్రీత్వంనుంచి మాతృత్వంనించీ కూడా వంచితురాలైన ఆ అభాగ్యురాలు ఇలా మారిపోవటంలో ఆశ్చర్యం లేదు. నిజంచెప్పాలంటే మారకపోవటలోనే ఆశ్చర్యం ఉన్నది" అన్నాడు శాస్త్రి. వారిజ మాట్లాడలేదు. శాస్త్రి కాత్యాయనిని ఇంతగా మెచ్చుకోటం ఆమెకు నచ్చలేదు. పతితురాలు, తాగుబోతూ అయిన ఈ నర్సులో ఏవో ప్రత్యేకతలుండటం... వాటిని శాస్త్రి మెచ్చుకోటం ఆమెకి అసూయ కలిగించింది.

"నేను దేనికైనా సానుభూతి ఇవ్వగలనుగాని తనని తను నాశనంచేసుకొని ఆ నాశనానికి కారణాలు వెతికే గుణానికిమాత్రం సానుభూతి ఇవ్వలేను... ఇటీవల ఈఅభిశప్త జీవితాలుగడుపుతున్న జనానికి సానుభూతి చూపించడమనేది ఫ్యాషన్‌కింద మారింది. ఈ సానుభూతిలో ఆ పతనానికి ప్రోత్సాహమే కాని పతనంనుంచి ఉద్ధరణమాత్రం జరుగదు" అన్నది వారిజ.

శాస్త్రి నవ్వి "మరి సానుభూతిఅనేది బాధలకి కాకపోతే ఇహ దేనికి?" అన్నాడు.

సానుభూతి అనేది ఉద్వేలజీవనానందానికీ, జీవితంలోని విచిత్రసౌందర్యానికీ ప్రత్యేకిస్తే మంచిది ... బ్రతుకులోని బాధలను ఎంత తక్కువవించే, ఎంత ఎక్కువ అసహ్యించుకుంటే అంతమంచిది" అన్నది వారిజ.

"బాధలని అసహ్యించుకోటం భావ దారిద్ర్యానికి చిహ్నం" అన్నాడు శాస్త్రి.

శాస్త్రితో మాట్లాడిన ఇంత సేపటినుంచీ వారిజ ఎదురు చూస్తున్న విషయం వేరు... కాని శాస్త్రిలో అదేమీ కనుపించలేదు.

"ఆ విషయం నేను ఒప్పుకోను. ఎందుకంటే, ఏ మనిషీ కూడా బాధపడుతూ జీవించాలని కోరుకోడు" అన్నది.

"బాధపడుతూ జీవించాలని కోరుకునేవాళ్ళు కావల్సినంతమంది ఉన్నారు. ఈ ఊళ్ళో ఒక ముసిలాడున్నాడు. కిందచూసుకోకుండా నడిచి కావాలని రోజూ ఒక ఎదురు దెబ్బ తగిలించుకుంటాడు... మందెయ్యండి బాబూ!- అని వస్తాడు. ఒకరోజున నేనడిగాను. రోజూ ఇలా దెబ్బతగిలించుకోపోతే కిందచూసుకొని నడవరాదూ!-అని... ఆ తాత కొంచం సేపు మాట్లాడలేదు. తరువాత నేను చిన్నప్పటినుంచీ కష్టాలే పడ్డాను బాబూ! కష్టాలు లేకపోతే నాకుతోచదు... ఇప్పుడీ ఎదురుదెబ్బే లేకపోతే కష్టాలులేవు. ఆ నొప్పికి పాదం జివ్వు జివ్వు మంటుంటే ప్రాణానికి హాయిగా ఉంటుంది- అన్నాడు. అతనికేం సమాధానం చెప్పాలో నాకు తెలియలేదు" అన్నాడు శాస్త్రి.

సింహం కళ్ళల్లా కోసుగా ఉండే అతని కళ్ళల్లో ఒక విచిత్రమైన ఆకర్షణ ఉన్నది. అతను ఏది మాట్లాడుతున్నా సంగీతం పాడుతున్నట్లు ఉంటుంది. ప్రతి చిన్న విషయాన్ని వివరంగా చెప్పగలగటం అతని ప్రత్యేకత.

మిన్ను విరిగి మీదపడుతున్నదని తోస్తే... చిరునవ్వు నవ్వుతూ ఇంతేకద అంటాడు శాస్త్రి. పతితుడి దగ్గరనుంచి పవిత్రుడిదాకా శాస్త్రికి స్నేహితులు ఉన్నారు. అతని మిత్రబృందంలో కవులూ, గాయకులూ, చిత్రకారులూ, మంచిపదవులలో ఉన్నవారూ మాత్రమే కాకుండా తాగుబోతులూ, ఆశోపహతులూ, వ్యభిచారులూ, దొంగలూ కూడా ఉన్నారు వీళ్ళందరినీ మానవులుగానే చూస్తాడు శాస్త్రి. ఎవరయినా వీళ్ళందరితో నీకు స్నేహమేమిటి!... అని ప్రశ్నిస్తే నాకు స్నేహమేమిటి ?...నిజం చెప్పాలంటే నాకు స్నేహితులులేరు. వీళ్ళందరూ తోటిప్రాణులు. ఇక తప్పుఒప్పులసంగతి అంటారా ? ఏది తప్పో. ఏదిఒప్పో, నిర్ణయించటానికి నేనెవడిని? అని సమాధానం ఇస్తాడు.

ఆ అడిగినవ్యక్తి సంస్కారవంతుడయితే శాస్త్రిని అభినందిస్తాడు. లేకపోతే అసహ్యించుకుంటాడు ... ఏది ఏమయినా ఒకసారి శాస్త్రిఅంటే ఇష్టపడినవాడు జీవితాంతమూ అతనిస్నేహాన్ని కోరుతూనేఉంటాడు.

అతను తనని ముట్టుకుంటే బాగుండుననిపించింది వారిజకి. కాని ఆ లక్షణాలు ఏం కనిపించలేదు అతనిలో.

శాస్త్రి స్త్రీలోలుడూ కాదు, బ్రహ్మచారీ కాదు. స్త్రీని స్పృంభించాలనే వాంఛ కాని, స్పృశించకూడదనే నిషేధం

కాని అతనికేం లేదు. అప్పుడప్పుడు అతనుచాలా విపరీతంగా ప్రవర్తిస్తాడు. అలా ప్రవర్తించినసమయాల్లో కిందటిసారి వారిజని ఆక్రమించుకోవటం ఒకటి.

వాళ్ళిద్దరూ కలుసుకోటం అది రెండోతడవ అయినా ఏ అదృశ్యశక్తులో తనని ప్రేరేపించినట్లు అనాలోచితంగా ప్రవర్తించాడు. ఆరోజు ఇంటికి వెళ్ళినతరువాత చాలాసేపు ఆలోచించాడు... ఎన్ని జన్మలనుంచో ఆపిల్ల తెలిసినట్లూ తమ కిద్దరికీ ఘనిష్టమైన రక్తసంబంధం ఉన్నట్లూ అని పించింది.

ఇప్పుడు వారిజ కెదురుగా కూర్చుని భాగల్ని బిడ్డల్ని గురించి మాట్లాడుతున్న ఈ సమయంలో కూడా కిందటి సారి తను చేసిన అన్యాక్రమపుపనిని గురించే అతను ఆలోచిస్తు న్నాడు. మళ్ళీ వారిజ ఎదురుచూస్తున్నది కూడా అందుకే అని గ్రహించాడు వారిజ గతజీవితంలో ఏంచేసింది? అనే ప్రశ్న రమణమూర్తికి వస్తుంది కాని శాస్త్రికి రాదు. మనిషిని మనిషిగానే చూస్తాడు అతను.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అని ప్రశ్నించి. అతని ఆలోచనలని బలవంతంగా తెంచివేసింది వారిజ

"నీకు కాత్యాయనిఅంటే ఎందుకుఅసూయ?"సూటిగా ప్రశ్నించాడు శాస్త్రి వారిజ కొన్నిక్షణాలు మాట్లాడలేదు. తరువాత,

"నీవు ఆమెఅంటే ఇష్టపడతావు కాబట్టి!" అన్నది.

"ఇష్టం కాదు. జాలి పడతాను. ఆమె ఉన్నపరిస్థితిలో

మగవాడునొన్నా నేను ఇలా గేజాలిపడతాను. ఆమె స్త్రీ కనుక నువ్వు అసూయపడుతున్నావు. అంతకన్న మరేం లేదు"

"నిజం చెప్పు... కేవలం అంతమాత్రమేనా?"

"నేను మడికట్టుకున్నానని నీకేం చెప్పటంలేదు. గాని, కాత్యాయనివిషయంలో అంతే ... ఇంకో స్త్రీ విషయమైతే ఇలాటి ప్రశ్న నేను నిన్నెప్పుడూ అడిగిఉండను"

"అంటే; అలాటిప్రశ్న నేనూ అడగకూడదని నీ ఉద్దేశ్యమా?"

"అడగకూడదనే ఉద్దేశ్యం నాకెప్పుడూ లేదు. కా ఒక స్త్రీకీ పురుషుడికీ మధ్య స్నేహం కాకుండా మరో సంబంధం ఉండటం అనే విషయానికి నేను అట్టే ప్రాధాన్యం ఇవ్వను"

"కాని ఆడవాళ్ళు అన్నిటికన్న ప్రాధాన్యం దానికే ఇస్తారు" అన్నది వారిజ. శాస్త్రి నవ్వి,

"అందుకే వాళ్ళు అనుక్షణమూ అదే విషయంలో మోసపోతూ ఉంటారు" అన్నాడు.

"అదిసరే శాస్త్రీ! అసూయపడటాన్ని నేరం కింద ఎందుకనుకుంటావు నువ్వు?

"అసూయ అనే గుణం లేకపోతే భూమి ఈపాటికి స్వర్గం అయిఉండేది"

"అసూయ లేకపోతే ప్రేమకూడా లేదు"

"ఆ మాటకొస్తే ప్రేమఅనేది అసలులేదు. ఉన్నది అసూయే! దానినే ప్రేమ అని భ్రమిస్తాం మనం"

"నీమాటలూ సిద్ధాంతాలూ నాకు పూర్తిగా అర్థం కావటం లేదు" అన్నది వారిజ. శాస్త్రి లేచి వారిజపక్క కొచ్చికూర్చుని ఆమెచెయ్యి తనచేతిలోకి తీసుకున్నాడు.

"సిద్ధాంతాలు అనేవి కాల్షియం ఇంజక్షన్ లాంటిది వారిజా! నరనరాల్లోకీ ఆ ఆవిరి వ్యాపించినప్పుడే అది బలాన్ని ఇస్తుంది" అన్నాడు. అతను వచ్చి తనపక్క కూర్చోగానే ఆమెకి గుండెకొట్టుకోటం ప్రారంభించింది. ఏదోజరగ బోతోంది అనే భావం ఆమెను మంచుగడ్డల్లో ఉంచి తీసినట్లుగా ఉంది. శాస్త్రి ఆమె ఉద్వేగాన్ని పసికట్టాడు. ఆమె నడుంమీద చేయివేసి,

"ఉద్వేగపడకు వారిజా నీకేం కావాలి?" అన్నాడు. వారిజ మాట్లాడలేదు

"స్త్రీపురుషులు స్త్రీపురుషులుగానే తప్ప స్నేహితులుగా ఉండలేని కారణం. ఇదే... శరీరాలు మాటవినక పోవటం" అన్నాడు శాస్త్రి. వారిజ అతనిగుండెలమీద వాలిపోయింది.

ఆమె జుట్టుని నుదుటిమీదనుంచి పైకితోస్తూ "పిచ్చి తల్లీ" అన్నాడు. ఆ వాక్యంతో శారీరకంగా ఉన్న ఆమె ఉద్రేకం దిగిపోయింది. శాస్త్రిని పసిపిల్లలా అల్లుకుపోయింది.

"ఏమిటమ్మా ... నీకేం కావాలి?" అని ఆమెను మరింత దగ్గరగా తీసుకున్నాడు.

"నాకు ఏమీవొద్దు. ఇలా ఉండనిస్తే చాలు... పుట్టిన దగ్గరనుంచీ అనుభవించని శాంతి నీ గుండెలమీద

నాకు దొరికింది" అని అతనిచేయి తన చెంపకి ఆనించుకుంది వారిజ.

"కాని అన్నప్పుడల్లా శరీరాలు మాటవినవు వారి" అన్నాడు శాస్త్రి

"వినకపోతే పోనీ. అందువల్ల మునిగిపోయిందేముంది?" అతని గుండీలని తిప్పుతూ అన్నది వారిజ.

"అప్పుడే తప్పుచేశామని భయపడటమో! తిరిగీ ఆ తప్పుకోసమే వెంపరలాడటమో! చేస్తారు చాలామంది"

"మనం ఆ రెండూ చేయవద్దు... ఒక వేళ ఏదైనా జరిగితే తప్పుచేశామని నేను అనుకోను" అన్నది వారిజ.

"ఒప్పుచేశామని మాత్రం అనుకోకు... అది ఒక దేహసంబంధమైన విషయం. దాన్ని అసహ్యించుకోటమూ మంచిదికాదు; ప్రాధాన్యత ఇవ్వటం అంతకంటె మంచిది కాదు" అని ఆమె వేళ్ళని పరిశీలించటం ప్రారంభించాడు.

ప్రపంచంలో అతనికంటె ఆప్తమిత్రుడు తనకా క్షణంలో లేడు... ఇకముందు కూడా ఉండడు... ఈ ఊహతో మళ్ళీ శాస్త్రిని అల్లుకుపోయింది వారిజ. ఆమెను దగ్గరకు తీసుకుని,

"నువ్వు ఉత్తవెర్రితల్లివి. ఆ సంగతి నేను మొదటి రోజునే గ్రహించాను... నీ రక్తం చాలా విచిత్రమైనరక్తం. నీ సౌందర్యం కూడా లోకాతీతమైనది. ప్రపంచం కోరే ధనంకూడా నీకువున్నది. లోకులదృష్టి నీమీద పడటానికి కావలసినవన్నీ నీదగ్గరవున్నయ్... ముందు నువ్వు బ్రతకటం నేర్చుకోవాలమ్మా" అన్నాడు శాస్త్రి.

"అయితే నన్నేంచేయమంటావో చెప్పు" అని పసిపిల్లలా ప్రశ్నించింది వారిజ. శాస్త్రి ఆమెను గట్టిగా ముద్దుపెట్టుకుని,

"నాకు చెల్లెలుఉంటే సరిగ్గా నీలానే ఉండేదేమో;" అన్నాడు.

"ఆమాట అనకు శాస్త్రీ! నిన్ను అన్నగా చూడటం నా చేతకాదు" అన్నది వారిజ.

"వాంఛతో కలసిన స్త్రీపురుష ప్రేమకన్న వాంఛా రహితమైన స్త్రీపురుష ప్రేమ ఒక్క అన్నాచెల్లెళ్ళకే సాధ్యమవుతుంది"

"కావచ్చును... కాని శాస్త్రీ! నీవు నా సర్వస్వం... అన్నవీ, తండ్రివీ, ప్రియుడివీ, స్నేహితుడివీ కూడా" అన్నది వారిజ.

"ఎందుకమ్మా! అంత ప్రేమ?"

"నువ్వు నాప్రాణానివి... నాకు శరీరవాంఛ అంటూ కలగటం ప్రారంభిస్తే! అది నీ వలన తీర్చాలనుకోటం నేరమా? అదిచెప్పు" అని సూటిగాప్రశ్నించింది వారిజ.

"నీలో ఉండే ప్రేంచిరక్తం నిన్ను ఈమాట అడిగేట్లు చేసింది"

"నా ప్రశ్నకి సమాధానం అదికాదు"

"నా దృష్టిలో ఏదీ నేరంకాదు. కాని ఈ ప్రపంచంలో కేవలం నా ఒక్కడిదృష్టే లేదుగా" అని నవ్వాడు శాస్త్రి.

"ఫోనీలేగాని సినిమాకు వెడదామోయ్" అని గోముగా అడిగింది వారిజ.

"ఇంకా ఇప్పుడు టైములేదు" అన్నాడు శాస్త్రి.

వారిజ రెండుచేతులూ అతనిమెడకి వేసి "కాదు, పోదాం" అన్నది.

"సరేనవే. నువ్వుచెపితే వినటం అప్పుడే మానివేశావు" అని నవ్వాడు శాస్త్రి.

"అయితే వెళ్ళొద్దులే" అని తిరిగి కూర్చుంది వారిజ.

"కోపం వచ్చిందా? మా అమ్మకదూ...మా నీలి కలువకదూ, మా తల్లికదూ" అని వారిజని నవ్వించాడు శాస్త్రి. ఇద్దరూ సినిమాకి వెళ్ళారు. ఆ మరునాడు మెడికల్ కాలేజిలో ఇది ముఖ్యమైన చర్చనీయాంశం అయింది.

* * *

రమణమూర్తికి అన్న అంటే భయంలేదు. శాస్త్రికి తమ్ముడంటే ప్రాణం. సుకుమారంగా తెల్లనిలాల్చీతో సన్న జాజిపువ్వులాగా కనిపించే తమ్ముడిని తనతో పోల్చుకుని నవ్వుకుంటాడు శాస్త్రి.

తను డాక్టరు. శవాలమధ్య తిరగటం అలవాటయి తనలో మార్దవం నశించిపోయింది. తన శరీరంకూడా రమణ మూర్తిశరీరంఅంత అందమైనది కాదు. తను ఖద్దరుగుడ్డలు, తెచ్చుకుని రమణమూర్తికి సిల్కువి తెస్తాడు శాస్త్రి.

అన్నగారు వచ్చేసరికి పడకకుర్చీలో ముడుచుకు పడుకున్నాడు రమణమూర్తి.

"ఏంరా అలా ఉన్నావు? ఒంట్లో బాగులేదా?" అన్నాడు శాస్త్రి. మెళ్ళో స్టెతస్కోపుతీసి ఒంకెకి తగిలిస్తూ.

"మరే నువ్వు డాక్టరువి రెడీగా ఉండగా ఒంట్లో బాగులేకపోవటం పెద్ద ప్రమాదంకిందికి రాదులే" అన్నాడు రమణమూర్తి. శాస్త్రి నవ్వుకుంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. కొంచం సేపయినాక ఇవతలికి వచ్చి ఒళ్ళుతుడు చుకుని బట్టలుతీసుకుని వేసుకున్నాడు. రమణమూర్తి ఇదంతా చూస్తున్నాడు.

"ఏమిటారి అలా చూస్తున్నావు?" అని ప్రశ్నించాడు శాస్త్రి.

"మరేంలేదు చిత్రిగా ఉంటేను"

"ఆ చిత్రిం ఏమిటో నాకూడా చెపుదూ?"

"ఏంలేదు. నీలంరంగు ఎక్కడయినా అంటిందేమో అని"

"నువ్వు అనేది వారిజసంగతేనా?"

"అక్షరాలాను. లేకపోతే ఈ ప్రపంచంలో నీలం రంగు మరెవరికి ఉండికనుక" అన్నాడు రమణమూర్తి.

"ఏడిశావు. కురికుంకవి నీకా సంగతులన్నీ దేనికి?"

"నాకోసం కాదు... నాన్నసంగతి ఆలోచించు"

"ఆలోచించటానికి ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుందామని నేనింకా అనుకోటం ప్రారంభించలేదు"

"మరి సినిమాకెందుకు వెళ్ళావు? ...ఆ పిల్లగొంతు కొయ్యటానికా ?"

"ఇంతకూ నీ జాలి నాన్నమీదా, ఆ పిల్లమీదా?" అన్నాడు శాస్త్రి.

రమణమూర్తికి వళ్ళుమండిపోయింది

"ఆ పిల్లమీద జాలిపడే అవకాశం నువ్వు మరొకళ్ళకి ఇవ్వవుగా" అన్నాడు. శాస్త్రి లేచి రమణమూర్తికి దగ్గరగా వచ్చి తలనిమురుతూ,

"వారిజ నా ఒక్కడిది- అని నేను అనలేదు... గాలీ వెన్నెలాలాంటి వారిజ ఏ ఒకరిదీ కాదు" అన్నాడు.

"ఆమె ఏ ఒకరిదైనా, ఏ ఒకరిది కాకపోయినా మధ్యలో నాకేం సంబంధం?"

"ఆ విషయమే కొంచం ఆత్మపరీక్ష చేసుకొంటూ ఉండు, ఈ లోగా నేను సిగరెట్లు తెచ్చుకుంటాను" అని బయటికి వెడుతూ తనలో తనే నవ్వుకున్నాడు శాస్త్రి.

శాస్త్రి తెలివితేటలంటే రమణమూర్తికి ఇదివరకే ఉన్నభయం మరీ ఎక్కువయింది. శాస్త్రి ఎలా గ్రహించాడు? అతనివి ఏమన్నా ఎక్సరే కళ్ళేమో!- అనిపించింది.

అన్నగారంటే ఉండే ప్రేమా గౌరవం మరింత ఎక్కువ అయినాయి. కాని ఈ వారిజ తమరిద్దరికీ మధ్య మంటలు రేపదు కదా... ఈ ఊహతో వారిజనిగురించిన ఆలోచన లన్నిటినీ అణుక్కొనెట్టి నిద్రపోయినాడు రమణమూర్తి.

తను వచ్చేసరికే నిద్రపోయిన తమ్ముడికి దుప్పటికప్పి టాగూర్ కథ ఒకటిచదవటం ప్రారంభించాడు శాస్త్రి.

* * *

"హల్లో డాక్టర్!...శుభం... గడిచినరాత్రి చాలా సుఖంగా గడిచినట్లు కనిపిస్తోందే" అన్నది కాత్యాయని. తను వార్డులో అడుగుపెట్టీ పెట్టకమునుపే కాత్యాయని ఈ ప్రశ్నఅడిగింది. దానివెనకాల ఉన్న ఆమెహృదయం గాజుసీసాలో ఉన్నట్లు స్పష్టంగా కనిపించింది. తనలో తనే ఒకసారి నవ్వుకుని,

"ఔఁనూ నాకూ ప్రతిరాత్రీ సుఖంగానే గడుస్తుంది ... ఏడవనెంబర్ బెడ్ సంగతి ఏమయింది" అన్నాడు శాస్త్రి.

"ఫరవాలేదు. మొన్నరాత్రి కొంచం హడావిడిచేస్తే డాక్టర్ చంద్రశేఖర్ ఆక్సిజన్ ఇప్పించారు. మొత్తానికి ఆ రాత్రి అంతా డెలీరియంలోనే ఉన్నది"

"ఇంతకూ ఆ అమ్మాయి ఎవరో తెలుసుకున్నావా?"

"ఏమిటి తెలుసుకునేది? నాబోటి దౌర్భాగ్యురాలు మాత్రం అయిఉండదు...సరే డాక్టర్! రౌండ్సుకి వెడతారా?" అని ప్రశ్నించింది కాత్యాయని.

"అవును. నువ్వూ రా, నాతో" అని దారితీశాడు శాస్త్రి.

కాత్యాయని నిశ్శబ్దంగా అనుసరిస్తోంది ... డెట్టాల్, ఫినాయిల్ వాసనలతో ఒక విచిత్రమైన వాతావరణంతో ఉన్నది ఆ హాస్పటల్. ఒక్కొక మంచందగ్గిరా ఆగి ఛార్టు చూసి, పక్కనున్న నర్సులకి సూచనలిస్తూ, ముందుకు సాగి పోతున్నాడు శాస్త్రి.

ఏడవనెంబర్ బెడ్ దగ్గర నిలబడి, ఆ రోగిని పరీక్ష చేస్తున్నాడు. ఆ అమ్మాయికి స్పృహలేదు. కళ్ళు మూసు

కుని ఏదో కలవరిస్తున్నది. శాస్త్రి కాత్యాయనివంక చూసి;

"ఇంకా అపాయకరమైనస్థితి పూర్తిగా దాటలేదు" అన్నాడు.

అతనిమాట పూర్తి కాకుండానే ఆ అమ్మాయి కళ్లు తెరిచింది. ఎదురుగా స్టెతస్కోపుతో నిలబడి తనని పరీక్ష చేస్తున్న శాస్త్రిచెయ్యి గట్టిగా పట్టుకుని,

"డాక్టర్!...డాక్టర్!...నన్ను తీసుకుపోరూ!... నన్ను వదలకండి డాక్టర్!...మీకోసమే బ్రతికిఉన్నాను... డాక్టర్!" అన్నది.

అంతలోనే మళ్ళీ స్పృహపోయింది ఆ అమ్మాయికి. శాస్త్రి ఆశ్చర్యపోయినాడు.

"ఇలాగే ఈ అమ్మాయి అయిదారుసార్లు కలవరించింది డాక్టర్" అన్నది కాత్యాయని. - సరిగ్గా అదే సమయంలో మరోనర్సు ఒక యువకుడిని తీసుకువచ్చి "ఏడవ నెంబరు పేషంటు బ్రదర్ట డాక్టర్" అని అక్కడ వదిలేసి వెళ్ళిపోయింది.

ఆ స్థితిలో ఉన్న చెల్లెల్నిచూసి అతను ఏడవటం ప్రారంభించాడు. శాస్త్రి అతనిభుజంమీద చెయ్యివేసి అనునయిస్తూ;

"అలా ఏడిస్తే ప్రయోజనంలేదు. తమాయించండి" అన్నాడు. ఆ యువకుడు తేప్పరిల్లి "అసలు బ్రతుకుతుందంటారా?" అని ప్రశ్నించాడు.

"ఆ సంగతి గ్యారంటీ" ఇవ్వలేము. ఆమె శరీరానికన్న హృదయానికి తగిలినగాయం పెద్దదిగా ఉంది. ఈ పరిస్థితిలో మేం చేయగలిగింది చాలా తక్కువ" అన్నాడు శాస్త్రి.

ఇంతలో ఆ అమ్మాయి ఒక్కసారి లేచి శాస్త్రి చెయ్యి మళ్ళీపట్టుకుంది. "డాక్టర్!... డాక్టర్!... నన్నువదలకండి!... నన్ను పెళ్ళిచేసుకుంటారుగదూ." అని మళ్ళీ పడుకుంది. శాస్త్రిచెయ్యి తన రెండుచేతులతోనూ గట్టిగా పట్టుకుని నిశ్చింతగా కళ్ళుమూసుకుని పడుకుంది. ఆ యువకుడు పలకరిస్తే ఎవరో పరాయివాడివంక చూసినట్లు చూసిందిగాని గుర్తుపట్టలేదు.

అది చూసి అతను దిగాలుపడిపోయినాడు. ఇంతలో డాక్టర్ రామారావు అటువచ్చి ఆ అమ్మాయిని చూస్తూ నిలబడ్డాడు. ఆ కేసు వివరాలన్ని రామారావుకి చెప్పాడు శాస్త్రి.

డాక్టర్ రామారావుకళ్ళల్లో నీళ్ళుతిరగటం చూసి కాత్యాయని ఆశ్చర్యపోయింది... ఆ యువకుడు రెండు చేతులతో ముఖం కప్పుకుని ఏడుస్తున్నాడు. ఆ అమ్మాయి మళ్లీ లేచి ఈ తడవ రామారావుచెయ్యి పట్టుకొని తిరిగీ ఒకసారి కలవరించి వెనక్కి పడిపోయింది... కాత్యాయని ఆక్సిజన్ కోసం పరుగెత్తింది. ఒక అరగంటతరువాత తెల్లనిదుప్పటి కప్పి నిశ్శబ్దంగా డాక్టరూ నర్సూ బయటికి వచ్చారు.

శాస్త్రి ఆ యువకుడివంక చూసి "మరో గంటలో శవాన్ని తీసుకుపోవచ్చును" అన్నాడు అతను తలఊపి వెళ్ళిపోయినాడు. శాస్త్రి తనగదిలోక కాఫీతీసుకుంటున్నాడు...

వెళ్ళేసరికి డాక్టర్ రామారావు తల బల్లమీద వాల్చుకొని ఏడుస్తున్నాడు. అదిచూసి ఆశ్చర్యపోయినశాస్త్రి—

"ఏమిటి? ఇలాటి చావులు రోజుకెన్నిసార్లు చూస్తున్నాం మనం!" అన్నాడు. రామారావు మాట్లాడ లేదు. అతని దుఃఖం మరింత ఎక్కువయింది.

"ఏమిటి డాక్టర్!...ఆ అమ్మాయిని మీరు ఎరుగుదురా?"

అవునని తలఊపాడు రామారావు.

"మరి ఆ సంగతి ఈ వారంరోజులనించీ ఒక్కసారీ చెప్పలేదు!" అంటూ అతనికికూడా కాఫీఅందిచ్చాడుశాస్త్రి. రామారావు లేచి మొగంకడుక్కుని కాఫీ సిప్ చేస్తూ:

"డాక్టర్! మీకు ఒకకథ చెపుతా, వింటారా?" అన్నాడు.

శాస్త్రి వాచీచూసుకుని "చెప్పండి! ఇంకా రెండు గంటలుటైముంది. తరువాత ఆపరేషన్ థియేటరులో పని ఉంది." అని కాళ్ళు బల్లమీదకు చాపుకుని సిగరెట్ వెలిగించి, కథవినటానికి ఉత్సాహాన్ని చూపించాడు. రామారావు చెప్పటం ప్రారంభించాడు.

"కొన్ని అనివార్యకారణాలవల్ల నేను కొన్నిరోజులు అజ్ఞాతంగా ఉండాల్సివచ్చింది. ఒకరోజు అర్ధరాత్రి నన్ను నేను కాపాడుకోటానికి ఒక ఇంటితలుపు తట్టాను. ఒక అందమైన అమ్మాయి తలుపుతీసింది. ఆ అమ్మాయికి పదిహేను ఏళ్లు ఉంటాయి. కొంచెం కూడా భయపడకుండా తలుపు

తీసింది...ఆనాటి మా సంభాషణ ప్రతిఅక్షరం నాకు గుర్తు ఉంది. తలుపుతీసి,

'ఎవరు మీరు' అన్నది.

'ఎవరో చెప్పినా అర్థంచేసుకోలేరు. దయచేసి ఆ ప్రశ్నమాత్రం అడగకండి. దొంగనిమాత్రం కాను.' అని జవాబిచ్చాను. ఆ అమ్మాయి నావంక అదోమాదిరిగా చూస్తూ 'అయినా నాకు భయంలేదు' అన్నది. నేను తెల్లపోయి,

'భయంలేదూ! మీరు చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారు!'.

'అర్ధరాత్రి కొంపలోకి ప్రవేశించిన అపరిచిత యువకుడినిచూసి భయపడని ఆడపిల్లని నేనిదే మొదటిసారి చూడటం!' అన్నాను. ఆ అమ్మాయి విసుక్కుని,

'యింతకూ మీకేం కావాలో చెప్పండి. నాకు నిద్ర వస్తోంది. అయితే...ఇంతవరకూ మీరెంతమంది ఆడపిల్లల్ని భయపెట్టారేం?' అన్నది.

'అట్టే ఎక్కువమంది లేరు...ఎవరా నిద్రపోయేది? వారు మేలుకుంటారేమో! దయచేసి నాకింకో గదిలో ఆశ్రియం ఇస్తే తెల్లవారకముందే వెళ్ళిపోతాను' అన్నాను. అక్కడ ఎవరో ఇద్దరు గాఢంగా నిద్రపోతున్నారు. ఆ అబ్బాయి నవ్వుతూ,

'మేలుకొన్న ప్రాణిని నన్నుచూసి భయపడాలిగాని వాళ్ళని చూసి భయపడనక్కరలేదు ... ఎందుకంటే రేపు పనిమిదిగంటలవరకూ వాళ్ళిద్దరూ అలా సమాధిలో ఉంటా

పోతారని గ్యారంటీ ఇవ్వగలను; నల్లమందు మహిమ అలా టిది మరి... అందుకే నువ్వుకూడా నిద్రపోయి కొంప దొంగలకు పెట్టేవు!'-అన్నది అమ్మ...రండి మేడమీదికి పోదాం అమ్మా నాన్నా ఊరికి వెళ్ళారు, లెండి' అన్నది. నేను ఆశ్చర్యపోయినాను. ఈ పిల్లకి ప్రపంచజ్ఞానం లేదా? అనిపించింది నాకు... లేకపోతే వాళ్ళిద్దరూ తెల్లారేదాకా లేవరనీ అమ్మా నాన్న ఊళ్ళో లేరనీ దొంగలాటివాడితో నిర్భయంగా చెప్పి మేడమీదకు తీసుకువెళ్ళటం అనేది పిచ్చివాళ్ళు చేసేపని... కనీసం ఆ పడుకున్న వాళ్ళనయినా నిద్రలేపుతుందేమో అనుకున్నాను... కాని ఆ అమ్మాయి అలా చేయలేదు. ఇద్దరం మేడమీదకి వెళ్ళాం. రాత్రి పన్నెండో ఒంటిగంటో అయింది. వంటిల్లంతా వెతికి కాస్త పులిహోరా, ఓ గ్లాసుడు మజ్జిగా తెచ్చి ఇచ్చింది నాకు. నేనిక కుతూహలం పట్టలేక పోయినాను.

'మిమ్మల్ని చూస్తూంటే నాకాశ్చర్యంగా ఉంది... మీకు భయం అనేది అసలు లేనేలేదా?... నాతో ఒంటరిగా ఇలా మేడమీదికి రావటం అంతమంచిది కాదేమో!' అన్నాను.

ఆ అమ్మాయి నవ్వి 'నన్ను చూసి భయపడాల్సిన స్థితిలో ప్రస్తుతం మీరున్నారు. ఒక్క అరుపుతో మిమ్మల్ని...' అన్నది.

'అయినా మీరలా చెయ్యరు ... మిమ్మల్ని అర్థం చేసుకున్నాను. విచ్చలవిడిగా ఎగిరే అడివిపిట్టని ఎవరూ ఏం చేయలేరు...మీరు అంతే'

'సరిగా ఇదేమాట మీరూ అన్నట్లుగా కూడా అంటాను... ఆమాటకొస్తే మనిషిని మనిషి అజ్ఞాతంలో పెట్టేదేమిటి నా మొహం. ఇంతకీ తమరెవరు మహాశయా?' -న్నది. ఆ అమ్మాయి భావాలూ మాటలూ చాలా తమాషా అనిపించినయ్ నాకు. ఆ అమ్మాయిప్రశ్నకి జవాబుచెప్పటం నా కిష్టం లేదు. అందుకని... 'మనిషిని ఎదురుగుండా చూస్తూ ఎవరని ప్రశ్నించటంలోనూ అర్థంలేదేమో!' అన్నాను. ఆ పిల్ల కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత నిట్టూర్చి,

''మీరన్నది నిజమే...అర్ధరాత్రిలూ అంధకారాలూ మనలో మార్పులుతెస్తాయి... వెల్తురులో కనిపించని సత్యాలెన్నో చీకట్లో స్పష్టంగా కనిపిస్తాయి...ఒకప్పుడు ధైర్యం కూడా ఎక్కువ అవుతుంది' అన్నది.

'అది నిజమే...ఉరిమితే ఉలిక్కిపడే కురంగనయనలు భయపడకపోవడం ఆ సత్యాల్లో ఒకటి' అన్నాను నేను.

ఆ అమ్మాయి పకపకానవ్వి 'మగవాడు ఏదయినా సహిస్తాడు. కాని ఆడది ధైర్యంగా ఉండటం సహించలేడు... బహుశా భయంకూడా ఉంటుంది' అన్నది.

'మగవాడు బలవంతుడు కదండీ! అందుకని స్త్రీని...' ఇంకా నామాట సాంతం పూర్తికానీయకుండానే,

'ఏడిశాడు...చూడండి! మీరెవరో నా కనవసరం. గాని...గుడ్లగూబలాగా వెల్తురుచూడరని నా ఉద్దేశ్యం. మరి మీగతి?' అన్నది.

'తెలియదు...ఈ రాత్రి మాత్రం నా జన్మలో మర్చిపోలేను. పిశాచప్రపంచంలో ఈ ఒక్కరాత్రి దేవతలు

వరంగా ఇచ్చారు నాకు. మీరు దేవతలు'' అన్నాను. నిజంగా ఆ క్షణంలో ఆ మాటలు హృదయపూర్వకంగా అన్నాను. ఆ అమ్మాయి విచిత్రంగా నావంకచూసి,

"బావ రాక్షసి వన్నాడు ఇందాక ... దేవత నంటున్నారు మీరిప్పుడు ... రాక్షసికీ దేవతకీ మధ్య ఈ మేడమెట్లే వారలాగున్నాయిచూస్తే'' అన్నది.

"కావచ్చును ... నిజం చెప్పాలంటే దృక్పథాలుకూడా మేడమెట్లవంటివే ... ఇప్పుడు మీరున్నారనుకోండి ... ఇంటిని ఆ ఇంటిని దోచుకోకుండా నన్నూ కాపలాకాయాలి కనుక కూర్చుని నాతో కబుర్లుచెపుతున్నారు ... కొన్నాళ్ళు గడిస్తే ఈ సంగతే మీకు జ్ఞాపకం ఉండదు-అవునా?'' అన్నాను.

"చెప్పలేను ... కాని జ్ఞాపకం ఉంటుందంటే మీరు ఆనందిస్తారుకదూ?''

"లేదు ... నాకు బాధపడటంలోనే ఆనందం ఉన్నది. నేను నమ్మిన సిద్ధాంతాలకోసం దెబ్బలుతిన్నాను. జైలుకి వెళ్ళాను, ఆ జైలులోంచే మళ్ళీ పారిపోయివస్తున్నాను. పోలీసులు రేపోమాపో పట్టుకుని మళ్ళీ జైల్లో పడేస్తారు ... ఇదంతా బాధలో ఆనందాన్ని కలిగించే విషయమే ... బహుశా మీకిది అర్థంకాదు'' అని జవాబిచ్చాను.

ఆ అమ్మాయి నాకళ్ళలోకి విచిత్రంగా చూస్తూ,

"అర్థమయింది ... నేనూ మీలాంటిదాన్నే ... అందుకే పెంకిదాన్ని- అంటాడు అన్నయ్య. రాక్షసి నంటాడు బావ. దేవత నంటున్నారు మీరు ... క్షమించండి! మిమ్మల్ని మర్చిపోవటానికి ప్రయత్నిస్తాను'' అన్నది. నేను ఆశ్చర్య

పోయినాను నన్ను మర్చిపోవటానికి అసలు ఒకప్రయత్నం ఏ ఎటూ అవసరమూ అనిపించింది నాకు.

"ప్రయత్నిస్తారా! నాబోటివాడిని మర్చిపోవటానికి ప్రయత్నంకూడానా!" అన్నాను. ఆమె తలవంచుకుని,

"ప్రయత్నం అవసరం అయ్యేటట్లేవున్నది" అంది.

"మరి నేను వెళ్ళివస్తాను" అని లేచినిలబడ్డాను.

ఆ అమ్మాయి ప్రాణాలన్నీ కళ్ళల్లోకి తెచ్చుకుని "మళ్ళీ ఎప్పుడు వస్తారు?" అన్నది...ఏమీ అర్థంకాని అయోమయావస్థలో పడిపోయినాను నేను.

"చెప్పలేను. కాకతాళీయంగా కనిపిస్తే తప్ప...కనపడటానికి ఏమాత్రమూ ప్రయత్నించను... ఈరాత్రి నన్ను కాపాడినందుకు ధన్యవాదాలు...మరి సెలవా?" అన్నాను.

ఆ అమ్మాయి చీరకొంగు వేలికి మెలివేస్తూ...

"మీరెవరో నాకు తెలుసుకునేందుకు సాధ్యంకాదు. గాని...నేనెవరో మీకు సులభంగా తెలుసుకోగలరు... ఇంకొక్కసారి కనపడతానని మాట ఇవ్వండి" అన్నది.

"అలాగే కనిపిస్తాను. మరి నే వెళ్ళిరానా?" అన్నాను.

"వెళ్ళిరండి. మీకోసం ఎదురుచూడటంలో బాధా ఆనందంకూడా అనుభవిస్తాను" అన్నది. ఆమెకళ్ళల్లో నీరు నిలవటం చూసి నామనసులోనే స్త్రీహృదయానికి జోహారు చేసి బయటపడ్డాను.

రామారావు కథచెప్పటం ఆపి, పైనుచూశాడు.

"టైము చాలా ఉందిలెండి. తరువాత!" అని కుతూహలంతో ప్రశ్నించాడు శాస్త్రి. రామారావు సిగరెట్ వెలిగించి,

"ఆ అమ్మాయిని నేను మర్చిపోలేదు... కాని కలుసుకుందామనికూడా ప్రయత్నించలేదు. అయిదుసంవత్సరాల తరువాత మద్రాసుమెయిల్‌లో ఆమెను చూశాను. హడావిడిగా ఎక్కిననన్ను చూసి "ఎవరు మీరు? ఈపెట్టె ఫస్ట్ క్లాస్" అన్నది ఒక స్త్రీకంఠం. నేను ఉలిక్కిపడి తేరిపార చూశాను. ఆమె!

"క్షమించాలి. నేనూ ఫస్ట్‌క్లాస్ ప్యాసింజరునే... మీరు మొదటితరగతి ప్రయాణీకురాలిగా జీవిస్తున్నందుకు చాలా సంతోషం" అన్నాను.

ఆ అమ్మాయి కోపంగా "ఎవరుమీరు? ఏమిటీ అర్థంలేని మాటలు?" అన్నది.

"అవును మరి! అయిదుసంవత్సరాలక్రిందట అర్ధరాత్రి అంధకారంలో కనిపించిన అభాగ్యపాంథుడిని గుర్తుపట్టకపోవడం సహజమే. పైగా భయంకూడా ఒకటి పట్టుకున్నట్లుంది" అన్నాను.

ఆ అమ్మాయి ముఖంలో ఆశ్చర్యం, ఆనందం, బాధ, అన్నీ ఒక్కసారి కనిపించినయ్. ఎక్కడలేని సంతోషంతో నా చెయ్యిపట్టుకుని,

"మీరా? అయిదేళ్ళకి మళ్ళీ ఈరాత్రి! ఇన్నాళ్ళూ ఏమయి పోయినారు? ఎక్కడున్నారు?" అన్నది. నేను మెల్లిగా చెయ్యివిడిపించుకుని,

"ఆగండి మరి! అన్నిప్రశ్నలూ ఒకసారే ప్రశ్నిస్తే ఎలాగ? ఒకటి; మీరా? అవును నేనే: రెండు: అయిదేళ్ళకి మళ్ళీ ఈరాత్రి? అవును, అయిదేళ్ళకి మళ్ళీ అదేరాత్రి! మూడవప్రశ్న: ఇన్నాళ్లూ ఏమయిపోయినారు? చీకటిలో చిక్కుపడిపోయాను! నాలుగు: ఎక్కడున్నారు?..." నామాట పూర్తి కాకుండానే,

"ఆపండి అక్కడికి... ఎక్కడున్నారో నాకు తెలుసు. చీకట్లో బ్రతుకుతూ జీవితాన్నించి తప్పించుకుంటున్నారు. అంతేనా?" అన్నది.

"అంతేకాదు. అనుభవాల్ని, జ్ఞాపకాల్ని మథనం చేస్తూ చివరికి మిగిలేది లెక్కచూసు కుంటున్నాను" అన్నాను.

ఆమె నావంక విచిత్రంగా చూస్తూ పక్కనున్నపసివాడి మీద సరిగా దుప్పటికప్పింది. "ఈ పాప మీ పాపేనా?" అని అడిగాను. ఆమె అవునన్నట్లు తలఊపింది.

"దేవతకీ రాక్షసికీ 18 మేడమెట్లు వార అన్నారు కదూ; ప్రస్తుతం ఏ మెట్ల మీద జీవిస్తున్నారు? మేడ ఎక్కగలిగారా?" అని అడిగాను. ఆమె నిట్టూర్చి,

"లేదు... నా జీవితంలో ఆఒక్క విషయంలోనే భయపడ్డాను. చేయూత నిచ్చేవారుకూడా లేకపోయారు" అన్నది.

"చూస్తూంటే బాధలో ఆనందం బరువుగా ఉన్నట్లు ఉందే?" అన్నది.

"ఆ బాధలో సగం మీరూ మోస్తూనే ఉన్నారు... మీరు కనిపిస్తారేమోనని ఈ అయిదేళ్ళనుంచీ..."

"అనుక్షణం ఎదురుచూస్తున్నానంటారు ... శైలా లాగ."

"మీరు నన్ను వెక్కిరించినా అది నిజమే!" అన్నది ఆమె.

"చూడండి! మనం ప్రేమికులం కావాలంటే క్షణం పట్టదు. కాని మనం స్నేహితులుగానే విడిపోదాం" అన్నాను. ఆమె నిట్టూర్చి,

"ఆనందం ఇగిరిపోయి బాధే మిగిలేలాఉంది నాకు... ఒక్క ప్రశ్న మీకు నేను జ్ఞాపకంలేనా? నిజం చెప్పండి" అన్నది.

"ఈ అయిదేళ్ళనూటా ఎలాఉన్నాగాని చూడగానే గుర్తుపట్టేంత జ్ఞాపకంఉన్నారు" అని జవాబిచ్చాను.

"మీకు జాలిలేదు" అన్నది ఆమె. నాకు చాలా బాధకలిగింది...

"అవును జాలిలేదు. ఒకవేళ ఉన్నా ఉపయోగంలేదు. జాలిఉండి మిమ్మల్ని నాతో లేచిరమ్మంటే మీరు రాగలరా? అసంభవం... పాపాయి, వాళ్ళనాన్న ఏమవు తారు?" అన్నాను. ఆమె నావంక తెల్లబోయిచూడటం ప్రారంభించింది.

"విధి ఆడవాళ్ళకాళ్ళకు జీవితాలనే ఇనుపసంకెళ్ళు వేస్తుంది... అవి తెంపటం వాళ్ళతరమూకాదు, భావ్యమూ కాదు' అన్నాను. ఆమె నిశ్శబ్దంగా దుఃఖిస్తోంది. అంద మైన ఆమెచెక్కులమీదనుంచి చెంకీచారలలాటి కన్నీను తళతళ లాడుతున్నది. ఇక అబద్ధా లాడాలనిపించ లేదు నాకు

"మీరెవరో ఎక్కడున్నారో నాకు తెలుసు ఒకనాటి అర్థరాత్రి మిమ్మల్ని నా జీవితంలో దేవీస్థానంలో నిలుపు కున్నాను... ఇంకో ఊహ నాకెప్పుడూ లేదు" అన్నాను.

ఆమె తేరుకుని "ఇంతకూ మీరెవరో చెప్పరూ!" అన్నది.

"చెప్పను. చెపితే మీరు నన్ను లొంగతీసుకుంటారు. కాని ఒక్కమాట. ఒక వస్తువు కావాలనుకున్నపుడు దాన్ని మొదట్లోనే సాధించటానికి ప్రయత్నించాలి. ఆ అవకాశం మనకి లేకపోయింది... బహుశా పిరికితనంకూడా కారణం కావచ్చును... మన జీవితాలు కలియని పట్టాలు... ఆ పట్టాలు ఏ స్టేషనులోనో లూప్‌లైన్‌గా మారవచ్చును. లేదా మారక పోవచ్చును... మనం స్నేహితులంగానే విడిపోవటంమంచిది" అన్నాను. ఆమె నవ్వి,

"మీరు చాలా చిత్రంగా మాట్లాడుతున్నారు. యీ అర్థరాత్రి అయిదేళ్ళతరువాత కలుసుకొని స్నేహితులలాగా విడిపోయినామంటే భగవంతుడుకూడా నమ్మడు" అన్నది.

"అందుకే నేను మరో పెట్టెలో ఎక్కుతాను" అన్నాను.

"మీ ఇష్టం. మళ్ళీ కనబడతారా?" అన్నది ఆమె ఆ ఒక్కమాటలో ఆమెహృదయం అంతా ధ్వనించింది. ఆ ఒక్కమాట చాలు నా బ్రతుకుని అపశృతులమయం చేయ టానికి... అని కళ్ళుమూసుకున్నాడు రామారావు. అతని కళ్ళల్లోంచి నీరు ధారగా ప్రవహిస్తోంది.

"క్షమాయించండి డాక్టర్!... మీకథలో ఆశ్చర్యం ఏమీ లేదు. తను ఆరాధించే దేవుడిపట్లనూ, తను ఆరాధించే మగవాడి పట్లనూ కూడా స్త్రీజాతి ఒకమాదిరిగానే ప్రవర్తిస్తుంది. ఇదే మగడాడికి అవస్థ. వాళ్ళు ఒట్టి ఆరాధించడమే కాదు వరాలుకూడా అడుగుతారు" అన్నాడు డాక్టర్ శాస్త్రి.

"అవును. వాళ్ళు మననించి కోరే ఏ వరమైనా అది వరకు వాళ్ళుమనకి ఇచ్చినది అయిఉంటుంది మనలో వాళ్ళు హృదయాన్ని సృష్టిస్తారు. మళ్ళీ దాన్ని వాళ్ళు తిరిగి ఇవ్వమని అడుగుతారు... ఆ హక్కు వాళ్ళకిఉన్నది కూడా" అని సమాధానంఇచ్చాడు రామారావు.

"నిజం చెప్పారు డాక్టర్!" అన్నది అప్పుడే ఏదో పనిమీద వచ్చిన కాత్యాయని.

శాస్త్రి నవ్వుతూ "ఎప్పుడూ ఏదీ పూర్తిగానిజంకాని, పూర్తిగా అబద్ధంకాని కాదు" అన్నాడు.

"ఇదిమాత్రం నిజం. మీరు ఒప్పుకోవాలి డాక్టర్! స్త్రీలు తమ సర్వస్వాన్ని పురుషులకు అర్పిస్తారు" అన్నాడు రామారావు.

"అవుననుకోండి... కాని ఒక చిక్కు. దఫాలవారీగా మళ్ళీ తీసుకుంటారు" అన్నాడు శాస్త్రి.

కాత్యాయని నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయినయ్.

సిగరెట్‌ను సియాష్‌ట్రేలో విడుపుతూ "తరువాతేమయింది డాక్టర్!" అని ప్రశ్నించాడు శాస్త్రి.

"తరువాత ఏంజరిగిందో ఆకథంతా ఒకగంటకి్రితమే అయిపోయింది" అని నిట్టూర్చాడు రామారావు.

శాస్త్రి లేచికూర్చుని "ఆ అమ్మాయేనా? ... నేనప్పుడే. అనుకున్నాను. కాని డాక్టర్! మీరు ఎందుకలా చేశారు? కనీసం ఆ అమ్మాయికి కావలసిన తృప్తికూడా మీరివ్వలేకపోయినారు. కారణం!" అన్నాడు.

"ఆ అమ్మాయి పెద్దకుటుంబంలో పిల్ల, పెళ్ళి అయింది, తల్లికూడా, అయింది, ఆ అమ్మాయిని నేను లేవతీసుకురావటంతప్ప మరో గత్యంతరంలేని ఈ పరిస్థితిలో నా కర్తవ్యం ఏమిటో నాకు తెలియులేదు. అయినా తన ప్రాణాల్ని కూడా తీసుకునేంతప్రేమ ఆమెకి ఉందని నేను అనుకోలేదు ... మేము రెండుసార్లు మాత్రమే కలుసుకున్నాం ... ఆ రెండుసార్లూకూడా అర్థరాత్రి సమయంలో. ఆ మాత్రానికే ఇంత గాఢమైనప్రేమ ఉందనీ ... ప్రాణం కూడా తృణప్రాయంగా వదిలివేస్తుందనీ నేను అనుకోలేదు" అన్నాడు రామారావు. శాస్త్రి మాట్లాడలేదు.

"కాని డాక్టర్! ఒక చిన్నరహస్యం, ఆమెని ఇప్పుడు మహోద్రుతంగా ప్రేమిస్తున్నాను ... ఈగంటనుంచీ" అన్నాడు రామారావు. శాస్త్రి నవ్వాడు.

"మీరు నవ్వుతారని నాకు తెలుసు ... అయినా నిజం చెప్పాను" అని రెండుచేతులతో తలపట్టుకుని ఏడవటం ప్రారంభించాడు రామారావు. ఇంతలో కాత్యాయని వచ్చి ఆ అమ్మాయిశవాన్ని తీసుకువెళ్ళడానికి వాళ్ళు వచ్చారని చెప్పి వెళ్ళిపోయింది.

"డాక్టర్!" మెల్లిగా పిలిచాడు శాస్త్రి. రామారావు తలఎత్తి చూశాడు.

"కళ్ళు తుడుచుకోండి డాక్టర్! మీకోసం అలమటించి ప్రాణంతీసుకున్న ఆ పిల్లశవాన్ని ఒకతడవ చూసివద్దాం" అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ నిశ్శబ్దంగా వార్డులోకి వెళ్ళారు. అప్పటికే స్ట్రెచరుమీద శవాన్ని పెట్టారు. శాస్త్రి శవందగ్గరికెళ్ళి మొగంమీద గుడ్డతీశాడు. రిగర్ మార్టిస్ ఇంకా ప్రారంభం కాకపోవటం వలన ఆమెఅందం శవాకారం తాల్చలేదు.

డాక్టర్ రామారావు అనిమేషుడై అయిదునిమిషాలు చూసి "పగలు చూడటం ఇదే మొదటిసారి ... ఆఖరిసారి కూడా ఇదే" అని గొణుక్కుని అక్కడినించి వెళ్ళిపోయినాడు.

శాస్త్రి ఆమె మొగంమీద తిరిగి గుడ్డకప్పివేస్తూ,

"ఓ స్త్రీ... నీవొక మహారహస్యవు" అనుకున్నాడు... స్ట్రెచర్ సాగిపోయింది. నిశ్శబ్దంగా ఆమె ఆ హాస్పటల్లోంచి వెళ్లిపోయింది. అయిదునిముషాల్లో మరోరోగి ఆ మంచం మీదకు చేర్చబడ్డాడు... అటుపోయే ఒక నర్సుని పిలిచి ఆ అమ్మాయి అన్నని ఒకసారి పిలవమని చెప్పాడు శాస్త్రి... రెండుమూడు నిముషాల్లో అతను లోపలికివచ్చి డాక్టర్‌కి నమస్కరించాడు. శాస్త్రి అతన్ని కూర్చోమని "ఆమెను ఎలా తీసుకువెడుతున్నారు?" అని ప్రశ్నించాడు.

"టాక్సీమీద." దుఃఖంతో గొంతు పట్టుకుపోతూ ఉంటే జవాబిచ్చాడు అతను.

"విచారించి ప్రయోజనం లేదు ... ఆమె కలవరింతలకి అర్థమేమిటో మీకు తెలిస్తే చెపుతారని పిలిచాను" అన్నాడు శాస్త్రి అతన్ని అనునయిస్తూ.

అతను తలవంచుకుని "ఆమె స్త్రీ ... అందుకే అలా చేసింది" అన్నాడు.

"మీరు నాతో చెప్పడానికి సంశయించకండి"

"సంశయమా! ఇంకా సంశయం దేనికి డాక్టర్? చెప్తా వినండి. ఆమె తన జీవితంలో రెండు తడవలు మాత్రమే చూసిన ఒక వ్యక్తిని ప్రాణప్రదంగా ప్రేమించింది ... రెండో తడవ అతన్ని ఏదో రైల్లో కలుసుకుందిట. అప్పటికతను డాక్టరు చదువుతున్నాడో ఏమిటో - స్టెతస్కోపు చూసి అనుకుందో మరి - అతను డాక్టరు అయి వుంటాడని దీనిఊహ ... అయిదేళ్లు అతను కనిపిస్తాడని ఎదురుచూసింది ... తరువాత సంగతి మీకే తెలుసు" అన్నాడతను.

"మీకీసంగతి ఎలా తెలుసు?" శాస్త్రి అడిగాడు.

"మేము అన్నాచెల్లెళ్ళం మాత్రమే కాదు ... స్నేహితులం కూడా. వెళ్ళివస్తాను డాక్టర్! ... బయట టాక్సీలో మా చెల్లెలు ఒంటరిగా వుంది" అని ఏడుస్తూ వెళ్ళిపోయినాడు అతను. ధీరోదాత్తుడైన శాస్త్రి కళ్లు కూడా చెమ్మగిలినయ్ ... వాచీ చూసుకొని ఆపరేషన్ థియేటరు వైపు సాగిపోయినాడు అతను ... సాగిపోతూ " ఓ స్త్రీ! నీ వెప్పుడూ ఇంతే" అనుకుని నవ్వుకున్నాడు.

* * *

ఈకధ శాస్త్రిని చాలా కదిలించివేసిందనే చెప్పాలి. స్త్రీని సమస్యగా చూసే అతనిదృక్పధంలో ఆమె ఇప్పుడు దేవతగా కూడా కనిపించటం ప్రారంభించింది. స్త్రీ అంటేనే దేవత... ఆ స్త్రీ ఎవరైనా సరే! 'కాత్యాయని' తన తల్లి. 'వారిజ' స్టాఫ్‌నర్సు 'సీతాసాధ్వి' 'ఆయా' 'అంబుజం' అందరూ దేవతలే, అందరూ సమస్యలే.

విశాలమైన అతని దృక్పధం మరింత విశాలమైంది. అసలే అర్ధనిమీలితాలైన అతనికళ్ళు మరింత అర్ధనిమీలితాలైనాయి. తరువాత నాలుగైదురోజులకు అతను వారిజ ఇంటికి వెళ్ళాడు. అతనిని చూస్తూనే కరుగిడిపోయి కౌగలించుకుంది వారిజ.

నిశబ్దంగావున్న ఆ ఇంటిలో వారిజ ఎలావుండకలుగుతున్నదో ఆమెకే తెలియాలి అనుకున్నాడు శాస్త్రి... లతలా తనని అల్లుకుపోయిన వారిజని నుదుటిమీద ముద్దుపెట్టుకుని,

"జీవితం ఈ ఇల్లంత నిశ్శబ్దంగా ఉండి నిశ్శబ్దం వారిజలాటి సుందరమైనదే అయితే..."

"అయితే"

"వాక్యం పూర్తి చేయాల్సిన బాధ్యత నీదే వారిజా"

"నేను ఆడపిల్లను శాస్త్రీ!" అని నవ్వింది వారిజ

ఇద్దరూ ఒకరినొకరు నిడిచిపెట్టుకుంటూనే సోఫాలో కూర్చున్నారు - శాస్త్రి డాక్టరు రామారావు విషాదపరిణయ గాధ వారిజకి చెప్పాడు. శాస్త్రి చేతిని తన రెండుచేతుల

మధ్యా నొక్కి దాచుకుని కథంతా విన్న వారిజకళ్ళల్లో నీళ్లు నిలిచినయ్.

"శాస్త్రీ! ఈ కథ నిజంగా జరిగిందంటావా?" అన్నది ఆమె.

"జరగటంలో నా కళ్ళముందు జరిగింది. లేకపోతే నేనూ నమ్మకపోయేవాడినే" అని జవాబిచ్చాడు శాస్త్రి. అతనికంఠం బేస్‌లో ఉంటుంది. ఆ కంఠస్వరం లోకాన్ని శాసిస్తుంది కూడా.

"అయితే ఈ కథలన్నీ నువ్వు నాకెందుకు చెపుతావు?" అతని షర్టుగుండీని గుండ్రిగా తిప్పుతూ అడిగింది వారిజ.

"దృష్టి విశాలం అవాలని... నన్నీకథ చాలా కదిల్చింది వారిజా!" అని నిట్టూర్చాడు శాస్త్రి.

"అర్థంలేని అవినీతివాతావరణంలో పుట్టిపెరిగిన నా దృక్పథం విశాలం అవటంలోనూ, అవుతుందనుకోటంలోనూ బొత్తిగా నమ్మకంలేదు శాస్త్రీ!"

"తప్పుల్ని క్షమించగలిగిన ఔదార్యం ... అంగవైకల్యాన్ని అగౌరవపరచని ఔన్నత్యం... నువ్వనా్నవే అవినీతి వాతావరణమని-అందులోనే ఉంటుంది... కాత్యాయని లాటి ఉన్నతులూ, నీలాటి విప్లవకారులూ, అక్కడే కనిపిస్తారు. జీవితపు కవాటాలు అక్కడ తెరుచుకున్నట్లు ఇంకెక్కడా తెరుచుకోవు... కాని లోకం దాన్ని అవినీతి అనే అంటుంది... అంతకన్న మరోమాటలేదు మరి."

"సరే...నువ్వు పుట్టిపెరిగిన వాతావరణంలో అవి నీతితాలూకు గాలికూడా దూరదుగదా! మరి నీవెలా ఈ వాతావరణాన్ని సహించగలుగుతున్నావు?"

వారిజప్రశ్నకి కొంచెంసేపు ఏ సమాధానం ఇవ్వలేదు శాస్త్రి. తరువాత నిట్టూర్చి,

"నా కథ మరోసారి నీకు చెపుతాను...ఆ సంగతి వదిలేద్దాం...ఇంతకీ నువ్వెట్లా ఉన్నావు?"

ఒంటరిగా ఈ పెద్దమేడలో ... కేవలం వంటమనిషీ పనిమనిషీ సహాయంతో...చుక్కల్ని లెక్కపెడుతూ..."

"కర్త అర్థమయింది...క్రియచెప్పు మరి?"

"క్రియ ఏముంది? కేవలం నిన్ను తల్చుకోటంతప్ప మరోక్రియ నాకు లేదు ... నీ గొంతు జ్ఞాపకం వస్తే...నా హృదయ మృదంగం ప్రళయగర్జన చేస్తుంది...నీ కళ్ళు గుర్తుకివస్తే నా గుండెల్లో శ్మశానాగ్ని నర్తిస్తుంది ... ఇక నీవే జ్ఞాపకంవస్తే ... బ్రతుకే విడిచిపెట్టేద్దామనిపిస్తుంది... శాస్త్రీ! ఇది నా కథ ... ఇక నీ సంగతి చెప్పు" అన్నది వారిజ. శాస్త్రి బుగ్గమీద చిటికెవేసి;

"ఇంత పిచ్చిపిల్లవైపోతే నేనసలు నీకు కనిపించకుండా ఉంటే క్షేమమేమో?"

"బాగుంది. మొదట నన్నెందుకు కదిలించావు? ఆ సంగతి చెప్పు ముందు" అన్నది బుంగమూతిపెట్టి వారిజ.

"కదిలించాలని నువ్వు కోరుకున్నావు కనుక"

"అబద్ధం. నేను కోరుకోలేదు"

"నీకు తెలియకుండానే కోరుకున్నావు ... లేదా నా మనసులో మెదిలిన భావానికి రూపం కల్పించావు"

"నీ మనసులో ఉన్న భావానికే రూపంకల్పించాను గాని, లేనిది కల్పించలేదుకదా"

"లేదనుకో"

"అయితే బ్రతికించావు...మరి ఇకముందు సంగతి?"

"పిచ్చితల్లీ"

"ఆ వాక్యంతో నన్ను చల్లపరచాలని ప్రయత్నించకు శాస్త్రీ!" అన్నది వారిజ ... కొంచెంసేపు ఇద్దరూ మాట్లాడలేదు...ఉన్నట్లుండి పకపకా నవ్వి,

"మనిద్దరం లేచిపోదామోయ్!" అన్నది వారిజ.

"ఇక్కడ మనల్ని అడ్డుకునేవారెవరు- లేచిపోవటానికి ?"

"మన మనస్సే అడ్డుకుంటున్నది" అని నిట్టూర్చింది ఆమె.

* * *

తన కురూపితనాన్ని అనుక్షణం అద్దంలో చూసుకోవాలనే కోరికా, తన పొరపాట్లను తిరగవేసి తోడుకోవాలనే ఆరాటమూ ఏమనిషికుంటాయో ఆమనిషి తను సరిగా జీవించలేకపోవటమే కాకుండా ... పరిసరాల్ని కూడా నిర్వీర్యం చేస్తాడు.

రమణమూర్తి సరిగ్గా అదేరంతు...వారిజా, శాస్త్రీ సన్నిహితులవుతున్నకొద్దీ అతనికి భయం ఎక్కువవ్వటం, మొదలెట్టింది...సరిగా, జీవితాన్ని ప్రేమిస్తూ - వారిజన్ని

ద్వేషిస్తూఉన్న ఈ సమయంలో ఒకనాటి మధురసంధ్యా సమయంలో Mont Road లో హటాత్తుగా నిలవేసి రమణ మూర్తిని తన టాక్సిలో ఎక్కించుతుంది వారిజ.

అస లేంజరిగిందో అతనికి అర్థమయ్యేలోపలే అతను వారిజ డ్రాయింగ్‌రూము లో సోఫామీద ఉన్నాడు.

అరవిచ్చిన విరజాజిలా అమాయకంగా ఉన్న ఆ యువకుడిని చూసి తనలోతనే నవ్వుకుని లోపలికి వెళ్ళింది ఆమె.

రమణమూర్తికన్న నిజానికి వారిజే చిన్నది... అయినా అతనికంటె కొన్నియుగాలు తనే పెద్దగా తోచింది ఆమెకు... అదేచిత్రం స్త్రీలో - పదహారేళ్ళవాకా బాలికగానే ఉన్న ఆమె శరీరంలో హఠాత్తుగా వచ్చిపడిన మార్పుతోపాటు మానసికంగా కూడా ఒక్కసారి ఎదిగిపోతారు.

ఆతరువాత పదహారేళ్ళ బాలాకుమారికీ ఏభైఏళ్ళ అవ్వకీ ఏ విధమైన భేదమూ ఉండదు. ఏభైఏళ్ళస్త్రీ తనకన్న చిన్న వాడిని ఎలా చూస్తుందో పదహారేళ్ళయువతికూడా తనకన్న చిన్నవాడని - తనకి అనిపించిన మగవాడిని అలాగే చూస్తుంది. అదే చిత్రం స్త్రీలో.

"రమణమూర్తిగారూ! బిస్కట్లు ఇవ్వనా?" అన్నది వారిజ.

రమణమూర్తికి చాలా చిన్నతనంలోనే తను పోగొట్టుకున్న తల్లిజ్ఞాపకంవచ్చింది - ఈమె ముందు తను ఎందుకు మాట్లాడలేకపోతున్నాడో-తనకా సమయంలో మాతృభాష కూడా ఎందుకని జ్ఞాపకంరాదో, అతనికి అంతుపట్టటంలేదు.

మొదలకుండా బిస్కట్లుతినటం ప్రారంభించి బుద్ధిమంతుడల్లే టీ కూడా తాగేశాడు. వారిజ అతనివంక పరీక్షగా చూసి,

"ఏమండీ! అలా వున్నారు!" అని ప్రశ్నించింది. రమణమూర్తి ఖంగారుపడి - టీకప్పువంక చూస్తూ "ఏంలే దండీ" అని జవాబిచ్చాడు-కాని వారిజ అతను తనని ద్వేషి స్తున్నాడని గ్రహించేసింది.

"ఆ ద్వేషం వెనకాల ఎంత ప్రేమా, ఆరాధనా ఉందో మాత్రం గ్రహించలేకపోయింది. అప్పుడు అజ్ఞానమూ, దుర దృష్టమూకూడా అడ్డుగోడలై నిజాన్ని దాచేస్తయి-దాక్కున్న ఆ నిజం తాచుపామై జీవితాన్ని కాటువేసేదాకా దాని ఉని కిని గ్రహించలేకపోతారు మనుష్యులు.

వారిజ ఆ పొరపాటే చేసింది. రమణమూర్తి పసి హృదయం, ఆ కాటుని ఓర్చుకోలేకపోయింది. అతిబలహీ నమూ - అపనమ్మకమూ నిండిన అతనిగుండెలో ఏదో ముల్లుగుచ్చుకున్నట్లు అనిపించింది. చివాలునలేచి వెళ్ళిపోయి నాడు - వారిజ తెల్లబోయింది.

నాలుగురోజులు గడిచినతరువాత ఇక దాచుకోలేక శాస్త్రితో విషయమంతా చెప్పేసింది-రమణమూర్తిముందు తను ఎంత పెద్దదాన్ననుకుంటుందో - శాస్త్రిముందు అంత చిన్నపిల్లయిపోతుంది వారిజ - శాస్త్రి సాలోచనగా వారిజ వంక చూస్తూ,

"రమణమూర్తి నిన్ను ద్వేషించటంలేదు వారిజా! పైగా ప్రేమిస్తున్నాడు కూడా" అన్నాడు.

"అదెలా?"

"అదంతే - నీ ప్రేమనించీ, ఆకర్షణనించీ తప్పుకోలే నని తెలుసుకుని దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తున్న అర్భకుడు"

"ప్రేమిస్తే దగ్గరగా ఉండాలనుకుంటారు గాని, దూరంగా ఉండాలనికూడా అనుకుంటారనే విషయం ఇంత మటుకు నాకు తెలియదు."

"నీకు తెలియని విషయాలు ఇంకా చాలా ఉన్నాయి ఈ లోకంలో" అని నవ్వాడు శాస్త్రి.

"ఆ చాలావాటిల్లో ప్రధానమయినది నీ మానసు" అని నిట్టూర్చింది ఆమె.

"స్త్రీకి నిట్టూర్చడం అంటే ఇష్టం అనుకుంటాను. వాళ్ళు నగ్నంగా ఉండే విషాదాన్ని ప్రేమిస్తారు - ఒకవేళ ఎవరయినా వాళ్ళకి విముక్తి ఇచ్చినా - వాళ్ళనే తల్చుకుని నిట్టూర్చడం ప్రారంభిస్తారు - కాని నువ్వు అలా కావద్దు వారిజా! జీవితం నీకోసం ఎన్నిటినో దాచి ఉంచింది. ఢోరియాల సిల్కుతెరలాటి భవిష్యత్తులో ఎన్నో అద్భుతానుభవాలు నీకోసం ఎదురుచూస్తున్నాయి"

"కాని శాస్త్రీ! నేనూ ముసలిదాన్ని అయిపోతాను - నా యవ్వనం ముడ్రూడలు వేస్తుంది - అందమైన నా నీలి రంగు భయంకరమైన కారునలుపుగా మారిపోతుంది-అప్పుడు ఏమవుతుంది శాస్త్రీ !"

"అప్పుడు నీవు అపజయంతో యుద్ధంచేయాల్సి ఉంటుంది. మనం ఒక అద్భుతమైనకాలంలో జీవిస్తున్నాం - జ్ఞానం నశించేంత సంస్కారం; సౌందర్యం నశించేంత

వాంఛా ఉన్నకాలం ఇది - నిన్ను ఈ కాలంచేతుల్లో వది లేయటం నా కిష్టంలేదు వారిజా! - కాలానికి అతీతురాల్ని చేస్తాను" అని వారిజని దగ్గరకుతీసుకున్నాడు శాస్త్రి.

అతనిగుండెలమీద పసిపిల్లలా వాలిపోయిఉన్న వారిజ జీవితం తనకై నిర్దేశించిపెట్టిన బాటని చూచాయగా దర్శించ కలిగింది...తరగని తారుణ్యం - మొదలూ చివరా లేని ఉత్సాహం - కనిపించీ కనిపించని సౌఖ్యానుభూతితాలూకు రహస్యాలు- తుపాను గాలులలాటి అనుభవాలు - అందమైన పాపాలు - తన జీవితమార్గంలోకి తొంగిచూసిన వారిజ ఖంగారుపడింది. శాస్త్రిని మరింత అల్లుకుపోయి;

"శాస్త్రీ! నన్ను వదలకు సుమా" అని ప్రాధేయ పడింది. శాస్త్రి సమాధానంచెప్పకుండా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావు?"

"నువ్వన్న మాటకి"

"ఏం! ఆ మాటలో ఏదైనా తప్పు ఉందా?"

"నువ్వు ప్రేమించాలని ప్రయత్నించటంగాని-ప్రేమిం చానని భ్రమించటం గాని చేయవద్దు వారిజా! - దానివల్ల నీకు సుఖం దొరకదు"

"అంటే?"

"మనిషిలో ఉండే అహంకారాన్ని అందమైన వస్తు వుగా ఊహించుకునేవాళ్ళ అపక్వ మనస్తత్వం అంటే నా కసహ్యం. ప్రేమ అలాటి మనస్తత్వానికి దోహదం చేస్తుంది"

"బాగుంది"

"మనిషి జీవిస్తున్న వర్తమాన జీవితంలో వేలకొద్దీ జీవితాల ఛాయలు ఉన్నాయి - అతనిగుండెలో వేలకొద్దీ గుండెలు పాడుతున్న లయ అంతర్గతంగా గర్భితమై ఉంది. ఒక వ్యక్తి-ఒకే వ్యక్తి ఎప్పుడూ కాదు. అనేకమందివ్యక్తుల వారసుడు కాదు - అతని ప్రతినరంలోనూ పారతంత్ర్యం అనేపాపం ప్రవహిస్తూ ఉన్నది"

"దానికీ ప్రేమకీ సంబంధం?"

"వెన్నెలకీ ఎండకీ ఏమాత్రం సంబంధమూ లేదని మనకి అనిపించినా - కొన్నాళ్ళయినతరువాత ఎండే వెన్నెలగా మారుతున్నదని తెలుసుకున్నరోజున మనం ఇట్టే ఆశ్చర్యపడం"

"మరయితే నన్ను ప్రేమించవద్దని సలహాఇచ్చిన వాడివి-నువ్వెందుకు ప్రేమిస్తున్నావు?"

"మరేంలేదు. పూర్వం నా పుస్తకాలమీద నా పేరే వ్రాసుకునేవాడిని. ఇప్పుడు నీపేరు వ్రాస్తున్నాను. అదే ప్రేమ అనుకోవాలనుకుంటే అనుకో - నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు శాస్త్రి. వారిజ పకపకా నవ్వి,

"నీవు చాలా విచిత్రమైనవాడివి" అన్నది.

"చిత్రమైనవాడిని నేను కాదు"

"మరయితే నేనా?"

"నువ్వూ కాదు"

"మరి?"

"ఒక కల్పనాత్మకనాటికలోని హాస్యఘట్టం లాటిది - మనజీవితం. అది చిత్రంగానే ఉంటుంది - చిత్రం [illegible]

లేదు, వారిజా! అది జీవితంలో ఉన్నది'' అని జవాబిచ్చాడు శాస్త్రి.

"ప్రతి చిన్నవిషయాన్నీ ఇంత స్పష్టంగా చెప్పటం చాలా గొప్పతనం శాస్త్రీ-! నువ్వు డాక్టరువయినావుగాని పంతులువి అయితే బాగుండేది - అలా కాకపోవటంవలన లోకం ఎంతో పోగొట్టుకున్నది'' అని నవ్వింది వారిజ.

"ఎంతబాగుపడినా లోకంలో కొన్ని చీకటిమూలలు మిగిలితీరుతాయి - లోకాన్ని బాగుచేద్దామనుకునేవాళ్ళకి వాటి అవసరం ఉండితీరుతుంది''

"నువ్వేదో ఆలోచిస్తూ పరధ్యానంగా మాట్లాడుతున్నావు?''

"కాత్యాయని విషయం'' అన్నాడు శాస్త్రి సాలోచనగా.

"ఏమిటది?''

"ఎందుకో ఈమధ్య నిరుత్సాహంగా నీరసంగా ఉంటున్నది - కారణం అడిగితే చెప్పదు''

"కారణం నాకు తెలుసు'' అన్నది వారిజ నిట్టూరుస్తూ. శాస్త్రి సమాధానం చెప్పలేదు; వారిజ నవ్వింది.

"ఆమెకు నువ్వు అంటే చాలా ఇష్టం - ఆ ఇష్టాన్ని పైకి చెప్పి తనమీద నీకుండే సదభిప్రాయాన్ని పాడుచేసుకోటం ఇష్టంలేదు - కాని అసూయమాత్రం ఎంత ఆపుకుందామన్నా ఆగదు ఆడదానిలో.''

"నేనంటే ఇష్టమని చెప్పినంతమాత్రంచేతనే నాకు తనమీద ఉన్నసదభిప్రాయం పోతుందనుకునేంత అర్భకురాలు

కాదు కాత్యాయని - పైగా ఆమె ఈ అసూయలకి అతీతు రాలు"

ఆ సమాధానానికి వారిజ చిన్నబుచ్చుకుంది. "పోనీలే శాస్త్రీ! ఇక ఆమెవిషయం మాట్లాడను - ఇంకోటేదైనా చెప్పు" అన్నది. శాస్త్రి ఆమెను దగ్గరకు తీసుకొని "పిచ్చి తల్లి!" అన్నాడు. శాస్త్రిని అల్లుకుపోయింది ఆమె.

"దైహికంగా నన్ను రెచ్చగొట్టాలని ఎందుకింత ప్రయత్నిస్తావు చెప్పు" అన్నాడు- ఆమెబుగ్గమీద చిటికె వేస్తూ, శాస్త్రి - ఆమాటకి మరింతగట్టిగా అతనికి హత్తుకు పోయి-

"లేదు శాస్త్రీ! ఇలా ఉంటే మనం దగ్గరగా ఉన్నట్లు అనిపిస్తుంది... ఇంతకూ నువ్వు నాకేమవుతావు?" అన్నది వారిజ - శాస్త్రి ఆమెనుదుటిమీద జుట్టుని పైకి తోస్తూ,

"నువ్వు నీకేమవుతావు?" అన్నాడు.

"నాకు నేను నువ్వవుతాను"

"నీకు నేనూ నువ్వు అవుతాను"

"అంతేనా?"

"అంతే"

సరిగ్గా ఆసమయంలో ఎవరో పడినట్లయింది. పక్కకి తిరిగి చూస్తే కాత్యాయని - ఆమె ఎప్పుడువచ్చిందీ ఎవరూ చూడలేదు. తన మాటలన్నీ విన్నదో ఏమో! వారిజ తెల్ల పోయింది.

శాస్త్రి హడావిడిగా లేచి కాత్యాయనిమొగంమీద నీళ్ళుచల్లి సేదతీర్చాడు. కాత్యాయని లేచి సరిగాకూర్చుంది.

"ఇటీవల నీకు హిస్టీరియా తరుచు వస్తోంది కాచీ! తాగుడు మానేస్తేతప్ప అది తగ్గదు.-ఇంతకీ నువ్వెప్పుడొచ్చావు!" అన్నాడు శాస్త్రి కాత్యాయనివంక అనునయంగా చూస్తూ.

"మీకు మీ రేమవుతారో చెప్పుకుంటున్నప్పుడు" అని బలహీనంగా నవ్వింది కాత్యాయని.

"అసూయ పడుతున్నావా!" నిశితంగా కాత్యాయని వంక చూస్తూ అన్నాడు శాస్త్రి. కాత్యాయని సరిగ్గా కూర్చుని,

"నా దేవుడిని మరొకరు ఆరాధిస్తున్నారని నే నెప్పుడూ అసూయపడను. అతని భక్తురాళ్ళలో నే నొకదాన్ని-అంతే" అన్నది. శాస్త్రి కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "నీవు భక్తురాలివనికూడా అనుకోలేదు కాచీ? అదీ చిత్రం" అన్నాడు.

"అది నా తప్పుకాదు డాక్టర్!"

"సరే! నువ్వు ఎందుకువచ్చినట్లు?"

"మిమ్మల్ని డిస్టర్బ్ చేసినందుకు క్షమించండి డాక్టర్! గిండీనించి శీలా దేవిరక్తం వచ్చింది - బ్లడ్ బ్యాంకులో ఆ రక్తానికి సరిఅయినది లేదని చెప్పమన్నారు రామారావు గారు"

"పోనీ ప్లాస్మాగాని సెలైనుగాని వాడకపోయినారా?"

"నాకు తెలియదు. మిమ్మల్ని వెంటనే రమ్మన్నారు"

"సరే అయితే - నాకు Duty టైముకూడా అయింది. వస్తా కాచీ!" అని లేచాడు శాస్త్రి. - శాస్త్రిని తననుంచి

ఈ కాత్యాయని లొంగిపోవటంలేదుగదా, అనుకున్నది వారిజ.

*　*　*

"డాక్టర్ ! మీ ప్రవర్తనవిషయంలో చాలా పుకార్లు బయల్దేరాయి హాస్పటల్లో" అన్నాడు శాస్త్రితో డాక్టర్ రామారావు.

శాస్త్రి నవ్వి "ఏ విషయంలో?" అన్నాడు.

"కాత్యాయనితో - ప్రస్తుతం ఆ టి. బి. పేషంటు నీలాదేవితోనూ - అసలుసంగతి నాకు చెప్పండి డాక్టర్!"

"నీలాదేవిసంగతి మీరూ నమ్ముతున్నారా?" అని నవ్వాడు శాస్త్రి.

"నేను నమ్మటంలేదు గాని - ఏదో కొంత శ్రద్ధ ఉన్నట్లు అనిపిస్తోంది" అని సిగరెట్ వెలిగించాడు రామారావు.

"మీ జీవితంలో జరిగిన ఒక కళాత్మకమైన ప్రేమకథ నాకు చెప్పారు మీరు - అప్పటినించీ స్త్రీని దేవతగా చూడాలనిపిస్తోంది - ఏ స్త్రీకయినా సరే సానుభూతి ఇవ్వాలనిపిస్తున్నది"

"ఇంతకీ అసలుసంగతి చెప్పండి డాక్టర్!"

శాస్త్రి సిగరెట్ వెలిగించి చెప్పటం ప్రారంభించాడు.

"నీలాదేవి ఒక ఇంజనీరుగారి అనధికారధర్మపత్ని. అదివరకు నాటకాల్లో సినిమాల్లో వేషంవేస్తూ ఉండేది. ఎలాగో క్షయ వచ్చింది. ఆ ఇంజనీరు నాకు తెలిసినవాడు - అందు

కని?" అని అర్ధోక్తిలో ఆపినశాస్త్రిని చూసి నవ్వాడు రామా రావు - శాస్త్రి కూడా నవ్వేసి,

"ఉన్నసంగతి చెప్పెయ్యమంటారా? - అసలు మాన వుడి మనసులాటి విచిత్రపదార్థం ఈ సృష్టిలో మరొకటిలేదు- నాగంరోజులనాడు ఆమెనిక్కడ జాయిన్ చేసుకున్నపుడు ఆమె అందాన్ని చూసి గాబరాపడ్డాను - తరువాత ఆమెకథ విన్న ప్పుడు జాలీ, అసహ్యమూ, సానుభూతీ కూడా కలిగినయ్. ఆమె పతిత - కాని స్త్రీ. అందుకే నాకు జాలి. అంతకన్న ఇంకేం లేదు." అన్నాడు. రామారావు నిట్టూర్చి "పదండి! రౌండ్స్‌కి వెడదాం" అన్నాడు.

సరిగా ఆ సమయంలోనే నీలాదేవితో కాత్యాయని గొడవ పడుతోంది. ఆ అందకత్తె అతి పెంకిది- అని కాత్యా యని గ్రహించి ఆమెను కసురుతూ,

"మిమ్మల్ని అట్టే మాట్లాడవద్దన్నారు డాక్టర్ - మీరేమో చెప్పినమాట వినక అస్తమానం ఏదో ఒకటి మాట్లాడుతూనేఉంటారు" అన్నది. నీలాదేవి రెచ్చిపోయి,

"మాట్లాడకుండా కూడా చావాలా? ఈ బ్రతికిఉన్న నాలుగురోజులయినా మాట్లాడనియ్యండి" అన్నది.

"మీకేంలోటు వచ్చిందని అస్తమానం - చావు - చావు - అంటారు. అలా ఉద్రేకపడితే టెంపరేచరు తగ్గదు" అన్నది కాత్యాయని.

"సిస్టర్, లోనికి రావచ్చునా?"

"కమిన్ డాక్టర్!"

"నమస్కారం నీలాదేవిగారూ! ఈపూట మీకు దగ్గు తగ్గింది అనుకుంటాను - సిస్టర్! ఆ స్పిరిట్ బాటిల్ ఇలా ఇయ్యి" అన్నాడు శాస్త్రి. నీలాదేవికి వళ్ళుమండిపోయింది. బిగ్గరగా అరుస్తూ "నాకేమీ వద్దు" అన్నది.

ఆమె కోపానికి శాస్త్రి నవ్వి "మీకు కంప్లీట్ రెస్ట్ కావాలి. ఆత్రేమూ ట్లాడకండి-హాయిగా విశ్రాంతి తీసుకోండి సిస్టర్! ఆరో నెంబర్ బెడ్ అరుణాపతికి హాట్ వాటర్ ఇచ్చిరా,- నీడిల్ బాయిల్ చేసి ఇయ్యి. ఈపూట ఒ ఇంజక్షన్ ఇవ్వాలి - నీలాదేవిగారూ! మీరు నిద్రపో సిస్టర్! పద" అని ఇవతల పడ్డాడు కాని ఆమె ప్రవర్తన నికి వింతగా ఉంది. "ఏమి టీ ఆడవాళ్ళు?" అనుకున్నాడు, అరుణాపతికి ఇంజక్షన్ ఇచ్చి,

"ఈపూట మీకు ఎలా ఉంది? నొప్పి తగ్గిందా? పొద్దున మీ నాన్నగారు వచ్చారనుకుంటాను" అన్నాడు.

"అవును, ఎవరువస్తే ఏం లాభం డాక్టర్ !? నేనిక భూమిమీద పాదంపెట్టలేని వ్యర్థురాల్ని - మీ మందులు వృధా అవటంతప్ప ప్రయోజనంలేదు" అన్నది, పక్షవాతం చేత రెండుకాళ్ళూ పడిపోయిన ఆ యువతి. అకారణంగా మండిపడే నీలకీ, అతిశాంతమూర్తి అరుణకీ ఎంతభేదం? అను కున్నాడు శాస్త్రి.

"పాపం! ఈమెబ్రతుకంతా ఇంతే" అని లోపల అని పించిం దతనికి - పైకి మాత్రం "చూడండి! కాళ్ళు లేకపోవటం లోపమే - ఒప్పుకుంటాను. కాని బ్రతుకంతా

వ్యర్థం అనుకోటం పొరపాటు. ఆమెలాగా మీరూ భావిం చటం అన్యాయం'' అన్నాడు.

"ఆమె అంటే ఆ టి. బి. పేషంటు నీలాదేవి మాటేనా? అవును. ఇంకెలా అంటుంది! ఎంత బాధపడుతున్నదో పాపం! - వారంరోజులనించీ చూస్తున్నాను. నాతో ఇంత గా మాట్లాడతారు. ఆవిడతో ఎందుకు మాట్లాడరు? ల్సింది చికిత్సతోపాటు సానుభూతికూడా డాక్టర్!"

"ఆమె యెవతో కొత్త - అయినా ఆ సంభాషణ సరం. పోనీండి! ఇంతకీ మీ కీపూట ఎలాఉంది?"

"బాగానేఉంది గాని ఏమిటో కొరతగా ఉంది డాక్టర్! అస్తమానం ఎవరన్నా కబుర్లుచెప్పేవారుంటే బాగుండు ననిపిస్తోంది - ఈ డాక్టర్లందరిలోకీ మీరు చక్కని కబుర్లు చెపుతారు - అందుకే మీరు Duty లో ఉన్నా రంటే ఎంతో సంతోషం నాకు"

"గంట కబుర్లకి ఎంతిస్తారో చెప్పండి మరి?" అన్నాడు శాస్త్రి నవ్వుతూ.

"ఎంతఇస్తే రుణం తీరుతుందో చెప్పండి?"

"పేషెంట్ - చెప్పినమాటవిని డాక్టరుతో సహక రించటం కన్న ఇంకేం కావాలి? - మీరు మంచి పేషెంట్. మీలాంటి జీనియస్‌కి కాళ్లే వస్తేఎంత బాగుంటుంది?"

"కాళ్ళువస్తే వెళ్ళిపొమ్మంటారు. కనక రాకూడ దనిపిస్తోంది నాకు'' అని నిట్టూర్చింది అరుణ. శాస్త్రి గతుక్కు మన్నాడు. అవధ్యురాళ్ళైన ఈ స్త్రీలు సానుభూతీ, ఆప్యా యతా కోరుతున్నారు - మిగతాడాక్టర్లు అది పట్టించుకోరు.

తను పట్టించుకుంటాడు. డాక్టర్లకి ఉండకూడని బలహీనత తనలో ఉంది.

ఇంతలో నీలాదేవి అరుణతో కబుర్లుచెప్పటానికి వచ్చింది. అది చూసి డాక్టర్ సత్యనారాయణశాస్త్రి అవతలకు వెళ్ళిపోయినాడు - అరుణ ఆమెను ఆహ్వానించింది.

"కూర్చోండి నీలాదేవిగారూ! - ఏమిటండీ? మీారెప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటారు. టెంపరేచర్ రైజ్ అవుతుంది. అయినా మీాఅంత అందమైనవారికి లోటేమిటి? ఇక్కడికి వచ్చినతరువాత రెండురోజులు బాగానే ఉన్నారు; తరువాత అదోలా ఉంటున్నారు." అన్నది.

నీలాదేవి కుర్చీలాక్కుని కూర్చుంది. అరుణ అడిగిన ప్రశ్నకి కొంచెంసేపు సమాధానం చెప్పలేదు. తరువాత;

"నాలాటి స్త్రీసంగతులు మీాలాంటివారు వినతగ్గవి కావు. ఇక నా మనసులో బాధ అంటారా? ... ఒకవేళ చెప్పినా లోకంతోపాటు మీారూ పరిహసిస్తారు" అన్నది.

"అంత సంకుచితంకాదు నా స్వభావం. మీారు చెప్పండి" అన్నది అరుణ.

రౌండ్సుఅయినాక తిరిగీ ఆ వార్డులోంచి వెడుతున్న శాస్త్రికి ఈమాట వినబడి ఆగాడు. అక్కడికి వాళ్ళిద్దరి సంభాషణా స్పష్టంగా వినిపిస్తున్నది. నీల చెప్పటం పారంభించింది. "శ్రీశైక లేనిమరో కథ" అనుకుని సిగరెట్ ముట్టించాడు శాస్త్రి.

"నా జీవితంలో నన్నింత ఆప్యాయంగా ఆదరించిన వాళ్ళు లేరు అరుణగారూ! - మీరు అసహ్యించుకోకుండా ఉంటే నా జీవితచిత్రం మీముందు పరుస్తాను.

నన్ను కావాలని వచ్చినవాళ్ళంతా నా కోసం రాలే దనీ వాళ్ళకు కావల్సింది కేవలం నా శరీరమేననీ తెల్సుకునే సరికి నేను ఊబిలో కూరుకుపోయి ఉన్నాను. - ఇక నా మనసు నా అంతటిది లేదని గర్వించింది - డబ్బుచూసి తాత్కాలికంగా తృప్తిపడ్డది - కాని అరుణగారూ! స్త్రీకి కావల్సింది అంతమాత్రమే కాదనీ పొందవల్సినవి చాలా ఉన్నాయనీ తెల్సుకునేందుకు ఇంతకాలం పట్టింది. - ఇప్పుడీ అభాగ్యురాల్ని ఎవరూ నమ్మరు. - నీల డబ్బుకోసం ప్రేమ నటిస్తుందనేతప్ప ప్రేమఅనేది ఆమెకుకూడా ఉందని ఎవరూ అనుకోరు - నాకు కావల్సింది సానుభూతి - ప్రేమ - అవి అంతచౌకగా లేవు. ఏమిటి ఆలోచిస్తున్నారు? ఈ జీవన్మరణ సంధిలో కూడా ఈ కులట ప్రేమని గురించే ఆలోచిస్తుం దేమిటి? - అని అసహ్యించుకుంటున్నారు కదూ!" అన్నది నీల.

"లేదు - ఆడదానిమనసు అంతుపట్టక ఆలోచిస్తు న్నాను - మీకు కావలసింది నాకు అర్థం అయిందండీ! మిమ్మల్ని తలుచుకుని చెమ్మగిలే కన్నులు మీకుకావాలి. కాని ఆ కన్నులే మీమీద అగ్నికురిపిస్తున్నాయి - ఒక వస్తువు కావాలనుకోటం - దానికోసం బాధపడటం - ప్రయత్నం చెయ్యాలనుకోటం మానవసహజం - కాని అది అలభ్యమయితే విచారించటం పశువుల లక్షణం, మిమ్మల్ని

ఆ ఇంజనీరుగారెంతో ప్రేమిస్తున్నారు. - కాని మీరు తిరిగి ఆయనను కోరటంలేదు - పైగా ద్వేషిస్తున్నారు - దానికి కారణం లేదేమో! బహుశా ఎవరు తనని నిర్లక్ష్యంచేస్తున్నారో వారినే వెతికిపట్టుకుని ఆరాధించటం ప్రారంభిస్తారు స్త్రీలు" అన్నది అరుణ—శాస్త్రి ఇక అక్కడ నిలబడలేక లోపలికివచ్చి నీలని తన రూములోకి పోయి విశ్రాంతితీసుకో మన్నాడు - ఆమె వెళ్ళిపోయింది.

"స్త్రీహృదయం ఎంత అంధకారం డాక్టర్! సముద్రంలో దిగటానికి సబ్ మెరీన్లు ఉన్నాయి! ఆడదాని అంతర్యపు లోతుని కొలవటానికి ఏ సాధనమూ లేదు" అన్నది అరుణ

శాస్త్రి నవ్వి "ఇంతకూ విషయం చెప్పండి. తరువాత ఆడదాని అంతర్యాన్ని గురించి తీరికగా చర్చిద్దాము" అన్నాడు.

"మీ కర్థంకాదు డాక్టర్! ఎప్పటికయినా స్త్రీహృదయం స్త్రీయే అర్థంచేసుకోగలదు"

"ముల్లుని ముల్లే తియ్యాలన్నట్లు"

"వెటకారం చేయకండి మరి - మీ రెప్పుడయినా నిష్కామప్రేమని గురించి విన్నారా? - పోనీ ఊహించనయినా ఊహించారా? అది చెడిపోయింది- అని మీరు భావిస్తున్న స్త్రీలలోనే ఉంటుంది'' అన్నది అరుణ.

"నేనూ స్త్రీపక్షపాతిని కనుక ఆ విషయంలో మీతో ఏకీభవిస్తాను. ఇంతకీ అసలుసంగతి ఏమిటి?"

"ప్రతిఫలాపేక్షలేని ఆత్మసమర్పణ ఆడదానికేసాధ్యం డాక్టర్! - మీ మగవాళ్లు ఆ సమస్యకి ఏనాడూ సమాధానం కనుక్కోలేరని గట్టిగా చెప్పగలను"

"మీరేమిటో అర్థంకాకుండా మాట్లాడుతున్నారు అరుణాదేవీ! నా ఉద్దేశ్యంలో అసలు ప్రేమ అనేదే ఉత్త హాంబక్ - ఇక నిష్కామప్రేమసంగతి నా ఊహకి అందనే అందదు"

"మీరేమనుకున్నా - నిష్కామప్రేమ ఉన్నది - ఇప్పుడే దాన్ని చూశానుకూడా. ఆమాటకొస్తే మగవాడు అగ్నిలాటివాడు. అందులో ఏమివేసినా దగ్ధం అయిపోతుంది. మంచీ చెడూ - నీతీ అవినీతీ - ప్రేమా వాంఛా - అన్నీ అందులో మండిపోతాయి - కాని అభాగ్యురాలైన ఆడది అలాకాదు డాక్టర్! - సిగరెట్‌లాటిది స్త్రీ. ఒక్కసారి వెలిగిస్తే చాలు; పురుషుడు పారవేసేదాకా అతని పెదవుల్ని అంటిపెట్టుకుని ఉంటుంది. తన వేడితో అతని అధరాన్ని అందుకుందామని వ్యర్థప్రయత్నం చేస్తూనేఉంటుంది - మగవాడు మాత్రం దాని ఆయువుపీల్చటమేగాని ఎన్నడూ తన అధరాన్ని స్పృశించనీయడు - అతని సుఖంకోసం తను దగ్ధమయిపోయిన సిగరెట్‌ని పారేసినట్లే స్త్రీని పారేస్తాడు మగవాడు".

"రామ రామ అరుణాదేవిగారూ! మగవాళ్ళని జాస్తిగా తిట్టకండి మరి - నామటుకునాకు ప్రతి సిగరెట్ స్పర్శకి వేయండే వదలదు ... ఒకవేళ అది మరిచిపోయినా

నేనయినా జ్ఞాపకం చేస్తాను" అని నవ్వుతూ జవా బిచ్చాడు శాస్త్రి. ఇంతలో కాత్యాయని వచ్చి,

"డాక్టర్! నీలాదేవిగారు ఎంతచెప్పినా వినకుండా ఏడుస్తున్నారు - మందు తాగరట" అని ఫిర్యాదు చేసింది.

"ఎందుకని? ఏమన్నా బాధగా ఉందా?" అని ప్రశ్నించాడు శాస్త్రి.

"ఆ బాధ మీా కర్థంకాదు డాక్టర్! అది అంతే" అన్నది అరుణ అదోమాదిరిగా చూస్తూ. ఆ సమాధానానికి శాస్త్రి ఆశ్చర్యపోయినాడు.

"ఏమిటో నా కర్థంకావడం లేదు" అని ఆమెకు సమాధానంచెప్పి కాత్యాయనివెంట నీలాదేవి బెడ్ దగ్గరికి వెళ్ళాడు శాస్త్రి.-ఆమె బోర్లపడుకుని ఏడుస్తున్నది -ఇందాక చాటునించి విన్న ఆమెకథ జ్ఞాపకంవచ్చింది. ఆమెకు కావ ల్సింది రవంతసానుభూతీ ప్రేమా - అంతమాత్రమే అయితే అవి ఇవ్వచ్చును. రెండు ఊపిరితిత్తులూ చిల్లులుపడిన ఈమె ప్రేమవల్ల జీవిస్తే వైద్యప్రపంచంలో అదో మానవప్రక్రియ అవుతుంది - శాస్త్రి ప్రేమ నటించటం ప్రారంభించాడు.

"చూడండి! అలా ఏడిస్తేటెంపరేచరు ఎక్కువ అవు తుంది - మీాకేం కావాలిచెప్పండి. నామాటవిని ఏడుపు మానేయండి. ఇప్పుడే కొంచం తగ్గుముఖంలో ఉంది" అన్నాడు. నీల మండిపడిపోతూ,

"తగ్గకపోతే పోనీలెండి. తగ్గి ఉద్ధరించేందుకు ఎవరూ లేరు నాకు" అన్నది. శాస్త్రి తనలో తనే నవ్వుకొని,

"మీరలా అంటే ఏం బాగుంటుంది. ఇంజనీరుగారు రోజూ ఒక ఉత్తరం వ్రాస్తున్నారు నాకు - ఆయన ఆదుర్దా చూస్తుంటే సర్వశక్తులూ ధారపోసి మీకు నయంచేద్దామని ఉంది - మీరేమో ఇలా అంటారు" అన్నాడు.

"అందుకని మీరు నన్ను ఓదార్చటానికి వచ్చారా? ఇన్నాళ్ళూ లేని ఓదార్పు ఈనాడు నాకు అనవసరం. నాకు అవసరమైంది చావు" అని విసుగ్గా అంది నీల.

"ఇన్నాళ్ళనుంచీ మీరు ఏడవటం ఏలా ఓదార్చటం- ఏడిచే వాళ్ళని ఓదార్చలేనటువంటి శిలనికాను నేను-అసలు మీరు వచ్చినదగ్గరనుంచీ బాధపడుతూనే ఉన్నారు-మీకేం బాధో మీరు చెప్పరు- మమ్మల్ని అర్థం చేసుకోనియ్యరు - మిమ్మల్ని బ్రతికించాలని పాట్లుపడే డాక్టర్లమీద కొంచం కూడా సానుభూతి లేదు మీకు"

"నన్ను బ్రతికించి ఆ ఇంజనీరుగారిచేత నా గుండెల్ని కూడా పగలకొట్టించాలని మీకు సరదాగా ఉంది. అలాగే చేయండి. నా పీడా వదిలిపోతుంది. నన్ను సుఖంగా చావ నిమ్మని మీ కాళ్ళుపట్టుకుంటాను డాక్టర్! క్షమించి నన్ను వదిలివేయండి"

"అలాకాదు నీలాదేవిగారూ! మీకేం కావాలో చెప్పండి. డాక్టరగా నా చేతనయిన సహాయం చేస్తాను- ఏం చేస్తే మీ మనసుకి శాంతికలిగి ఆరోగ్యంగా ఉంటారో ఆ పని చేస్తాను చెప్పండి - ఇలా బాధపడితే ఆటే ప్రయోజనం లేదు" అన్నాడు శాస్త్రి. నీల కళ్ళుతుడుచుకుని శాస్త్రివంక చూసింది. ఆమెను భ్రమలో ఉంచుతున్నందుకు తనని తను

నందించుకోవాలో తిట్టుకోవాలో అర్థంకాలేదు శాస్త్రికి. కుర్చీ లాక్కుని తీరికగా కూర్చుని 'ఇక చెప్పండి' అన్నాడు.

"నాకు కావాల్సింది హృదయం డాక్టర్!-అది మీరు నావంటి కులటకి ఇయ్యలేరు - అది మీకు సాధ్యంకాదు.- నాకు కావాల్సింది నన్ను ప్రేమించే మనసు. నాకోసం కన్నీరు పెట్టగలిగిన హృదయం-కాని నాలాటి పతితకి తమ అమూల్య హృదయం అర్పించి సంతోషపెట్టగలిగేదెవరు? నాకోసం ధైర్యంగా హృదయపూర్వకంగా కన్నీరుకార్చగలిగిన త్యాగి ఎవరు? నాకు కావాల్సింది డబ్బుకాదు డాక్టర్! సుఖం కూడా కాదేమో; సౌందర్యాన్ని ప్రేమించేవాళ్ళు నన్ను ప్రేమించారు. కాని నన్ను నన్నుగా ప్రేమించే వాళ్లు కావాలి నాకు. చావబోతున్ననాకు చివరిసారిగా నా శవాన్ని చూసి కన్నీరు కార్చగలిగిన కన్నులు కావాలి - మీరు ఇవ్వ గలరా డాక్టర్!" అన్నది నీల. శాస్త్రికి దిక్కు తోచ లేదు. కొంచెం ఆలోచించి;

"చాలా కష్టం. అయినా ప్రయత్నిస్తాను. ఉద్రేకాల ఊబిలో ఇరుక్కుపోయిన మీ హృదయం తన సంగతిని ఎవ రికీ తెలియనీయదు. అయినా...."

"అయినా? ... ... ... నేను కులటనని మీ స్నేహితుల ద్వారా విని ఉంటారు - అవునాటే మీరు వినకపోతే ఈపా టికి నా పాదాక్రాంతులయ్యేవారు ... మీరేమీ ఏకపత్నీవ్ర తులు కారు - అయినా నన్ను అసహ్యించుకొంటున్నారు" అన్నది నీల.

"నేను ఏకపత్నీవ్రతుడిని కాదని ఎలా అనుకొంటు న్నారు?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శాస్త్రి

"అందరూ అనుకుంటున్నారు" అని నిర్భయంగా సమాధానం ఇచ్చింది నీల.

ఈమెకి మాట్లాడటం రానట్లుంది అనుకున్నాడు శాస్త్రి. సమాధానం చెప్పకుండా అక్కడినుంచే వెళ్ళిపోయి నాడు.

ఆరాత్రి అతను చాలాసేపు నిద్రపోలేదు. రకరకాల మనస్తత్వాలుగల ఈ అమ్మాయిలంతా ఎవరు! వీళ్ళందరూ తలుపులులేని తన జీవనప్రాంగణంలోకి ఎలా ప్రవేశించ గలుగుతున్నారు? ప్రేమంటే నమ్మకంలేని తనని ఇంతమంది ఎలా ప్రేమిస్తున్నారు? వీళ్ళందరికీ ఏం కావాలి?

ఇన్ని పుష్పాలు విచ్చిన ఈ జీవనగుచ్ఛంలో చివరికి ఏ పుష్ప రాలిపోకుండా నిలుస్తుంది? ఏదీ నిలువదు. చివరికి తొడిమమాత్రమే మిగులుతుంది. లాపుస్తకంపక్కన పెట్టుకుని నిద్రిస్తున్న రమణమూర్తిముఖంవంక చూశాడు శాస్త్రి.

"పీడకలలు కంటున్నావా తమ్ముడూ! జీవితం సుందర స్వప్నం కాదయ్యా" అని తనలో తనే నవ్వుకొని సిగరెట్ వెలిగించి ఆరుబయటకి వచ్చాడు శాస్త్రి. మంచు కురుస్తోంది. వెన్నెలలో స్నానంచేసి తల ఆరబెట్టుకుంటున్నది లోకం. ఎక్కడో చదివిన ఈ వాక్యం జ్ఞాపకంవచ్చింది శాస్త్రికి. ఆ వెన్నెల వారిజ నవ్వులాగా ఉంది. కాత్యాయని కన్నులలాగా, నీల ఏడుపులాగాఉంది. వెంటనే ఇందిర జ్ఞాపకం వచ్చింది.

ఇందిర తన మేనమామకూతురు. తనని తప్ప ఎవరినీ పెళ్ళిచేసుకోనని పట్టుపడితే వాళ్ళనాన్న గోదావరిఅవతల ఒక పల్లెటూళ్లో ఇందిరను ఖైదుచేశాడు. అప్పుడు ఇందిర తనకి ఉత్తరంవ్రాసింది. తను ఆ రాత్రికి రాత్రి వరదగోదావరిని చిన్నపడవలో దాటి ఇందిరని చేరుకున్నాడు. కాని తనేం చేశాడు? తనలో తనే నవ్వుకున్నాడు శాస్త్రి. తను పెళ్ళిచేసుకోనని చెప్పాడు. అది చెప్పటానికే వరదగోదావరిని దాటాడా! కాదు. ఇందిరంటే తనకి అభిమానం లేకపోలేదు- ప్రేమ అంటే అదేనా!

ఆరిపోయిన సిగరెట్ తిరిగి వెలిగించి చంద్రుడివంక చూశాడు శాస్త్రి. అందులోంచి ఇందిర నవ్వింది.

అప్పటికి తనూ చిన్నవాడు. గోదావరి దాటట ఎడ్వెంచర్ కోసమేగాని ఇందిరకోసం కాదేమో! తీరా వెళ్ళి - ఇందిరని పెళ్ళిచేసుకునే అర్హత తనకి లేదని చెప్పాడు. ఆ మాటకి ఇందిర బాధపడ్డా - మేనమామ సంతోషించాడు.

ఆ తరువాత తన మేనత్త ఇందిరనీ తననీ గురించి ప్రచారం ప్రారంభించింది. ఒకతడవ ఇందిరనీ తననీ ఒక బంధువులింట్లో సమావేశపరచి - వీళ్ళు మాజీప్రేమికులు. మీరు గుర్తించారో లేదో - అన్నట్టు చేసింది. ఇప్పుడు ఇందిర ఇద్దరు పిల్లలతల్లి అయింది. కాని తనని మర్చిపోలేదు- తను మాత్రం యింకా వ్యూహంలోనే ఉన్నాడు.

స్త్రీని ఆరాధించటం అలవాటయినతరువాత ప్రేమించటం కష్టం - ప్రేమించటం ప్రారంభించిన తరువాత

కామించటం అసంభవం. "కామ విహీనమైన జగం పరిమళ విహీనమైన పుష్పం" - ఎలా చావటం ?

నవ్వుకుని ఆరిపోతున్న సిగరెట్‌కి మరో కొత్తసిగరెట్ వెలిగించాడు శాస్త్రి - స్త్రీజీవితం సిగరెట్‌లాంటిదని అరుణ అన్నది - అలంకారంతో కూడిన అందమైన వాక్యం.

అలంకారంతో ఉన్న అమ్మాయిలలాగానే అలంకారంతో కూడిన వాక్యాలుకూడా ఆకర్షణీయంగా ఉంటాయి. కొడిగట్టిన సిగరెట్‌నుసిని వేళ్ళతో రాల్చాడు శాస్త్రి

వృత్తిరీత్యా అతను రకరకాల వ్యక్తులను చూస్తూ ఉంటాడు. నీచులు - గొప్పవాళ్ళు- సంస్కారవిహీనులు - ఉన్నత సంస్కారులు - దొంగలు - ఖూనీకోర్లు ఇంకాఇంకా ంతమందినో-కాని కొంతమంది మాత్రమే అతనికి జ్ఞాపకం ఉన్నారు.

శారీరికంగా వాళ్ళు పడే బాధ - వేసే వెర్రికేకలూ - తిట్లూతిట్లూ ఇవన్నీ అతనికి అలవాటయినాయి. న్యాయంగా తను ఉన్న ఈ స్థితిలో వాటినిచూసి తను చలించకూడదు_ అయినా తను చలిస్తూనే ఉన్నాడు - నీల ప్రేమపిపాసతో బాధపడుతున్నది. ఆ బాధ ఉన్నంతకాలం ఆమెకు వ్యాధి తగ్గదు - ఆమె పిపాసానివృత్తికోసం తను ఆమెతో ప్రేమ నటించటానికి నిశ్చయించుకున్నాడు.

శాస్త్రి మళ్ళీ సిగరెట్‌నుసినిరాల్చి తనలో తను నవ్వుకున్నాడు. తన ప్రేమ నటనకానిది ఎక్కడ ? ఆమాట కొస్తే తనకి ప్రేమఅంటే నమ్మకమే లేదు. స్త్రీని తను ఆకగా

ధించకలడు. గాని ఆత్మార్పణ చేయలేడు - బహుశా ఆ కారణం చేతనే తనని ఇంతమంది స్త్రీలు ప్రేమిస్తున్నారేమో.

ఎక్కడనుంచో గడియారం రెండుకొట్టింది. - కాలం ఎవరికోసమయినా ఒక్క-క్షణం ఆగితే ఏమవుతుంది ?

కాలం ఆగినక్షణాలు కొన్ని తనకూ తెలుసు - మనిషి కోసం అప్పుడప్పుడు కాలం ఒక క్షణం ఆగిపోతుంది. కాని మనిషిమాత్రం ఆ కాలాన్ని గట్టిగా కౌగలించేసుకొని ఇక బయలుదేరకు అంటాడు. గతిలేక ప్రేమనటిస్తున్న స్త్రీలాగా అతనికౌగిలింలోంచి ఒడుపుగా తప్పించుకొన్న కాలం అతనికి మెలకువవచ్చేసరికి అయిదు మన్వంతరాల దూరం పారి పోతుంది.

తరాలు గడుస్తయి - మరోమానవుడు కాలాన్ని కౌగలించుకొందామని తలుపుచాటున నిలబడతాడు - కాలం మళ్ళీ తప్పించుకుంటున్నది- భూమిపుట్టిన ఇన్నికోట్ల సంవత్స రాలనుంచీ నడుస్తున్న చరిత్రే ఇది. శాస్త్రి తలఎత్తి ఆకా శంవంక చూశాడు - అగోచరమైన తెరని ఎవరో తొలగిస్తు న్నట్లూ - మనిషి ఏనాటికీ తెలుసుకోలేని మహారహస్యం తాలూకు నీడ లీలగా కనిపిస్తున్నట్లూ అనిపించిందతనికి. శాస్త్రి ఆస్తికుడు. "Thou hast made me endless, such is thy pleasure" అనుకున్నాడు అతను. ఠాగూరు కాళిదాసు, క్లియోపాట్రా చంఘిజ్ ఖాన్, తాన్ సేన్, ఎక్క- డున్నారు వీళ్లు? ఏమైపోయినారు! శాస్త్రి నవ్వుకున్నాడు.

"Thou hast made me endless" అంటే-వాళ్ళం దరూ తనలో ఉన్నారు-భూతం వర్తమానంలో ఉంది. వర్త

మానం భవిష్యత్తులో ఇమిడిపోతుంది. భవిష్యత్తు భూతంకింద కరిగిపోతుంది. మానవుడు తన వీణని శృతిచేస్తూనే ఉంటాడు. ఆదెప్పటికీ పూర్తి కాదు-అతనిగానం ఎవరువింటారో కూడా తెలియదు.

దూరాన ఎవరో రోడ్డుమీద నడిచివెళుతున్నారు. శాస్త్రి మరో సిగరెట్ వెలిగించాడు.

Have you not heard His silent steps,

He comes, comes, ever comes - అనుకుని లోపలికి వెళ్ళిపోయాడు-తెల్లవారుజామున లేచిన రమణమూర్తి అన్నగారు గీతాంజలి చదవటంచూసి ఆశ్చర్యపోయి అడిగాడు:

"తెల్లవారవస్తోంది. నిద్రపోలే దేమిటిరా?" అని - శాస్త్రినవ్వి" "నిద్ర రాలేదు"అని తేలిగ్గా సమాధానం ఇచ్చి పుస్తకం మూసేసి లైటు తీసేశాడు. కొన్నిక్షణాలయినతరువాత 'రమణా' అన్న అతనిపిలుపు విని రమణమూర్తి లేచి వచ్చి తిరిగి లైటువేసి అన్నగారిమంచంమీద కూర్చొని "ఏమిటిరా?" అన్నాడు.

"తమ్ముడూ! నీకో కథ చెప్పాలనిపిస్తోంది వింటావా?" అన్నాడు శాస్త్రి.

"చెప్పు నీ కలవాటేగా?"

"ప్రేమ అంటే ఏమిటిరా?"

"అది నాకన్న నీకు బాగా తెలుస్తుంది" అని నవ్వాడు రమణమూర్తి.

"ఆ సిగరెట్ పెట్టె ఇలా అందుకో - నా ఉద్దేశ్యం ప్రేమ అనేది లేదని" అని సిగరెట్ ముట్టించాడు శాస్త్రి.

"నా ఉద్దేశ్యం ప్రేమతప్ప మరేమీలేదని" అని నవ్వాడు రమణమూర్తి.

"కథలు జీవితాన్ని మెరుగుదిద్దుతాయి - మనసులో మహాసౌందర్యాన్ని రూపుకట్టించుకోవాలంటే కొన్నికథల్ని వినాలి - మరికొన్ని చరిత్రల్ని ఒంటపట్టించుకోవాలి. కాని తమ్ముడూ! కథల్నిమాత్రం నిజంచెయ్యాలని ప్రయత్నించకు - ఒకవేళ నిజమే కథ అయితే ఆ నిజాన్ని చెప్పటానికి సిగ్గుపడకు" అన్నాడు శాస్త్రి మహావేదాంతిలాగా. రమణమూర్తి మాట్లాడలేదు.

"ఈరోజు నాతో ఒక స్త్రీ - స్త్రీజీవితం సిగరెట్ లాటిది - అనిచెప్పింది. అందులో ఉండే సత్యాన్ని అర్థం చేసుకోవాలని రాత్రినించీ ప్రయత్నిస్తున్నాను. రకరకాల జీవితాల్ని, రకరకాలకథల్ని జ్ఞాపకం తెచ్చుకున్నాను - అందులో ఒకకథ నీకిప్పుడు చెపుతాను" అని రమణమూర్తి చెయ్యి తనచేతిలోకి తీసుకున్నాడు శాస్త్రి.

అన్నగారు ఎంతో ఎత్తుకు ఎదిగిపోయి అక్కడినించి కిందిలోకాన్ని పరీక్షిస్తూ - ప్రత్యక్షవ్యాఖ్యానం చేస్తున్న పరమపురుషుడులాగా కనిపించాడు రమణమూర్తికి.

"ఈకథ వారిజకి చెపుదామనుకున్నాను. గాని - ఇదివరకే ప్రేమంటే ఆమెకి ఉన్న పిచ్చినమ్మకం మరింత బలపడుతుందేమో అని భయంవేసి చెప్పటం మానేశాను" అని బల్లమీద సిగరెట్ టిన్ అందుకున్నాడు శాస్త్రి.

"నీ సిద్ధాంతాలు నీవి- కానీ"అన్నాడు రమణమూర్తి.

శాస్త్రి చెప్పటం ప్రారంభించాడు.

"నేను కిందటితడవ ఊరికి వెళ్ళానుచూడు - అప్పుడు రైల్లో ఒకమ్మాయిని చూశాను - అంతవరదాకా స్వప్నమైందో ఆ అమ్మాయి మొలిచినట్లు కిటికీదగ్గర తయారయేసరికి ఆశ్చర్య పోయినాను - ఆ సెకండుక్లాస్ కంపార్టుమెంటులో నేనూ ఆ అమ్మాయీ మరో నిద్రపోతున్న ముసిలాయనా తప్ప మరెవరూ లేరు.

కిటికీదగ్గర కూర్చునిబయటకు చూస్తున్న ఆమె కన్నులలో నీళ్ళు ఉన్నయ్యి - పెదవులు నవ్వుతున్నయ్యి. చేతిలో ఉన్న ఉత్తరాన్ని చింపి ముక్కలు ముక్కలు చేస్తున్నది. పరధ్యానంగా కాలి బొటనవేలితో రైలుని నొక్కిపట్టిన విధానం చూస్తే ఆ రైలు నడవటం ఆమెకి ఇష్టం లేదనుకుంటాను - జీవితంతో యుద్ధం చేసిచేసీ అలసిపోయిన దురదృష్ట వంతురాలి లాగా ఉన్నది ఆ యువతి. పరస్పర విరుద్ధమైన ఆమె భావ ప్రకర్షణ అత్యద్భుతంగా ఉన్నది.ఎవరాయువతి - ఆమె పక్కన ఇలస్ట్రేటెడ్ వీక్లీ మీద బొమ్మలాగే చిత్రంగా ఉంది - అతి విచిత్రంగానే మోకూడా.

ఆమెకళ్ళల్లో అనంతాంబరపు నీలి నీడలు కలవు అన్న కృష్ణశాస్త్రి గీతంలాగా అతిలోక సుందరంగా ఉన్న ఆమెను మాట్లాడించాలి - ఆమె హృదయంలో ఏమున్నదో వెతకాలి - నాకు ఒక గర్వమున్నది తమ్ముడూ నే నందరినీ చదవగలనని" అని ఆగాడు శాస్త్రి.

రమణమూర్తి తలెత్తిచూసి "కథకానీ మరి" అన్నాడు శాస్త్రి చెప్పటం ఆరంభించాడు:

"ఆమె చింపుతున్న ఉత్తరం చింపటానికి చేతికి రానంత చిన్న ముక్కలయినాక - నావంక చూసింది.

ఆమె అందగత్తె - అసలు అందగత్తె కానిదే కథ ఉండదో - మరి అందమైన వాళ్ళే కథానాయికలుగా ఉంటారో! లేక కథల్లోనే అందమైనవాళ్ళు సృష్టింపబడతారో తెలియదు - ఎలాఅయినా అందానికీ చరిత్రకీ అవినాభావ సంబంధం ఉన్నది. అందరు కథానాయికల లాగానే ఈమె కూడా అందగత్తె. ఆమె అయిదారుసార్లు నావంక చూసింది. ఏదో గుర్తుతెచ్చుకోటానికి ప్రయత్నిస్తున్నట్లుగా చురుగ్గా చూసింది. చివరికి నామీద చూపు నిలిపింది. నేను నవ్వాను."

"ఉద్ధరించావు నువ్వు ఉపయోగించే ట్రిక్ అదేగా" అని నవ్వాడు రమణమూర్తి.

"ఆవిషయంలో నన్ను గురించి లోకానికీ నీకూ సదభిప్రాయం ఏర్పడదని నాకు తెలుసు... సరే కథ విను.

ఆమె కూడా నవ్వుతూ 'మీపేరు సత్యనారాయణ శాస్త్రికదూ!' అన్నది - ఇదేమిటి ఉరమని పిడుగు. "అవును మీకెట్లా తెలుసు?" అని ప్రశ్నించాను. ఆమెనవ్వి 'మీపెట్టె మీద తాటికాయలంత అక్షరాలతో వ్రాసిఉంది' అన్నది. నేను సిగ్గుపడి క్షమించండి అది మా నౌకరు చేసినపని అని సంజాయిషీ చెప్పుకున్నాను.

"సంజాయిషీ అక్కరలేదు లెండి - మీకు కథలు వ్రాయటం చేతనవునా?" అని సందర్భంలేని మరో ప్రశ్న

వేసింది ఆమె. వ్రాయలేను అని చెప్పటానికి సిగ్గుపడి మాట్లాడకుండా ఊరుకున్నాను.

ఆమె నిట్టూర్చి "మానవుడు తన జీవితంలో జరిగిన విషాద ఘట్టాన్నో! మధురానుభవాన్నో! కధగా వ్రాసుకుని మళ్ళీ మళ్ళీ చదువుకోటంలో మహత్తరమైన ఆనందాన్ని అనుభవిస్తాడు - అయితే అనుభవించే వాళ్ళు కధలు వ్రాయ లేరు - కధలు వ్రాసే వాళ్ళకి అనుభవాలుండవు - అందుకే ఒకరి అనుభవాన్ని మరొకరు కధగా వ్రాస్తే - అదే అనుభ వాన్ని తనదిగా భావించి ఇంకొకరు చదివి ఆనందిస్తారు" అన్నది.

నా కళ్లు ఆమె పేరు తెలుసుకుందామని ఇలస్ట్రేటెడ్ వీక్లీ మీద వెదుకుతున్నాయి. అది గ్రహించింది. ఆమె "నేను పుస్తకాలమీద పేరు వ్రాసుకోను" అని నవ్వింది.

"అయితే మీ పేరేమిటో చెప్పండి!" అని సూటిగా అడిగాను.

"పేరేనా? నా కధ వద్దా?" అని నవ్వుతూ అన్నది.

"తప్పకుండా కావాలి - చెప్పండి వింటాను" అని సిగరెట్ వెలిగించాను-రమేశా ఇకనించి జాగ్రత్తగా వినాలిరా నువ్వు" అని కొంచంసేపు ఆగి తిరిగి చెప్పటం ప్రారంభిం చాడు శాస్త్రి:

"ఏదో మామూలు అబ్బాయీ అమ్మాయీల తాలూకు ప్రేమగాధ వింటాననుకున్నాను. అందుకు సిద్ధంగా కూడా ఉన్నాను."

"ఆమె అజాద్ హిందుఫౌజులో పనిచేసిందిట......
ఉంది. ఆమె మాటల్లోనే కథచెప్పేస్తాను... కాలమూ రైలూ జంటగా పరిగెడుతున్న ఆ అర్ధరాత్రిపూట మరో దుఃఖిత నాముందు తన హృదయపేటిక మూత తెరిచివేసింది. ఆమె చెప్పినకథ నాకింకా గుర్తుఉంది - ఆమె తననిగురించి కథ వ్రాయమంది నేను వ్రాయలేను కనుక నీకు చెపుతున్నాను. నీవు వ్రాయగలిగితే సంతోషం. ఇక విను" అని శాస్త్రి ఆమె మాటల్లోనే కథ చెప్పటం ప్రారంభించాడు.

"అజాద్ హింద్‌ఫౌజులో నేను చేరింది కేవలం దేశభక్తివల్ల కాదు - కేవలం పట్టుదలకోసం అందులో పని చేశాను. పట్టుదలతో జీవితం నాశనం చేసుకున్నానేమో కూడా. మాది కృష్ణాజిల్లా. తల్లీ తండ్రీ గారాబంగా చూడటంవల్లనో, మరెందుచేతో నాకు పట్టుదల చాలా ఎక్కువగా ఉండేది. చదువుకుంటే చెడిపోతారేమో అనే అభిప్రాయం పల్లెటూరి వాళ్ళయినా-ఎంచేతో మావాళ్ళకు లేదు. ఇప్పుడు నాకనిపిస్తుంది ఉంటేనే బాగుండేదేమో. అని. సరే వినండి.

నేనూ - మా మామా మద్రాసులో ట్రిప్లికేన్‌లో ఒకఇల్లు తీసుకొని చదువు ప్రారంభించాం. అతను బి. ఏ. నేను ఇంటరు - మా చదువుకి మద్రాసుతప్ప ఆంధ్రలో ఏ కాలేజీ పనికిరాకపోవటానికి కారణం మేము డబ్బుకలవాళ్ళం కావటం.

మా మామ అంటే అమ్మతమ్ముడు. పుట్టుతూనే అతని భార్యగా పుట్టానని నిశ్చయించారు. నేనూ అలాగే ప్రవ

ర్తించేవాడు. నాకుమాత్రం అతనంటే ఎంత ఇష్టమున్నా గాని అతని ఈ ప్రవర్తనమాత్రం నచ్చేది కాదు – అతను చాలా బావుండేవాడు. మాతో ముసలమ్మ వండిపెడుతూ ఉండేది. మేమిద్దరం ఎలాగూ ఇకముందు భార్యాభర్తలమే కనుక ఎలా ప్రవర్తించినా ఫరవా లేదన్నట్లు చూసీ చూడకుండా పోయేది ఆవిడ.

నేను చిత్రమైన మనస్తత్వం కలదాన్ని. మా మామయ్య అధికారం నాకు నచ్చేదికాదు. అసలు అతని అధికారం చేసినా చేయకపోయినా చేసినట్టు కనపడే దను కుంటాను. మధ్యలో మరోవ్యక్తి తటస్థించకపోతే మామ య్యని పెళ్ళిచేసుకొని పిల్లల తల్లినై సుఖంగా జీవయాత్ర చేస్తూ ఉండేదాన్ని. అందరి జీవితాల్లాగానే నా జీవితం కూడా వర్థించిన విస్తరిలాగానే ఉండేది. కాని ఆగీత నా మొగాన లేదు.

ఒకరోజు మెరీనాలో ఒకవ్యక్తితో పరిచయం అయింది. ఆగింది ... ఆమె ... నేను నవ్వాను ... వెంటనే ప్రేమించాననుకుంటున్నారుకదూ అని నవ్వి కథ తిరిగీ చెప్పింది ఆమె.

అతనికి ఏభయిసంవత్సరాలుఉంటయ్యి. అయినాఅన్ని పళ్ళు ఉన్నట్లకనిపించదు. చాలాసేపు మాట్లాడిన తరువాత ఆయన చాలా చదువూ సంస్కారం హోదా ఉన్నవ్యక్తి అని తెలుసుకున్నాను.

అన్నిటికన్న ముఖ్యమైనది అతని నవ్వు. చిరునవ్వు నవ్వుతూ సంగీతంలా మాట్లాడాడు ఆయన. అతనితో స్నేహం

అనతికాలంలోనే అభివృద్ధి అయింది. తరువాత కొన్నాళ్ళకి ఆయన తాగుతాడనీ ఆవయసులోకూడా ఆడపిల్లల గొడవలు వదులుకోలేకనీ తెలుసుకున్నాను. అలా తెలుసుకున్న తరువాత అతనంటే మరింత ఇష్టపడటం ప్రారంభించాను. ఇంకొంచెం సేపు అతనితో గడుపుతున్నాను ఇలా రెండు మూడు నెలలు గడిచిపోయినయి. ఇంట్లో మామయ్యకి జెలసీ ఎక్కువ అవుతోంది. ఒకరోజు ఈ విషయం మీదనే పెద్ద తగూ అయింది. ఇంటికి ఉత్తరం వ్రాస్తానని బెదిరించాడు. వ్రాసుకో పొమ్మన్నాను.

నీకెందుకింత నిర్దయ? అంటూ రెండు చేతులతో మొహం కప్పుకుని ఏడ్చాడు. మామయ్య ఏడ్చిన కొద్దీ నేను రాయిలా బిగుసుకు పోతున్నాను. ఇన్నాళ్ళూ తెలుస్తుందేమోననుకున్నది కాస్తా తెలిసిపోవటంతో నాకు ఉన్న భయం కాస్తా పోయింది.

ఆయనని నిర్భయంగా కలుసుకుంటున్నాను. ఆయన వ్యక్తిగత జీవితం తెలుసుకోవాలని నాకు ఏమాత్రం కోరిక లేక పోయినా నా స్నేహితులు చెప్పినదాన్నిబట్టి ఆతనికి ఆస్తి ఉన్నదనీ, అతని కొడుకు ఎక్కడో చదువుకొంటున్నాడనీ మాత్రం తెలిసింది నిజం చెప్పాలంటే మొదట్లో ఆయనంటే గౌరవం తప్పమరో ఊహ నాలో లేదనే చెప్పాలి.

మామయ్య ఆవిధంగా అవమానించి పోట్లాడినప్పటి నుంచీ దానంతటికదే ఆ దృష్టి వచ్చింది. తరువాత ఇంకో విషయం. నాలో ఎంత ఆకర్షణ ఉన్నా నిర్వికారంగా గంటలతరబడి మాట్లాడ గలిగేవాడు ఆయన. అది చూసి

ఆయన్ని కవ్వించాలనుకున్నాను. అది నా స్త్రీత్వపు అహంకారం.

ఆయనకి ఏభయి ఏళ్లు. నాకన్న ముప్పయిరెండు సంవత్సరాలు పెద్దవాడు. అందంకూడా పెద్దగా లేదు. కాకపోతే వయసుఉన్నది కనుక అనుభవశాలీ తెలివిగలవాడూ కావచ్చును. అయితే అతని చక్కని వాగ్ధోరణీ - విస్పష్టమైన ఉచ్చారణా - అందమైన చిరునవ్వూ నన్ను లొంగ తీసుకున్నయ్.

అతనికి అంత మంచి పేరుకూడా లేదు ... ...ఒకరోజు మామయ్య కోపగించి ఇంటికిరాలేదు. నేనూ కొంచం జ్వరం తగిలి బీచికి పోలేను. ఎందుకురాలేదో కనుక్కు పోవటానికి ఆయనే మా ఇంటికి వచ్చారు.

మా చదువుల గదికీ వంట ఇంటికీ కొంచందూరం, ముసలమ్మ ఆ సంబంధం లేని వంటఇంట్లో గుర్కు కొడుతోంది. దురదృష్టవశాత్తూ ఆయన ఇంట్లోకి అడుగు పెట్టగానే బ్రహ్మాండమైన వర్షం ప్రారంభమయింది.

ఆ వాతావరణంలో - నాకన్న ముప్పయిరెండు సంవత్సరాలు వయసుండి నా తండ్రి కాదగిన ఆయనకి - మనసుతోపాటు శరీరం కూడా హృదయపూర్వకంగా అప్పగించేశాను.

కొన్ని నెలలు గడిచేసరికి మమ్మల్ని గురించి ఊళ్ళో రకరకాల కబుర్లు బయులు దేరినాయి. మామయ్య నాతో మాట్లాడటంలేదు. బంగారంలాటి మేనమామఉండగా ఈ ముసలాయన [illegible] ఏమిటి!! అది నా [illegible]

విమర్శించటం ప్రారంభించారు. ఇదేం దుర్బుద్ధి అని కొంతమంది ప్రశ్నించారు. అదే తెలుసుకో గలిగితే జీవితమే అర్థమయి పోతుంది.

ఆయనలేకుండా ఒక్క రోజుకూడా బ్రతుకలేని పరిస్థితి వచ్చింది. పరీక్షలేమో అయిపోతున్నాయి - సెలవలకి ఇంటికి పోకతప్పదు. ఎలా బ్రతకటం! ఇంటికి వెడితే మామ నాకథ చెప్పకుండా ఉంటాడా?

ఈ సందిగ్ధస్థితిలో ఒకరోజు హటాత్తుగా అజాద్ హింద్ ఫౌజ్‌లో చేరబోతున్నాను అన్నారు ఆయన. నేను ఏమాత్రం ఆలోచించకుండా నేనూ వచ్చేస్తా నన్నాను. వెళ్ళకపోతే బ్రతుకలేను - వెళ్ళి చచ్చినా మేలే.

తల్లిదండ్రులీన్ని, ప్రేమించి పిచ్చివాడయిన మామయ్యనీ, అరవయివేల రూపాయల ఆస్తినీ తృణప్రాయంగా విసర్జించి ఏ ఆధారమూ హామీ లేకుండా ఆయన వెంబడి వెళ్ళి పోయినాను.

కెప్టెన్‌లక్ష్మి దళంలో పనిచేస్తున్న ఆ రోజులు నా జీవితంలో ఏనాటికీ మర్చి పోలేను. ప్రొద్దున్నే చా తాగి డ్రిల్లు చేసేవాళ్ళం. పన్నెండు అయేసరికి రెండు పరోటాలూ ఉడకపెట్టిన బటానీగింజలూ ఇచ్చేవాళ్ళు. రెండు గంటల దాకా చదువు - మూడూ మూడున్నరకి మళ్ళీ లస్సీ. లస్సీ అంటే మజ్జిగలో పంచదార కలిసిన పానీయం. అది త్రాగి సైనికశిక్షణ పొందేవాళ్ళం.

నేతాజీ ఉపన్యాసం మమ్మల్ని ఉద్రేకంలో ముంచి వేసేది. ఆ రోజుల్లో ఆ దేశభక్తి - బ్రిటిష్ రాజ్యాంగాన్ని

కూలతో యాలనే పట్టుదలా - వీటి మధ్య ప్రేమలూ - వ్యక్తిగత సమస్యలూ చాలా అల్ప విషయాలుగా తోచేవి-నాలుగు రోజులకి ఒకసారి ఆయనను కలుసుకునే దానిని - మా మామ ఇంటిదగ్గర ఏం చెప్పాడో కాని నాన్న ఆశీర్వదిస్తూ కొయ్యిరూపాయిలు నేతాజీకి పంపాడు. నిజంగా మామయ్య నన్ను ప్రేమించాడు.

ఆ పవిత్ర దేశభక్తిలో కూడా స్త్రీ పురుష సమస్యలు లేక పోలేదు. నేతాజీ వాటికంత ప్రాధాన్యం ఇవ్వలేదు - అవి ప్రకృతి సహజమని తెలుసు ఆ మహామేధావికి. మిగతా విషయాల్లో వారికి క్రమశిక్షణా ఉత్తమసత్కారం అనిర్వచనీయాలు. ఆయన పనిచేసే ఫౌజులోనే కాకుండా మొత్తం సేనకంతటికీ ఆయనే సర్వసైన్యాధిపతి. ఆ రోజుల్లో నాలో ప్రేమకోసం - దేశంకోసం ఆదర్శయుతంగా త్యాగం చేస్తున్నాననే తృప్తి ఉండేది.

ఈ సైన్యానికంతా వంట చేయాలంటే దాదాపు నాలుగయిదు వందల మంది వంటవాళ్ళు పనిచేయాల్సి వచ్చేది. ఆ వంటవాళ్ళలో ఒక తమిళ స్త్రీ ఉండేది. ఆమెకి ఏభయి ఏళ్ళుంటయి - కెప్టెన్ లక్ష్మి దళంలో యవ్వనంతో పిటపిటలాడే వయ్యారులమధ్య ఈ వంటావిడని పోల్చటానికే వీలు లేదు.

ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే ఆ వంటావిడని ఆయన చచ్చేంత ప్రేమిస్తున్నాడనీ - దేశభక్తితో ఫౌజులో చేరలేదనీ - కేవలం ఆమె కుమారుడు ఫౌజులో చేరితే - ఏక పుత్రుడని వదలలేక ఆమెవెడితే - ఆమె ప్రేమ త్యజించలేక

ఆయనా - ఆయన్ని వదలలేక నేనూ చేరాము. కాని దేశభక్తి కాదనీ - ఆమె కుమారుడు ఒకడే దేశభక్తుడనీ నాకు తెలిసింది.

ఆవిషయం నాదగ్గర ఒప్పుకుని ఆయన దుఃఖించాడు. ఏం చేయను? మొదటి నుంచీ ఆడదాని కథ ఈ మాదిరిగానే ఉంది. నా ప్రేమ పొందగల అర్హత అతనికి చాలా తక్కువ అయినా అతన్ని. సహించాను. ఈర్ష్యనీ అసూయనీ దూరంగా నెట్టా. నిస్వార్థంగా నిండు మనసుతో ఆయనకి హృదయార్పణచేశాను. నా జీవితం ఇంకా ఉదయాచలం మీదనే ఉన్నది. ఆయన జీవితంలో సంధ్య తిరిగి పోతున్నది.

తెలిసికూడా ఆయన్ని ప్రేమించాను. అయినా నేనేం పొందగలిగాను ? చివరకి నాకేం మిగిలింది ?

సాల్వు చేయలేని పజిలుమీద విసుగుతో విదిలించిన సిరా బొట్లలాగా తయారయింది నాజీవితం. ఆ బాధ భరించలేక పోయినాను. అదిజెలసీయో - లేకపోతే నా ప్రేమకీ త్యాగానికీ విలువలేక పోయిందనే ఆవేదనో! నాకు అర్థం కాలేదు. ఆతరువాత అంతమందిలోనూ ఒంటరిదాన్నయి పోయినాను. ఆరునెల్లు యమయాతన పడ్డాను. ఆయన మాత్రం ఏమీ బాధ పడుతున్నట్లు కనిపించలేదు. ఆ తమిళస్త్రీని చూస్తే విపరీతమైన కసిగా ఉన్నా అతనిని మాత్రం అమితంగా ప్రేమిస్తూనే ఉన్నాను.

ఇంతలో నేతాజీ మాయమయి పటాలం విచ్ఛిన్నం అయిపోయింది. నాగతి నాకే అర్థం కాలేదు. ముందు

ముందు జీవితం ఎలాగడుస్తుంది? అన్న సమస్యలే - తిరిగీ ఆయనతోనే దేశానికి వచ్చేశాను. ఒకసారి ఆయన నన్ను వివాహం చేసుకుందామని ప్రయత్నించారు. కాని-ఆ తమిళ స్త్రీ చస్తానని బెదిరించటంతో మానివేశారు. అమ్మా నాన్నా రహస్యంగా చూసివెళ్ళారు. మామయ్య పెళ్ళి చేసుకున్నాడు.

"ఇలా గాలిబ్రతుకు ఈడుస్తూఉండగా నెలక్రితం ఆవిడ హృద్రోగంతో చనిపోయింది"అని ఆమె అనగానే;

"మరి పెళ్ళి చేసుకోపోయినారా? అని అడిగాను ఆమెనవ్వి;

"వియోగంభరించలేక ఆయన సన్యసించాడు.నాకంటే ఆమే అదృష్ట వంతురాలు. వెడుకూ వెడుకూ ఒక ఉత్తరంవ్రాసి పోయినారు; తనిలా వెళ్ళి పోతున్నానని. ఇదిగో మరో ఉత్తరం. ఇది పేరుపొందిన ఒక ఇంనీరుకి పర్సనల్ శెక్రిట రీగా చేర్చుకోమని సిఫార్సు ఉత్తరం. ఇందాక నేను చింపానే అదీ ఆ ఇంజనీరుదే. ఈ ఉత్తరం తెచ్చిన అమ్మా యిని పెళ్ళిచేసుకోమని" అంటూ ఆమెలేచి చెప్పులు తొడు క్కున్నది.

"పెళ్ళిపోతున్నారా? " అని అడిగాను నేను.

"అవును నాస్టేషన్ వచ్చింది- దిగిపోవాలి. అందరూ ఒకేస్టేషన్‌లో, ఎప్పుడూదిగం. కొంద రదృష్టవంతులు మాత్రమే చివరిదాకా కలిసి ప్రయాణం చేయగలుగుతారు; కొందరి జీవితాలు ఊహాలోనే గడిచి పోతాయి.

అయినా సత్యనారాయణ శాస్త్రిగారూ, జీవితాల చింపిరి తలని చిక్కుతీసి జడవెయ్యాలని చూస్తే. జుట్టే ఊడి పోతుంది. ఇంకో చిన్నసంగతి- ఆ ఇంజనీరు ఆయన కొడుకు" అన్నది ఆమె.

నేను తెప్పరిల్లేసరికే ఆమె దిగిపోయింది. రమణా ఇదిరా కథ- ఎలాఉంది!" అని మరోసిగరెట్ వెలిగించాడు శాస్త్రి. రమణమూర్తి ఒకనిట్టూర్పు విడిచి "చాలా ఆశ్చర్యంగాఉంది. ఆమె అంతపెద్ద వాడిని ప్రేమించటం, ఆయన విచిత్ర వ్యక్తి కావటం, ఆమెనే పెళ్ళిచేసుకోమని కొడుక్కు వ్రాయటం - ఆ ఉత్తరాన్ని ఈమె చింపివేయటం, చాలా తమాషాకథ. ఇంతకూ ఈకథ నువ్వు కల్పించావా; నిజంగా జరిగిందేనా?" అన్నాడు.

"ఈ చిత్రం ఇంతటితో ఆగలేదు. ప్రస్తుతం టి. బి. పేషెంటుగా ఆమె మా హాస్పటల్లోనే ఉంది"

"నిజం?"

"నిజమే - అంతేకాదు. ఆమె ప్రేమరాహిత్యమనే మానసిక వ్యాధితో బాధపడుతున్నది. నా నుంచి ప్రేమని అభ్యర్థిస్తున్నది. తమాషా ఏమిటంటే, నన్ను ఆమె గుర్తుపట్ట లేదు. ఇప్పుడావిడ పూర్తిగా మారిపోయింది. మాట మాట్లాడితే కోపం, ఏడుపు

ఇంతవరకూ నాకూ ఆమె గుర్తురాలేదు. సరిగ్గా రెండుగంటలక్రితం హఠాత్తుగా గుర్తుకొచ్చింది. వెంటనే నీకు చెప్పాను. ఇంకో తమాషా ఏమిటో తెలుసా?

ఆ ఇంజనీరు నాకు బాగా తెలుసు. అతనే తీసుకొచ్చి అక్కడ చేర్చాడు. ఏమైందో కాని అతడంటే ఈమెకి అసహ్యం. నువిడంటే అతనికి ఆరాధన. అడట్లాఉంచి ఇప్పుడు కనుక నేను ఆమెను అభిమానిస్తున్నట్లు నటించకపోతే గుండెపగిలి ప్రాణం విడుస్తుంది. పోనీ అని ప్రేమనటిస్తే హాస్పటల్ స్టాఫ్ గుసగుసలు ప్రారంభిస్తారు. ఏంచేయాలో తోచటం లేదు'' అన్నాడు శాస్త్రి.

"కావాలని ఇరుక్కుని తోచటంలేదంటే ఎలా!'' అన్నాడు రమణమూర్తి.

"నేనేం కావాలని ఇరుక్కోలేదు. ఆమె బ్రతికే ఆశ లేదు. ఒకవేళ తప్పిజారి బ్రతికితే నా సానుభూతి వల్లనే అనాలి. ఇంకో చేమిటంటే ఆమె సిగ్గుపడటం మర్చిపోయింది. ఎంతమందిలో నయినా ఏదో బయుట పడి పోతున్నది. ఈ పరిస్థితిలో మతిపోవటం తప్ప మరోమార్గాంతరంలేదు''

"వీలయినంత దూరంగాఉండు. ఎలాగూ బ్రతికే ఆశ లేనప్పుడు వదిలేయుటం మంచిది. పోనీ ఒకవేళ నీనటించ టంతో బ్రతికినా కలకాలం నటించటం నీకూ చేతకాదు. నేచెప్పినమాట వినరా అన్నయ్యా'' అన్నాడు రమణ మూర్తి.

రమణమూర్తి హితోపదేశంతో ఒకవారం రోజుల పాటు అలాగే ఉన్నాడు శాస్త్రి. నీలకి ఎలాఉన్నదీ కాత్యాయునిని అడిగి తెలుసుకుంటున్నాడు. చివరకి ఏడవనాటి పాయంత్రం హెమరేజి వచ్చిందని ఆక్సిజన్ ఇస్తున్నారనీ వార్త తెచ్చింది కాత్యాయని.

తన ఒంటరితనపు లోయలోకి తనే తొంగిచూసుకుని భయంతో బిగుసుకు పోయిన - పర్వతశిఖరంలా అయిపోయి నాడు శాస్త్రి. ఏదో నిస్పృహ, తుపానులా విరుచుకు పడు తున్నా నిరాశ అతన్ని ముంచివేసినయ్.

అతను నీల బెడ్ దగ్గరకి వెళ్ళేసరికే అంతా అయి పోయింది. ఈ మరణంలో తనభాగంఎంత? అని లెక్క వేసుకో సాగాడు అతను. డాక్టరు రామారావు శాస్త్రి భుజంమీద చెయ్యివేసి "సారీడాక్టర్......ఒకమాట. కళ్ళు మూతలు పడేవరకూ ఆ మెకోసమే చూసింది" అన్నాడు.

తనభుజంమీద ఉన్న రామారావుచెయ్యి వామనుడి పాదమై తనని పాతాళానికి తొక్కుతున్నట్లు అనిపించింది శాస్త్రికి.

"ఇందులో నా తప్పులేదు" అన్నాడు ఎలాగో పెగుల్చుకుని.

డాక్టరు రామారావు కొన్నిక్షణాలు ఊరుకుని,

"మొదట్లో మీరు ఆ రవంత ఆశకల్పించ కూడదు... కల్పించిన తరువాత చివరివరకూ అదేభ్రమలో ఉంచా ల్సింది. అయినా డాక్టర్! మనచేతిలో అన్నీ ఉన్నాయని అనుకుంటాం. ఏదీలేదని తెల్సుకునేందుకు కొన్ని అనుభ వాలు కావాలి. అలాటి అనుభవాల్లో ఇదొకటి - మీరేం బాధ పడకండి" అన్నాడు.

శాస్త్రి జీవంలేని నవ్వునవ్వి "డాక్టర్!... ఈ విషయం అలాఉంచండి......ఈమె వ్యాధికంటె గత జీవితంలో ఈమె చేసిన త్యాగం మరీ భయంకరమైనది. ఇవన్నీ కథల్లు

కాదగిన జీవితాలు. అసహ్యించుకోబడే అర్థవిహీనమైన ఈ కథల్లో మనకి నీతి ఏమీలేదు - మకుటం అసలేలేదు" అన్నాడు.

"కాని ఏదో జాలిపడదగినది ఉంటుంది - డాక్టర్! అరగంట క్రితం నేనొక పురుడుపోసి వచ్చాను. సిజేరియన్ కేసు...ఆ అమ్మాయి వంట్లో అర అవున్స నెత్తురులేదు. ఆ అమ్మాయి బ్రతుకుతుందని నేను అనుకోలేదు. కాని ఆపరేషన్ సక్సెస్ అయింది. బంగారంలాటి కొడుకు పుట్టాడు. అంత బలహీనురాలి కడుపులో వీడింత బలంగా ఎలా ఉన్నాడో తెలియదు. తల్లికడుపులోంచి వాడిని తీసి బల్ల మీదపెట్టి ఆమెకు కుట్లు వేస్తుంటే ఇల్లు ఎగిరిపోయేట్లు ఏడుపు ప్రారంభించాడు. చావు పుట్టుక ఈ రెండింటికీ అర్థం- మనం ఏనాటికీ తెలుసుకోలేం" అన్నాడు శాస్త్రి.

మనిషి జీవితానికి ప్రారంభమూ అంతమూ కూడా ఏడుపుతోనే ముడిపెట్టుకుని ఉన్నది. ఆ అమ్మాయికి నెత్తురు ఎక్కించి ఇలావచ్చాను. నీల చనిపోతోంది. చనిపోతూ ఏడుస్తున్నది... ఈ రెండు ఏడుపులకీ అనిర్వచనీయమైన ఏదో సంబంధముంది డాక్టర్! - ఈ చావు పుట్టుకల పీటముడి మనం విప్పలేనంత గట్టివి. వీటిని గురించి విచారించటం శుద్ధ పొరపాటు" అన్నాడు డాక్టర్ రామారావు.

ఆ ఇద్దరు డాక్టర్లు ఒకరిబుజాలమీద మరొకరు చేతులు వేసుకుని సుదీర్ఘమైన ఆ హాస్పటల్ వరండా నుఱుపు తిరిగారు.

*　　　*　　　*

మానవుడు ఇంత అసమర్థుడూ - ఇంత అల్పుడూనా? అనుకున్నాడు శాస్త్రి. నీల చనిపోయిన ఈ వారంరోజులనించీ అతను గదివిడిచి బయటికిరాలేదు. అతని అంతరాంతరాల్లో ఏదో అన్వేషణా - మరేదో ఆవేదన.

గడ్డం పెరిగిపోయింది. కళ్ళచుట్టూ నల్లని ఉంగరాలు ఏర్పడినయ్. తను ఆధునికుడు - నిపుణుడైన వైద్యుడు - విశాలమైన దృష్టి తనకి ఉన్నది. ఆధునిక విజ్ఞాన శాస్త్ర దృష్ట్యా తను గొప్ప జ్ఞానిఅయినా తనకు తెలియనిది ఏదో మిగిలి పోయేఉన్నది. అదేమిటి? దానికి తుదీ మొదలూ ఏది?

తనుపోయి ఈప్రశ్న మరెవరినైనా అడిగితే పకాలున విరగబడి నవ్వుతారు.

శాస్త్రి తనలో తనే నవ్వుకుని సిగిరెట్ వెలిగించాడు.

"అదేపనిగా సిగిరెట్ తాగటం అంత మంచిదికాదు డాక్టర్!"

"భలే...నువ్విప్పుడు వచ్చావు యిందిరా?"

"విజయవాడనుంచి బెంగుళూరు వెడుతూ నిన్ను చూసిపోదామనిపించింది. సామాను క్లోక్ రూములోపడేసి ఇలా వచ్చాను. తెల్లవారుఝాముదాకా బండీలేదు-సరేకాని బావా! ఏమిటీ అవతారం?"

"అన్వేషణ ఇందిరా ! అన్వేషణ - సరిగ్గా నేను అన్వేషిస్తున్న సమయంలోనే నువ్వు ప్రత్యక్షమయావు!"

"సరేబావా! డాక్టరు వయావుగా మరి పెళ్ళిచేసుకోవూ?'

"పెళ్ళి అనేది గాలివానలో పూరిగుడిసె లాటిది. లోపలివాళ్ళు బైటికి రావాలనీ బైటివాళ్ళు లోపలికి పోవాలనీ ప్రియత్నిస్తూ ఉంటారు" అని నవ్వాడు శాస్త్రి.

ఇందిర మాట్లాడలేదు.

"ఏం ఇందిరా మాట్లాడవు?"

ఇందిర నిట్టూర్చింది. పొందలేని వస్తువును అందుబాటులో చూసి అటూ ఇటూ తేల్చుకోలేని ఒక చిత్రిమైన సందిగ్ధస్తితికి చిహ్నం నిట్టూర్పు. శాస్త్రి ఆమెవేపు చెయ్యిచాచి.

"నన్ను అభిమానిస్తూన్నావా ఇందిరా!" అన్నాడు. ఇందిర నిశబ్దముగా ఆచేయి తనచేతిలోకి తీసుకుందిగాని సమాధానం ఇవ్వలేదు.

"నన్ను చూడటం అయిపోయిందిగా? ఇక వెడతావా" అన్నాడు శాస్త్రి. ఇందిర తలఎత్తిచూసింది. ఆమెకళ్ళనిండా నీరు నిలిచింది.

"ఇదివరకు ఒకసారి నీమాట వినటంవల్ల నా బ్రితుకు నరకం అయింది. ఏమనుకోకు బావా! ఇక నీమాటవినతలుచుకోలేదు." అతనిచెయ్యి గట్టిగా పట్టుకుని తన హృదయానికి హత్తుకున్నది ఆమె.

శరీరాన్నీ మనసునీ కూడా తలకిరిందులుచేసే స్త్రీహృదయం అది - అనుకోకుండా అతనిచెయ్యి చలించింది.

ఆ చలనం చాలు- అగ్నిపర్వతాలు పగలటానికి. సరిగ్గా అదే జరిగింది. ఈ వారంరోజులనుంచీ ఒంటరితనం-నిరాశ-నిండివున్న అతని మనసూ, శరీరమూకూడా ఒకతడవ వాస్తవిక జగత్తులోకి విసిరివేయబడటంతో ఊపిరాడక గిజగిజలాడుతున్న రోగి ఊపిరందటంతోనే బాగా పీల్చుకున్నట్లు శాస్త్రి ఇందిరని తనమీదకు లాక్కున్నాడు.

"బావా! నేనుస్నానంచెయ్యాలి" అన్నది ఇందిర. ఏం మాట్లాడాలో తెలియక.

"తరువాత అన్నిపాపాలూ పోయేట్లు : ముద్రస్నానం చేద్దాం" అని అన్నాడు శాస్త్రి.

"పాపం అనుకున్నపని చెయ్యకూడదు బావా... అలా అనుకోకుండా ఉన్నప్పుడే ఆసాహసం చెయ్యాలి" అన్నది ఇందిర.

శాస్త్రి ఇందిరని దూరంగా తోసేశాడు. "ఇందిరా, నామాటవిను. నువ్వు వెళ్ళిపోవటం మంచిది." అన్నాడు"

"వద్దు... దేవుడికి ఆలయం అయే ప్రదేశం శుచిగా వుండాలి. స్నానంచేసి వస్తాను" అని లోపలికి వెళ్ళిపోయింది ఇందిర.

శాస్త్రికి తన శరీరం అదుపులో లేదు. ఏదో కావాలి ఏదోచెయ్యాలి. తనుడాక్టరు శరీరధర్మాలు తనకు తెలిసినట్లుగా ఎవరికీ తెలియవుగాని అవిఇంత ఉధృతంగా ఉంటాయని తనకు కూడా తెలియదు.

సరిగ్గా అదే సమయంలో కాత్యాయని ఆగదిలో ప్రవేశించింది. మరో స్త్రీ - అనుకున్నాడు శాస్త్రి" ఎలా

ఉన్నారు డాక్టర్" అంటూ కుర్చీ మంచం దగ్గరికి లాక్కుంది కాత్యాయని.

దేవుడనుకొంటున్న శాస్త్రి ఆమెకు సహాస్రశీర్షుడైనట్లుగా ఉంది. ఘాటైన శాంటీ ఫలితంగా ఆమె ఏంచేస్తున్నదో తెలియకుండా శాస్త్రి మంచంమీద కూర్చుని "డాక్టర్ ఎందుకు అలాఉన్నారు?" అంది ఆమె మాటలు తడబడుతున్నయ్.

ఈమెకి కూడా తనంటే అభిమానమే. ఆ క్షణంలో అదివరకు కాత్యాయని అంటే ఉన్నజాలి నూరుచేత హెచ్చవేయబడి వాంఛగా మారింది అతనికి. ఈ అభాగ్యురాలికి కొంచెం ఆనందం ఇవ్వగలడు తను. అందువలన తన ఆనంద భాండాగారం దివాళా అయిపోతుందనే భయం ఏమీలేదు.

"కాత్యాయనీ" ఆమె పెదవులనుండి వచ్చే శాంటీ వాసన ఘాటుగా వెగటుగా అనిపించింది అతనికి.

ఒక అరగంట గడచిన తరువాత ఇందిర స్నానంచేసి ఆ గదిలో ప్రవేశించేసరికి శాస్త్రి బోర్లగా పడుకుని నిద్రపోతున్నాడు. ఇందిర అతనిని లేపలేదు. పక్కనేఉన్న పడక కుర్చీలో పడుకుని నిద్రపోయింది.

తెల్లవారుఝామున ఇందిర రైలుకి వెడుతూ నమస్కరించినప్పుడు శాస్త్రి హృదయపూర్వకంగా ఆశీర్వదించి "వెళ్ళు ఇందిరా, ఏ పొరపాటూ జరగకుండా నిన్ను పంపగలుగుతున్నందుకు చాలా ఆనందిస్తున్నాను" అన్నాడు.

"నువ్వు దేవుడివి బావా! - నిన్ను పోగొట్టుకొన్న లోటు ఎంతబరువైనదో ఇందిర కొక్క-దానికే తెలుసు" అని కళ్లు తుడుచుకుంటూ టాక్సీ ఎక్కింది ఇందిర.

మలుపుతిరిగిన టాక్సీ ఇక కనిపించలేదు.

* * *

"కాత్యాయని కనిపించటం లేదేం శాస్త్రీ" అన్నదివారిజ.

"ఆమె ఇదివరకటి కాత్యాయనికాదు. తాగుడు మానివేసింది. చాలా బుద్ధిమంతు రాలయింది" అని నవ్వాడు శాస్త్రి. వారిజ ఆశ్చర్యపోయి,

"అదెలా సంభవం?" అన్నది.

"బహుశా మళ్ళీ జీవితంమీద వాంఛ కలిగి ఉండవచ్చును" అన్నాడు శాస్త్రి తలవంచుకొని.

"అంటే?"

"అంటే ఏంలేదువారిజా! సస్యశ్యామలమైన ఆమె హృదయం ఎండి బీటలు వారింది. ఏ అకాల వర్షపాతమో తిరిగీ ఆమె హృదయాన్ని సస్యశ్యామలం చేసి ఉండవచ్చును".

"వంటానికి బాగానే ఉంది. కాని, ఎలా జరిగిందన్నదే ప్రశ్న" అన్నది వారిజ అనుమానంగా శాస్త్రివంక చూస్తూ.

"కొందరు మనసుల్ని విరగగొట్టటంలో నిపుణులు; మరి కొందరు విరిగిన మనసుల్ని అతుకు వేయటంలో నిపుణులు. నేనలాంటి వాడినే వారిజా" అన్నాడు శాస్త్రి నవ్వుతూ. అతను ఏదీ దాచడు. శాస్త్రి పరిసరాల్లో ఉన్న

ఏవ్యక్తి కయినా తన చుట్టూ పది అద్దాలున్నట్లుగా అని పిస్తుంది. ఆ అద్దాల్లో తనరూపం తనే చూసుకుంటాడు ప్రతి వ్యక్తీను.

ఆ మాటకి అదిరి పడింది వారిజ. "నువ్వ......నువ్వ" అన్నది ఆశ్చర్యంగా చూస్తూ.

"ఏం, అసూయగా ఉందా?"

"నాకు తెలియటం లేదు" అన్నది వారిజ నిట్టూరుస్తూ. శాస్త్రి వారిజని దగ్గరకు తీసుకొని,

"కాత్యాయని పెళ్ళిచేసుకో బోతున్నది కూడా" అన్నాడు.

"ఎవరిని?"

"భయపడకు - నన్ను కాదులే" అని నవ్వాడు అతను. కొంచంసేపు ఆమె మాట్లాడలేదు. ... తరువాత "శాస్త్రీ!" అన్నది.

"ఏమిటి?" అన్నాడు పరధ్యానంగా చూస్తూ శాస్త్రి.

"మనం పెళ్ళి చేసుకుందాం" అన్నది వారిజ.

శాస్త్రి ఉలిక్కి పడ్డాడు. కొంచెం సేపయినాక తలఎత్తి వారిజవంక చూస్తూ "పెళ్ళి అంత అవసరమా?" అన్నాడు.

"నీవు నా వాడవే అనే నమ్మకం ఎలా కలుగు తుంది మరి?"

"సరే అయితే - నా పేరు చతుర్వేదుల సత్య నారాయణశాస్త్రి - ఈ రోజు నా కథ విను వారిజా! ఎందుకో చెప్పాలనిపిస్తున్నది" అన్నాడు అతను.

వారిజ సరే అని తల ఊపింది. శ్రద్ధగా అతను చెప్పిన దంతా విన్నది. ఒక్క మాట మాట్లాడలేదు. కథ అయిన తరువాత "రేపు వస్తాను వారిజా! అప్పుడు మాట్లాడుకుందాం" అని వెళ్ళి పోయినాడు శాస్త్రి.

మర్నాడు అతను తిరిగి వచ్చేసరికి ఇల్లు తాళంవేసి ఉన్నది.

"శాస్త్రి ఈ జీవితంలో వారిజ ఇక నీకు లభించదు" అని వ్రాసి ఉన్న చీటీ పక్కింటి కుర్రాడు ఇచ్చిపోయినాడు.

శాస్త్రి, బాధపడలేదు - సంతోషించలేదు. సరాసరి రిజిష్ట్రారు ఆఫీసుకు వెళ్ళి కాత్యాయని పెళ్ళికి సాక్షిసంతకం చేసి జీవితం మలుపు తిరిగింది అనుకున్నాడు.

* * *

"వారిజా!" మోహనమూర్తి ఆమెరెండు భుజాలూ పట్టుకొని ఊపాడు.

తన మనోయవనికమీద గత జీవితాన్ని వేసుకొని పరీక్ష చేసుకొంటున్న వారిజకి ఆ స్పర్శతో మెలకువ వచ్చింది. అప్పట్టికీ ఇప్పటికీ ఎంతకాలం గడిచిందో ఆమెకు తెలియదు. రిప్‌వాన్ వింకిల్ కథలాగా తన కథ కూడా ఈ మధ్యలో నిద్రపోయింది

శాస్త్రి చేతిలో నిద్రపోయిన తను మోహనమూర్తి చేతుల్లో నిద్ర లేచింది. అంతే తనకు తెలిసింది. తమాషా ఏమిటంటే, ఈ నిద్ర తనకి విజ్ఞాన భిక్ష ప్రసాదించింది. ఈ నాడు జీవితం తననుంచి దాచినది కాని - తనకు తెలియనిది కాని - తను పొందలేనిది కాని - ఆమెకు కనిపించటంలేదు,

తను గాయని. ఏకాగ్రత లక్ష్యంగా నూతన రాగాలను ఆలాపిస్తున్న గాన సరస్వతి. తిరిగీ తన జీవితంలో రాగోదయం. ఈ రాగం అపూర్వమూ అద్భుతమూ అయిన స్వరకల్పనలతో ఉన్న నూతన రాగం. ఈ రాగం గాఢ సుషుప్తిలో - తను దర్శించలేని మరో కొత్త అనుభవానికి నాంది.

వారిజ నిద్ర లేచింది. వెంటనే ఆమె కంఠంలోంచి మోహనరాగం సన్నగా వెల్లువగా సరళంగా ప్రవహించటం ప్రారంభించింది.

"వారిజా, ఆరాగం పాడటం ఆపివేయవూ!" ప్రాధేయపూర్వకంగా అన్నాడు మోహనమూర్తి.

"ఎందుకని జిజ్జూ? ఆ రాగంలో నీ పేరు ఉన్నది కనుకనా?" అన్నది వారిజ.

"కాదు వారిజా!... కాని ఎందుకో ఆ రాగం నాకు బాధ కలిగిస్తుంది" అని సమాధానం ఇచ్చాడు మోహనమూర్తి.

"శాస్త్రికి ఆ రాగం చాలా ఇష్టం" అన్నది వారిజ అదో మాదిరిగా నిద్రలో ఉన్నదానిలా.

"శాస్త్రి ఎవరు?" అన్నాడు మోహనమూర్తి.

"నా సోదరుడు" అని నిశ్చలంగా జవాబిచ్చింది వారిజ.

మోహనమూర్తికి ఆ సమాధానం బొత్తిగా అర్థం కాలేదు. ఏం జవాబు చెప్పాలో తెలియక మాట్లాడకుండా ఊరుకున్నాడు.

వారిజ ఏదో జ్ఞప్తికి వచ్చిన దానిలా మొగంపెట్టి "మర్చిపోయినాను జిజ్జూ! ఇవ్వాళ రామలక్ష్మిగారు వస్తా నన్నారు" అన్నది.

"మంచిదే" అన్నాడు మోహనమూర్తి. అతనికి ఇంకా శాస్త్రి ఎవరు? అన్న ప్రశ్న మనసులో మెదులు తున్నది. అసూయా? అని తనని తనే ప్రశ్నించుకుని, కాదు కుతూహలం-అని సమాధానం చెప్పుకున్నాడు అతను.

"రామలక్ష్మిగారు వస్తున్నారు!" అన్నది వారిజ. ఆ మొమాటతో కూడా రామలక్ష్మి లోపలికి వచ్చింది. వారిజ చేతులు వీణమీద మోహనరాగాన్ని ఆలాపిస్తున్నయ్యి! రెండు చేతులూ జోడించి నమస్కరించింది వారిజ.

"అమ్మయ్యా! మీ పుణ్యమా అని మోహనరాగం నుంచి తప్పుకున్నాను. రండి రామలక్ష్మిగారూ! కూర్చోండి" అన్నాడు మోహనమూర్తి.

"మోహన-అనే పదం మీ పేరులోనే ఉంది కదండీ" అన్నది కూర్చుంటూ రామలక్ష్మి.

"రామలక్ష్మిగారూ! నాకథ చెప్తానన్నాను ఒక సారి - ఇప్పుడు వింటారా?" అన్నది వారిజ.

"మీ కథంతా మొన్ననే విన్నాను వారిజగారూ!- మీ వర్షన్ కూడా చెపితే వింటాను" అన్నది రామలక్ష్మి నవ్వుతూ.

వారిజ ఉలిక్కిపడింది. మోహనమూర్తి తెల్ల పోయినాడు "నాకథ నాకు కాక మరో ఇద్దరికి తెలుసు. ఆ ఇద్దరిలో ఎవరు చెప్పారు మీకు?" అన్నది వారిజ నీరసంగా.

"బెంగుళూరునించి నేను వ్రాసిన ఉత్తరం అంద లేదా ?"

"అందిందనుకోండి. కాని అందులో మీరు వ్రాయ లేదుగా!"

"ఆ ఉత్తరం మీకసవ్రాశారా?" అన్నాడు మోహన మూర్తి.

"అవును ... ...ఒక్క సంగతి వారిజగారూ! జీవితంలో చాలా అనాలోచితంగా ప్రవర్తిస్తారు మనుషులు ... ... కాని తిరిగీ సరిదిద్దుకుంటారు. కాలం ఆ అవకాశం ఇస్తుంది."

"ఇల్లుకట్టేవాడొకడు; అందులో నివసించేవాడు మరొకడు, జరుగుతున్న చరిత్రే ఇది. ఇంతకూ నా కథ ఎవరు చెప్పారు మీకు?"

"రమణమూర్తిగారు"

వారిజ మాట్లాడలేదు.

"మీరు అలా ఎందుకు చేశారో ఇప్పటికీ తెలియదుట. శాస్త్రిగారు ఆవిషయం ఎప్పుడూ పైకి మాట్లాడక పోయినా లోపల అదే ఆలోచిస్తూ ఉంటారని అన్నాడతను. మీ చిరునామా పట్టుకుని అయిదారు ఉత్తరాలు వ్రాసినా మీరు సమాధానం ఇవ్వలేదని అన్నాడు"

వారిజ నిట్టూర్చి "నేను ఏ ప్రశ్ననుంచి తప్పుకోవాలని ప్రయత్నిస్తున్నానో; అదేప్రశ్న నన్ను వెంటాడుతున్నది" అన్నది.

"మీ స్వవిషయాన్ని గురించి మాట్లాడుతున్నందుకు క్షమించండి వారిజగారూ! మా నళినీకాంతరావు, రమణ

మూర్తిగారూ చాలా స్నేహితులు. మీ విషయం, శాస్త్రి గారి విషయం రమణమూర్తిగారు ఎప్పుడూ చెపుతూ ఉండే వారుట. అందుకే ఇక్కడికి వచ్చినప్పుడు నళిని మిమ్మల్ని చూడాలని చాలా ప్రయత్నించాడు. ఆ తరువాత నేను మొన్న బెంగుళూరు వెళ్ళినప్పుడు రమణమూర్తిగారినీ, శాస్త్రి గారినీ చూశాను. శాస్త్రిగారి డిస్పెన్సరీ ఆచుట్టుపక్కల పేరుమోసింది. యాంత్రికంగా పనిచేసుకుపోతారు. ఆయన చేతిలో ఎప్పుడూ గీతాంజలి ఉంటుంది"

వారిజ రెండుచేతులతో మొగం కప్పుకొని ఏడవటం ప్రారంభించింది. ... రామలక్ష్మి తెల్లపోయి,

"మీ మనసుని కష్టపెట్టాను" అన్నది.

"లేదు రామలక్ష్మిగారూ! లేదు... శాస్త్రి మహా పురుషుడు. ఈ క్షణాన పోయి అతని అతని పాదాలముందు వాలాలని ఉంది. కాని ఆ పనేచేయలేక పోతున్నాను"

"కారణం ?"

"కారణం లేకపోలేదు రామలక్ష్మిగారూ!... ఆ కారణం చెప్పి శాస్త్రిని బాధపెట్టటం నాకు ఇష్టంలేదు. దోషం వారిజదికాదు. విధిది అని ఎందుకు చెప్పాలి? — అ భాగ్యురాలు వారిజే దోషి అనుకోనీ అతనిని" అని మళ్ళీ ఏడవటం ప్రారంభించింది వారిజ.

"వారిజగారూ!... మీరుకూడా దుఃఖిస్తారనుకోలేదు" అన్నది రామలక్ష్మి మెల్లగా. ఆ మాటతో వారిజ కళ్ళు తుడుచుకుని వెన్నెలలో తడుస్తున్న వానలాగా నవ్వింది.

ఇందాకటినుంచీ ఈ సంభాషణ బొత్తిగా అర్థంకాని మోహన మూర్తి ఆ నవ్వుతో ఊపిరి పీల్చుకున్నాడు.

"వారిజ ఏడవటం ఇన్నాళ్ళకు చూశాను. కాని ఆ ఏడుపుకూడా ఇంత అందంగా ఉంటుందని అనుకోలేదు" అన్నాడు.

"దుఃఖం చాలా అందమైనది మోహనమూర్తిగారూ! దాన్ని ఆరాధించి అనుభవించటం అందరికీ చేతకాదు" అన్నది రామలక్ష్మి.

"ఇంతకూ ఈ కాశీమజిలీ కథలో ఉన్న పీటముడి నాకు బొత్తిగా బోధపడలేదు." అన్నాడు మోహనమూర్తి పసివాడిలా చూస్తూ.

"ఆ పీటముడి చివరిదాకా విప్పకుండా ఉంటేనే కథలో సస్పెన్సు ఉంటుంది" అని నవ్వింది రామలక్ష్మి.

"ఊపిరి బిగపట్టి చదువుతారు" అని పూర్తిచేసింది వారిజ.

"నాకెప్పుడూ స్త్రీ సమస్యగా తయారవటం అనుభవంలోకి రాలేదు. ఇదే మొదటిసారి" అన్నాడు మోహన మూర్తి.

"సమస్యగా తయారుకాని స్త్రీ - స్త్రీ కానేకాదు. క్షమించాలి నేను కథల్లోలాగా మాట్లాడుతున్నందుకు" అని నవ్వింది రామలక్ష్మి.

"నా కథ - నవలగా వ్రాయకూడదూ మీరు?"

"తప్పకుండా వ్రాస్తాను వారిజగారూ! కాని ముగింపు తెలియటంలేదు."

"శరత్ బాబులాగా చంపేయండి, తీరిపోతుంది"

"జీవితానికీ కథకీకూడా ముగింపు మృత్యువు అయితేనే అందం."

"అయితే నన్ను చంపేస్తారేమిటి?" అని నవ్వింది వారిజ.

మీరు ఏం చేస్తే అదే వ్రాస్తాను. ఈ కథలో అతిశయోక్తులూ వర్ణనలూ లేవు. ఈ కథలో అసత్యంకూడా లేదు. ఇది స్త్రీ చరిత్ర" అని నిట్టూర్చింది రామలక్ష్మి.

"నేను సమస్యగా జన్మించాను. సమస్యగా జీవించాను. సమస్యగానే ఈ జీవితంలోంచి తప్పుకుంటాను" అని నవ్వింది వారిజ.

"అప్పటికీ ఇప్పటికీ మానసికంగా చాలా ఎదిగారు మీరు" అన్నది రామలక్ష్మి. కొంచెంసేపు ముగ్గురూ మాట్లాడలేదు. రామలక్ష్మి నిలబడి "రండి మోహనమూర్తి గారూ! నన్ను పంపించి వద్దురుగాని" అని వారిజవంక తిరిగి "మళ్ళీ మాట్లాడదాం" అని బయటికి దారితీసింది.

"కాసేపు ఈకొండ మొదట్లో కూర్చుందాం లక్ష్మి! నీతో చాలా మాట్లాడాలి" అన్నాడు మోహనమూర్తి.

"ఇతర్ల ముందు బహువచనం - ఏకాంతంలో ఏకవచనం. ఏమిటీ నాటకం?" అని నవ్వింది రామలక్ష్మి.

"కొన్ని నాటకాలు చాలా అవసరం. మనం ఎక్కువ స్నేహితులమని లోకానికి తెలియటం నాకిష్టంలేదు"

"ఏం తెలిస్తే. మనిద్దరికీ ఏదో ఉందనుకుంటారు. ఇంతలో నీ సతీవ్రతానికీ నాపాతివ్రత్యానికీ వచ్చిన మచ్చ ఏమీలేదు"

"ఏం లేనప్పుడు అనుకోవటం మాత్రం దేనికని?"

"ఏం లేనిది అనుకోటంలోనే అందముంన్నది"

"నీ మొహం ఉన్నది కాని ఇక్కడ కూర్చుందాం రా"

"అయ్యబాబోయ్ సంసారస్త్రీని... ఇలాగేనా"

"అబ్బబ్బ నన్ను ఏడిపించకు లక్ష్మీ! వెధవ వేళాకోళం నువ్వూ"

"ఏమిటి వేళాకోళం? నేను సంసార స్త్రీని అన్నదా?"

"కాదు తల్లీ కాదు... సరా? ఇక వచ్చి కూర్చో"

"ఇంతకూ నీబాధ ఏమిటో సెలవియ్యి"

"ఏంలేదు వారిజ పూర్వచరిత్ర!"

"ఇప్పుడే చెప్పేస్తే కథలో సస్పెన్సు ఉండదు"

"నీ సస్పెన్సు పాడుగాను చెపుతావా? చావకొట్టనా?"

"నేను అరిచానంటే!...జాగ్రత్త ఆడదాన్ని"

"ఏడిశావు వెధవ ఆడతనం నువ్వూను. చెప్పులక్ష్మీ!"

"ఇప్పుడు కాదు - రేపు నేను ఒక ఫ్రెండ్ కారులో ఏలూరు వెళుతున్నాను. నాతో వచ్చావంటే దారిలో చెపుతాను" అని లేచింది రామలక్ష్మి.

"సరే...ఎన్నింటికి?"

"కారుతో సహా మీ ఇంటికి వస్తాను. ఇంట్లో ఉండు – వారిజగారి కొలువులో విషయం మర్చి పోయినా నాకు అభ్యంతరం లేదు ' అని నవ్వింది రామలక్ష్మి.

* * *

అధునికుడు ధరించిన మచ్చల బుష్‌కోటులా ఉన్న తారురోడ్డు మీద కారు జారి పోతున్నది.

"ఊఁ ఇప్పుడు చెప్పు లక్ష్మీ! వారిజ కథ ఏమిటి?" అన్నాడు మోహనమూర్తి.

"ఆకథ చెప్పేముందు వారిజ అంటే నీకే భావం ఉన్నదో, అసలు ఆమెని నువ్వెక్కడ కలుసుకున్నావో వివరాలు చెప్పు" అన్నది తాపీగా సీటుకుజార్లపడి రామలక్ష్మి.

"వారిజఅంటే నాకేభావంఉన్నదో చెపితే ప్రస్తుతానికి చాలుగా?ఎక్కడ కలుసుకున్నానో ఏమిటో అదంతా దేనికి?" అని నవ్వాడు మోహనమూర్తి.

"ఏంలేదు. కథకాస్త పొడిగిస్తే బాగుంటుంది చూడు– అందుకని – అందులోనూ కాస్తప్రేమ విషయం ఘాటుగా ఉంటుంది. సినిమాలో డ్యూయెట్ లాగా"

"వారిజని నేను ప్రేమిస్తున్నానని నీఉద్దేశ్యమా?"

"మరిలేకపోతే కేవలం సంగీతం నేర్చుకోటానికే వెడుతున్నావేమిటి!" అని ఆశ్చర్యం నటిస్తూ ప్రశ్నించింది రామలక్ష్మి.

"ఎందుకు వెడుతున్నానో నాకే తెలియదు. ఆమెలో విపరీతమైన ఆకర్షణ ఉన్నది. ఆ ఆకర్షణా అద్భుతమైన ఆమె సౌందర్యం సంగీతాలూ అన్నిటినిమించిన ఆమె సమున్నత–

వీటిముందు మనం చాలా అల్పులం అనిపిస్తుంది నాకు...
అదీకాక..."

"అదీకాక?...ఆమెమీద శరీరానికీ మనసుకే సంబంధించిన మరోవ్యూహాలేమీ లేవా నీకు?"

"అంతసూటిగా ప్రశ్నించకు లక్ష్మీ" అని నిట్టూర్చాడు మోహనమూర్తి.

"నువ్వు చెప్పలేకపోతే నేను చెప్పతానువిను- ఆమెను నువ్వు మానసికంగా ఆరాధిస్తున్నావో లేదో నాకు తెలియదు కాని శారీరకంగా వాంఛిస్తున్నావు...అవునా?"

"అవును... కాని"

"అవునూ లేదు...కానీలేదు. అదిఅంతే. అయితే నేనొకటి చెపుతాన్నువిను ... దావాగ్నిలాటి ఈ ప్రేమవల్ల నువ్వుగాని ఆమెగాని పొందగలిగిందీ - పొందుతున్నదీ - పొందబోయేదీ - ఆవేదన తప్ప మరేం లేదు"

"నేనూ దూరంగానే ఉందామని అనుక్షణం ప్రయత్నిస్తూనే ఉంటాను. ఎందుకో ఉండలేకపోతున్నాను. ఈ భయంకరమైన ఆకర్షణనించి ఎలాతప్పుకోవాలోకూడా నాకు తెలియకుండాఉన్నది." అన్నాడు అతను.

"ఒకసంగతి! మీఇద్దరిమధ్యా మరో దృఢతరమైన అనుబంధం ఏదైనా ఉన్నదా"

"ఎలాచెప్పాలో తెలియటంలేదు. ఉన్నదీ - లేదు"

"అంటే?"

"అంటే?" ఆమెఒడిలో తలపెట్టుకుని ఆలాపిస్తున్న పాటవింటూ. అనేకసమయాల్లు గడిపాను ... ఆమె చెయ్యి

నా చేతిలో ఉంచుకొని గంటలు గంటలు గడుపుతాను - ఒక తడవ మంగళగిరి టూరివెళ్ళిన బంగళాలో మరోపక్క లేక ఒకే బెడ్డింగుమీద గడిపాం...ఎలానమ్మించాలో తెలియటంలేదు లక్ష్మీ!... అంతకన్న దూరం మేం పోలేము?"

"ఎందుకని? ఇష్టంలేకనా? అవకాశం లేకనా?"

"అవకాశం లేక కాదులక్ష్మీ! ఎందుకో భయంగా ఉంటుంది. దేవాలయంలోకి చెప్పులతో వెళ్ళటానికి మనసు ఒప్పదు. శవంపక్కన నవ్వటానికి మనసొప్పదు. అలాటిదే ఏదో భావం కలుగుతుంది."

"నీవిషయంలో ఆమెకూడా అంతేనా?"

"ఆమెమనసు నాకందదు ఒకటి చెప్పగలను. నేనంటే ఏమో తెలియదుగాని నాపాటఅంటే అపరిమితమైన ఇష్టం. అదీగాక..."

"ఏమిటా అర్థోక్తి?"

"ఏంలేదు. నాకు దూరంగా వుండాలని ఆమె ఎప్పుడూ ప్రయత్నించలేదు...పైగా చాలా దగ్గరగా రావాలనికూడా అనుకుంటున్నదేమో అని నా అనుమానం."

"అలాంటపుడు నీ అభ్యంతరం దేనికి?"

"ఏమిటో లక్ష్మీ! ఆ తెర తీసేస్తే వారిజలో ఆకర్షణ పోతుందేమో! ఆమెకూడా అందరిలాటి స్త్రీయే అనిపిస్తుందేమో? అని నా భయం.

నీవు వివాహితుడవు ఇద్దరిపిల్లలతండ్రివి.ఆపైన గోపాల కృష్ణుడివి. నీకీ దిక్కుమాలిన చాదస్తంవమిటి శరత్ హీరో లాగా?"

"అయితే ఇప్పుడు నన్నేంచేయమంటావు - నాకు భయంగా వుంది"

"నీతి అవినీతుల పట్టింపులేని నువ్వే ఇలా మారిపోవటం చిత్రంగా ఉంది."

దేవీ విగ్రహాన్ని కొందరు చిత్రకారులు నగ్నంగా కూడా చిత్రిస్తారు. అయినా మనకి మనోభావం కలగదు"

"వారిజ ఒక పతితురాలిబిడ్డ. ఆపైన ఫ్రెంచియువతి. నువ్వామెను దేవీమూర్తి అంటున్నావు" అని నవ్వింది రామలక్ష్మి.

మోహనమూర్తి కళ్ళుపెద్దవిచేసి ఆశ్చర్యంగా రామలక్ష్మి వంక చూశాడు.

"అంతమాత్రాన వారిజ విలువతగ్గదు - మానస సరోవరంలో వికసించాల్సిన ఆ సహస్రదళపద్మం దురదృష్ట వశాన బురదలో పుట్టింది. అయినా తన కాంతినీ పరిమళాన్నీ పోగొట్టుకోలేదు... కాని" అని ఆపేసింది రామలక్ష్మి.

"చెప్పు లక్ష్మీ! ఆపావెందుకు?" అన్నాడు మోహనమూర్తి రామలక్ష్మి చెయ్యి చేతిలోకి తీసుకుంటూ.

"ప్రేమ ఉన్నదంటే నువ్వు నమ్ముతావా మూర్తీ!

"ఇప్పుడు ఆ ప్రశ్న దేనికి?"

"నేను మొన్న బెంగుళూరు వెళ్ళినప్పుడు నా జీవితంలో ప్రేమంటే నమ్మకంలేని నేను మొట్టమొదటిసారి ప్రేమించాను"

"చంపావు - ఎవరా నిర్భాగ్యుడు ?"

"సీరియస్‌గా చెప్తున్నాను... నిజమే!"

"సరేలే- ఎవరు?"

"డాక్టర్ సత్యనారాయణ శాస్త్రి"

మోహనమూర్తి ఉలిక్కిపడ్డాడు "అంటే వారిజ సోదరుడా?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"సోదరుడని ఎందుకన్నదో నాకూ అర్థం కావటం లేదు. శాస్త్రి ఆమె ప్రేమికుడు"

"వారిజ అబద్ధాలుకూడా ఆడుతుందా?"

"ఆడదు - ఇందులో ఏదో చిత్రం ఉన్నది"

"సరే అసలు సంగతి చెప్పు - అతనెవరు?"

"నళినితో శాస్త్రిగారి డిస్పెన్సరీకి వెళ్ళాను. అపురూపమైన అతని వ్యక్తిత్వం - మహోన్నతమైన అతని గాంభీర్యం - ఆ శాంతం - మూర్తి- అతనొక మహావ్యక్తి"

"మాట్లాడావా అతనితో?"

"కొంచెం సేపు - సాహిత్యాన్ని గురించి మాట్లాడుకున్నాం. వారిజ అతన్ని అపరిమితంగా ఆరాధించిందట అతనూ అంతేనని ఆ రోజుల్లో వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుంటారనికూడా పుకారు పుట్టిందట. కాని ఎందుచేతో వారిజ ఒకనాటి ఉదయం అది అసంభవం అని చీటీ వ్రాసిపెట్టి అంతర్ధానం అయిపోయిందట"

"ఇదెక్కడి చిత్రం?"

"చిత్రమే మరి. ఆ తరువాత రమణమూర్తి పెళ్ళిచేసుకున్నాడు గాని శాస్త్రి పెళ్ళిచేసుకోలేదు. ఇంకో చిత్రం ఏమిటంటే...…" అని ఆగిపోయింది రామలక్ష్మి.

"ఏమిటది?"

"అతను మడికూడా కట్టుకోలేదు. అతని దగ్గర కాత్యాయని అని ఒక నర్సు ఉందిట. వీళ్ళిద్దరికీ అట్టే మంచి పేరు లేదు"

"బాగుంది"

"ఇంకో విచిత్రం. ఆ రోజుల్లోనే రమణమూర్తి కూడా వారిజని ఇష్టపడేవాడనీ - అన్నదమ్ములిద్దరూ ఆ ఇంటికి రాక పోకలు సాగిస్తూనే ఉండేవారనీ మరో పుకారు. ఆ విషయం నేను నళినీని అడిగాను. రమణమూర్తీ నళినీ చాలా దగ్గర స్నేహితులు. రమణమూర్తి వారిజని ప్రేమించాడు కాని వారిజ రమణమూర్తిని ప్రేమించలేదని - నళినీ అన్నాడు"

"మరి శాస్త్రి సంగతి?"

"వారిజ శాస్త్రిని భగవంతుడిలా ఆరాధించేదట. వాళ్ళింట్లో పనిచేసిన వంటమనిషి ఇప్పుడు శాస్త్రి దగ్గర పని చేస్తున్నది - దానిద్వారా తెలుసుకున్న సంగతి ఇది: దాని అనుమానం ఏమిటంటే; వాళ్ళిద్దరికీ దేహసంబంధం కూడా ఉండేదని - అనేకసార్లు వాళ్ళిద్దరూ ఒక సోఫాలో దగ్గిర దగ్గిరగా కూర్చోటం చూచిందట"

"అంత మాత్రాన?"

"ఏమీ లేదని నిన్ను నువ్వు నమ్మించుకోవాలనుకుంటే నాకేం అభ్యంతరం లేదు గాని అది ఇంకోసంగతికూడా చెప్పింది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు.... సరేపోనీ!"

"మరి పెళ్ళిఎందుకు చేసుకోలేదంటావు?"

"కథకంతా ఆయువుశీల అదేనయ్యా బాబూ! అది తెలిస్తే ఇక లేనిదేమిటి?"

"మధ్యలో నీ ప్రేమఏమిటి మరి?"

"ప్రేమంటే నిజంగా ప్రేమించానని కాదు -అతనంత ప్రేమించతగ్గ వ్యక్తి- అని ఉపమానానికి చెప్పాను"

"ఏమిటో లక్ష్మీ, నాకర్తవ్యం ఏమిటో నాకు భోధ పడటం లేదు"

"కాని మూర్తీ, శాస్త్రిగారు ఎంత ఉన్నతులను కొన్నావు? ఎవరో ఒక యువకుడికి రక్తం దొరక్కపోతే తన రక్తం ఇచ్చారు"

"మరి ఆ దాక్షాయణిని చూశావా?"

"దాక్షాయణి కాదు-కాత్యాయని!"

"ఎవరో మహిషాసురమర్ధని... చూశావా అని అడుగు తున్నాను?"

"చూశాను. ఆమె భర్తకూడా బెంగుళూరులోనే ఏదో ఉద్యోగం చేస్తున్నాట్ట ఆమెకి ఒక కొడుకు ఉన్నాడు - వాడు సరీగ్గా శాస్త్రిగారి లాగా ఉంటాడు"

"రమణమూర్తి ఎక్కడున్నాడు?"

"అతనూ బెంగుళూరులోనే లాయరుగా ఉంటు న్నాడు. అన్నగారంటే అపరిమితమైన భక్తి ప్రేమా అతనికి"

"ఈ గోదావరిజిల్లా తెలుగువాళ్లు ఆ బెంగుళూరులో పడి అఘోరించటానికి వారిజే కారణం అంటావా!"

"కావచ్చు - కాకపోచ్చును. నేను మొదటితడవ ఒచ్చినప్పుడు వారిజ మైసూరు వెళ్ళిందని చెప్పావు - గుర్తుందా?"

"ఆ"

"అప్పుడు బెంగుళూరువెళ్ళి కాత్యాయనిని కలుసుకొని శాస్త్రి విషయాలడిగిందట. 'శాస్త్రిగారిని చూస్తారా?' అని కాత్యాయని అడిగితే ఏడుస్తూ అక్కర్లేదని- చెప్పిందట. ఈ సంగతి కూడా ఆ వంటమనిషే చెప్పింది"

"బాగుంది, వారిజ ఫ్రెంచియువతి - అన్నావు అదేమిటి?"

"ఆమెతండ్రి ఫ్రెంచివాడు-తల్లి తెలుగు బ్రాహ్మణ స్త్రీ"

"అదేమిటి?"

"అదంతే- వివరా లడక్కు"

"వివరాలకేముంది! ఆమె తల్లి ఎవడితోనో పోయింది కాబోలు- అంతేనా?"

"అంతేకాని నువ్వొకటి తెలుసుకోటం మంచిది. స్త్రీ తన జీవితాన్ని నిర్మించుకోటం నువ్వు సంగీతం పాడినంత తేలిక కాదు- ఆసంగతి గుర్తుంచుకో" అని కసిరింది రామలక్ష్మి. మోహనమూర్తి అన్నమాట ఎందుకో ఆమెకు గుచ్చుకున్నట్లుగా ఉంది.

"కోప్పడకు లక్ష్మీ! ఇప్పుడు నేనేం చెయ్యాలో చెప్పు?"

"అబ్బాయ్, అది ఎవరికి వారు నిర్ణయించుకోవాల్సిన విషయం. ఇందులో చెప్పటానికి నాకేం కనిపించటం లేదు. నా సందేహం అల్లా ఒకటే - శాస్త్రి లాటి

ఉన్నత వ్యక్తిని పోగొట్టుకొని ఆమె ఎలా జీవిస్తోందా-అని!"

"చూస్తే నిజంగానే ప్రేమించిన ట్లున్నావు" అని నవ్వాడు మోహనమూర్తి.

"నాకూ అదే అనుమానంగా ఉంది. నేను పెళ్ళి అయి పిల్లల తల్లిని కాకుండా ఉంటే నా సర్వస్వం అతని పాదాల ముందు అర్పించేవాన్ని" అని నవ్వింది తనుకూడా రామలక్ష్మి.

"వారిజే విచిత్రమైన స్త్రీ అనుకుంటే అంతకంటె విచిత్రంగా ఉన్నాడు ఈ డాక్టరు!"

"సంభాషణ దారితప్పింది-ఆఫ్లాస్కు ఇలా అందుకో కాఫీ తాగుతాం"

"వెధవకాఫీ! బ్రాందీ అయితే బాగుండేది"

"ముందు అలాగే అని - తీరా గ్లాసు చేతికి ఇచ్చిన తరువాత 'దేవాలయంలోనికి చెప్పులతో వెళ్ళినట్లుంది' అంటావు-అవునా?" అని పకపకా నవ్వింది రామలక్ష్మి.

"ఊరుకో లక్ష్మి నన్నేడిపించకు" అని కాఫీ తాగటం ఆరంభించాడు మోహనమూర్తి. గేదె ఒకటి అడ్డురావటం వలన సడన్ బ్రేక్ వేశాడు డ్రైవర్.

"నడుస్తూన్న ప్రేమ రథానికి సడన్ బ్రేక్ ఎందుకు వేసిందంటావు వారిజ" అన్నాడు మోహనమూర్తి.

"గేదె అడ్డు రావటం వలన" అని తాపీగా జవాబు ఇచ్చింది రామలక్ష్మి.

"అంతలోకే హాస్యరసం ఊరుతుంది నీలో"

"సరేగాని వారిజ కథ నీకు తెలిసినట్లు - అందులో ముఖ్యంగా నేను చెప్పినట్లు ఎక్కడా అనకు. వారిజ దగ్గర అసలు అనకు"

"అననుగాని - నాక్కు మతిపోతున్నది"

"అసలు ఒకప్పుడు ఉన్నదా అని?"

"ఎందుకో నిన్ను ముద్దు పెట్టుకోవాలనిపిస్తున్నది లక్ష్మీ"

"ఉండుండు- గుక్కతిప్పుకోనీ. ఏమిటీ అన్నావు?"

"నిన్ను ముద్దు పెట్టుకోవా లనిపిస్తున్నది"

"ఈ సంగతి కారెక్కేముందే చెవితే - ఏకంగా ఆంబ్యులెన్స్‌మాట్లాడు కునే వాళ్ళంగా"

"ఏం? ఏక్సిడెంట్ అవుతుందనా?"

"ఏక్సిడెంట్ కాకపోతే ఇదేమిటి మరి?"

"నువ్వు నా ప్రియమిత్రురాలివి - ఆ పైన ప్రఖ్యాత రచయిత్రివి. జీవితంలో నీకు చెప్పకుండా దాటిన విషయం నాకేమీ లేదు. అదీకాక మనిద్దరికీ ఏదో ఉందని లోకం భ్రమించేంత స్నేహం మనది"

"కాని వారిజగారిముందు మీరు అంటే మీరు అనుకుంటాం" అని నవ్వింది రామలక్ష్మి.

"ఎందుకనుకుంటామో కొంచెం ఆలోచించు. ఆవిడ ఏమయినా అనుకుంటుందని"

"సరే నువ్వు ఏపాడు పనిచేసినా నీకు సహకరిస్తానని వాగ్దానం ఆఘోరించాను కనుక - విషయం అంగీకరిస్తు న్నాను"

"అందుకే నిన్ను ముద్దు పెట్టుకోవాలనిపిస్తున్నది"

"ఇప్పుడు మనం వెళ్ళేది హాస్పటలుకే కనుక- కాని"

"వెధవజోక్ నువ్వూనూ! ఇంతకూ హాస్పటలుకి దేనికి?"

"అక్కడొక రోగిని చూసిరావాలి"

"ఇలా గమ్యం తెలియకుండా నీ వెంటకనుక వస్తు న్నాను"

"కేవలం నన్ను ఉద్ధరించడానికి - కదూ?"

"మరి నువ్వు ఒక తెవే ఆడదానివి వెడుతున్నావని - కాస్త మగదిక్కుగా ఉంటుందని......"

"ఏమిటీ - మగదిక్కా?"

"మరే"

"అయ్యబాబోయ్ ... మా ఆయనకి ఈ సంగతి తెలిస్తే?"

"ఏం, విడాకు లిస్తాడా?"

"అవును. ఆ అదృష్టంకోసమే ఎదురు చూస్తున్నట్లుగా మరీ"

"నీ మొహంగాని, నన్నేంచేయమంటావో చెప్పు?"

"నే చెప్పినట్లు వింటావా?"

"లక్ష్మీ! ఇలా కాల్చుకు తింటున్నావేమిటి ఇవాళ?"

"నువ్వు ముద్దుసంగతి ఎత్తినప్పటినించీ - నామతి స్వాధీనం తప్పింది"

"ఏం, కావాలనా? అక్కర్లేదనా?"

"ఆ సంగతి వారిజని అడిగి చెపుతాను"

"కొంప నిలువునా తీసెయ్య గలవు జాగ్రత్త"

"ఎందుకో అంతభయం!"

"చెప్పు లక్ష్మీ! నేనేం చెయ్యను?"

"ఇలాటి అర్థం లేని ప్రశ్నలు నన్ను అడగబోకు. నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి. చివరకు ఈ కథ ఎలానూ విషాదాంతం అవుతుంది"

కారు ఏలూరు చేరింది.

*  *  *

మోహనమూర్తి పుట్టకముందే తండ్రి, పుట్టిన కొన్ని క్షణాలకి తల్లీ చనిపోయినారు. మేనత్త పెంచి పెద్దచేసింది. ఆవిడగొప్ప సంగీత విద్వాంసురాలు. ఒక మహాగాయకుడిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నదని అంటారు. ఒకరోజు ఆయన పున్నాగ వరాళి ఆలాపిస్తుంటే ఒక త్రాచుపాము ఎక్కడి నుంచో వచ్చి - పాట ఆపగానే కాటేసిందిట.

భర్త మరణించిన తరువాత ఆవిడ తిరిగీ పాడలేదు. బోలెడు ఆస్తితో పుట్టింటికి వచ్చి చేరింది. తరువాత అన్న గారూ వదిన గారూ కూడా చనిపోవటంతో ఆస్తి బాధ్యతా పసిబిడ్డ- మోహనమూర్తి బాధ్యతాకూడా తనభుజాల కెత్తుకున్నది ఆవిడ.

మోహనమూర్తి ఆవిడనే 'అమ్మా' అని పిలుస్తాడు. మోహనమూర్తి రెండు మూడు నెలల వయసప్పుడు కూడా అపశ్రుతి విని సహించలేక పోయేవాడు. ఏ పారుపల్లి రామ కృష్ణయ్యగారి పాటో వినిపిస్తే అక్కడికి తీసుకు వెళ్ళే దాకా ఏడ్చేవాడు. అయిదారేళ్ళ పిల్లవాడప్పుడే అతనికి సంగీత సరస్వతి తానై తనకు ప్రత్యక్షం అయింది. గొప్ప పాటకు రాలైన మేనత్త అతనికి స్వరకల్పనల్లోని రామణీయకతని విశదపరిచింది.

ఏడేళ్ళ మోహనమూర్తి వర్ణాలూ కృతులూ నేర్చుకున్నాడు - తొమ్మిదేళ్ళ మోహనమూర్తి సంగీతంతో పాటు వాద్యవిద్వాంసుడు కూడా అయినాడు.

పదకొండు ఏళ్ళ మోహనమూర్తి పాట కచ్చేరీలు చేసి పదిమంది మెప్పు పొందాడు. పదమూడు ఏళ్ళ మోహన మూర్తి ఆకాశవాణి అన్ని కేంద్రాలలోనూ గానసంగీతం ప్రసారం చేయటమే కాకుండా తమిళ కేరళ దేశాల్లో కూడా ప్రఖ్యాతుడైనాడు

పదిహేనేళ్ళ మోహనమూర్తి మూలరాగాల్లోంచి అతి నూతనమైన కొన్ని రాగాలని సృష్టించి వాటిని దేశ వ్యాప్తం చేశాడు.

పదిహేడేళ్ళ మోహనమూర్తి లలితసుగమ గీతాల్లోని మాధుర్యాన్ని అవగతం చేసుకొని రచయిత భావానికి రూపాన్ని ఇవ్వటంలో అద్వితీయుడై భారత దేశ ప్రఖ్యాత గాయకుల్లో ఒకడయినాడు.

పంధొమ్మిదేళ్ళ మోహనమూర్తి వివాహితుడై తండ్రి అయినాడు. సంగీత ప్రపంచానికి అవతల మరో ప్రపంచం ఉన్నదని అతనికి బోధ పడటమే కాకుండా ఉత్తమ కళకి స్త్రీ ఆలంబనం అనే అభిప్రాయం బలపడింది.

కావ్య విద్వాంసుడైన ఆ యువకుడు స్త్రీని వీణతో పోల్చి చూడటం ప్రారంభించాడు. బలహీనమైన వాటి హృదయాలూ తంత్రులూ కూడా ఉత్తమ వ్యక్తి చేతుల్లో అయితే - నూతన స్వర కల్పనలతో మధురగానాన్ని ఆలాపిస్తయ్యని అనుభవ పూర్వకంగా అర్థం చేసుకున్నాడు.

జీవితం అపశృతిలేని ఉత్తమరాగం వంటిదనే అతని భ్రాంతి బొంబాయిలో మొదటిసారిగా తొలిగిపోయింది. ఎర్రగా పల్చగా ఆడపిల్ల అధరంలాఉన్న అతని పెదవుల నించి తేనె వాకలుగా జారుతున్న సంగీత వాహినికి ఆకర్షితురాలైన ఒక పార్సీబాలిక అతనికి ఆత్మార్పణ చేసింది.

అవివాహితురాలైన ఆ పిల్ల అందం-అభేరిరాగంలా అతనిని ఆకట్టుకుంది - బీచిలో కూర్చున్నపుడు తన ప్రేమని వెల్లడించింది తహిమీనా.

"నేను పెళ్ళి అయిన వాడిని. ఇది అవినీతి అని నీకు నీతులు చెప్ప బోవటం లేదుగాని, ప్రమాదం అని మాత్రం హెచ్చరిస్తున్నాను" అన్నాడు మోహనమూర్తి.

తహిమీనా నవ్వింది - "మా ఇంట్లో ఏ చెట్టు మొదటి సారి పుష్పించినా దానిని చెట్టునించి కోయం - భగవంతుడికి అర్పణగా చెట్టునే ఉంచుతాం" అన్నది.

ఆంధ్రుడైన మోహనమూర్తికి అంతకంటె హెచ్చరిక అనవసరం. ఆ మాదిరిగా అతని జీవితంలో మరో కోణం నించి స్త్రీదర్శనం ఇచ్చింది. ఆ నాటినించి ఈ నాటిదాకా అతనికి మళ్ళీ తహిహిరా నా కనిపించలేదు. ఇప్పుడామె అమెరికాలో ఉంది.

ఆ తరువాత అతనికి అనేక అనుభవాలు కలిగినయ్ - కాని కొన్ని మాత్రమే అతని స్మృతి పథంలో శాశ్వతంగా నిల్చి పోయినయ్. అతని భార్యకూడా అందమైనది. ఆమెకు సర్వాధికారాలూ ఉన్నయ్. అతనికి గృహిణి, అతని పిల్లలకి తల్లి.

అతనికి కూడా ఆమె తల్లిగానే అనిపిస్తుంది- స్త్రీ అనిపించదు. మిగతా స్త్రీలల్లో ఒకరొకరుగా అతనికి ఒక్కొక అనుభవం ఇచ్చారు. ఆడవాళ్ళ విషయంలో అతనికి అట్టే మంచి పేరులేదు. తమాషా ఏమిటంటే లోకం అనుకున్నంత నైతిక విలువలు లేని వాడు కాదు అతను.

అతని పాటని ప్రేమించి - అతని వ్యక్తిత్వాన్ని వాంఛించిన మరో స్త్రీ వసుధా అయ్యంగార్, తమిళ స్త్రీ. చిత్రం ఏమిటంటే అతనికన్న ఆమె పెద్దది. మోహనమూర్తిని ఆరాధించే స్త్రీలు చాలామంది ఉన్నారు కాని, అతను ఆరాధించే స్త్రీలు ఒకరిద్దరికన్న లేరనేచెప్పాలి. ఆ ఒకరిద్దరిలో వసుధా అయ్యంగార్ ఒకతె.

మోహనమూర్తి వ్యక్తిత్వం చాలా విచిత్రమైనది. అతనన్న స్త్రీపురుష భేదం లేకుండా అందరూ ఇష్టపడతారు.

అతన్ని ఇష్టపడనివారు కేవలం స్త్రీ కారణంగానే తప్ప - ఇష్ట పడక పోవటానికి మరే కారణమూ ఉండదు.

అతని ఆంతర్యంలోని మరో చిత్రం ఏమిటంటే - అతను అపరిమితమైన వేదాంతి. అవాచ్యమూ అవాఙ్మన గోచరమూ అయిన మరో మహాశక్తి జీవితాన్ని నడుపు తుందని అతని నమ్మకం. బహుశా ఆ కారణంచేతనే అతను మహాగాయకుడు అయినాడేమో అనిపిస్తుంది.

త్యాగరాజస్వామి రచించిన కృతులు మోహనమూర్తి అనుభవిస్తూ ఆలాపిస్తాడు. శ్రీరామచంద్రుడు సీతా సమేతుడై అతని మానసిక నేత్రానికి కనిపించటం లేదుకదా అనిపిస్తుంది అప్పుడు- వింటున్న వాళ్ళకి.

భక్తిశృంగారాల భాండాగారంలోనించి కొల్లకొట్టు కుని వచ్చిన జయదేవ కవీంద్రుని అష్టపదులు - మోహన మూర్తి కంఠంలోనించి జాలువారుతుంటే జయదేవుడే ఇతడు అనిపిస్తుంది. శ్రవ్యంలోనుంచి దృశ్యం సృష్టించగలడు మోహనమూర్తి.

లీలాశుకులు, కాళిదాసు, భవభూతి, భారవి మొద లయిన మహాకవుల ఆక్రలూ-తాన్ సేన్ -త్యాగరాజు, బైజూ సైగల్ లాంటి మహాగాయకుల ఆంతర్యాలూ - దీక్షితులు శ్యామశాస్త్రి - అన్నమయ్య - క్షేత్రయ్య మున్నగువారి పవిత్రభావాలూ పెనవేసుకుని అతని సంగీతంగా ప్రవహి స్తున్నాయి. అంతేకాదు- నండూరి సుబ్బారావుగారి వెంకి పాటలూ-బసవరాజుగారి గీతాలు, విశ్వనాథ, వేదుల, శ్రీ. శ్రీ.

మొదలయినవారి వాక్యాలూ మోహనమూర్తి స్వరకల్పనలో కొత్తఅందాలు సంతరించుకున్నయ్.

సూరదాస్ - తులసీదాస్- మీరాదేవి మొదలయిన వారి గీతాలు సైగల్‌లా పంకజ మల్లికలా పాడగలడు మోహనమూర్తి అతను ప్రేమగీతాలు పాడుతుంటే స్త్రీలూ, భక్తి గీతాలు పాడుతుంటే భగవంతుడూ చలించకుండా ఉండలేరేమో అనిపిస్తుంది. జీవితంలో అతని ధ్యేయాలుకూడా వాళ్ళే.

స్త్రీ-భగవంతుడు వాళ్ళిద్దరే అతన్ని అర్థంచేసుకోగలరు అతని కోరికకూడా అదే. ఏకాంతచరియలోనో ఏకన్యాకుమారీఅగ్రింమీదో అతను ఉన్నప్పుడూ - అర్థరాత్రి నిరామయ గగనంలోని నీహారికలు అతన్ని ఆశ్చర్యపెట్టినప్పుడూ -అతని మానసిక ప్రపంచానికి చరాచరజగత్తు జడమైపోయినప్పుడూ అతను భగవంతుడినిగురించి గొంతు సారిస్తాడు. ఈవిచిత్రమైన జీవనలీలఅర్థాన్ని అన్వేషిస్తాడు. అతని ఆలాపన అతని పిలుపు ఆ సర్వాంతర్యామి వినిపించుకుంటాడనే అతను నమ్ముతాడు. పక్క-నెవరయినా అదృష్టవంతులుండి వినగలిగితే-అల్లరిపాటూ అపనిందలు అబ్బాయీ అయిన ఈ యువకుడు ఎంత ఉన్నతుడో అర్థంఅవుతుంది. అంతేకాదు; సౌందర్యవతి అయిన స్త్రీని చూసినా అతనిలోని కళా సరస్వతి భావ రాగ తాళ పరమ యోగ సమాధిలోనుంచి లేచినిలబడి ఆడుతుంది. అతను స్త్రీని ఆరాధిస్తాడు.

అతని ఆరాధని అపార్థంచేసుకున్నలోకం అపనిందలు వేస్తుంది. అయినా అతనికి లెక్క-లేదు. చిరునవ్వుతో వాటి

నన్నిటినీ విదిలించేసి తనమార్గాన తనునడుస్తాడు. అదే తన లోని ప్రత్యేకత.

"సౌందర్యంలేకపోతే సంగీతంలేదు. ఆసౌందర్యాన్ని ఆరాధించటం నాసంగీతానికి పరమావధి. మరి ఆసౌందర్యం ప్రకృతిలోనే ఇమిడిపోకుండా స్త్రీలోకూడా ఉండటం నాతప్పుకాదుగా" అనినవ్వుతూ సమాధానం ఇస్తాడు అతను.

వారిజ అతనిపాటని గ్రామఫోను రికార్డులోనూ రేడియో లోనూ చాలాసార్లు విన్నది. అతని రికార్డు ఏది విడుదల అయినా ఆమె కొంటూనేవుండేది. అతనిపాట ఆమెకు చాలా ఇష్టం.స్వయంగా గాయని అయిన వారిజకి అతనిలో ఎవరికీ కని పించని చిన్నలోటు ఒకటి కనిపించింది. సంప్రదాయంగా వస్తున్న శాస్త్రీయసంగీతం పాడుతున్నప్పుడుకూడా రాగాని కన్న భావానికే ప్రాధాన్యత ఇవ్వటం ఆమెకు అంతగా నచ్చలేదు

వారిజ ఒకప్రఖ్యాత తమిళ విద్వాంసుడిదగ్గర కర్ణాటక సంగీతం నేర్చుకుంది. ఆకారణంచేతనే ఆమె రాగానికీ స్వరంవేయటానికీ. ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది. మోహన మూర్తి సరిగ్గా దానికి వ్యతిరేకం.

ఒకసారి మంగళగిరి ట్రావెలర్సు బంగళాలో ఉన్నది వారిజ. ఆబంగళా కొండకి సగంలోఉంది సరిగ్గా ఒంటిగంటా రెండూసాయంత్రాల్లో 'తెరతీయగరాదా' అనే త్యాగరాజకృతి కొండమీదనుండి వినిపించింది. ఎండ పేల్చివేస్తున్నది. గుడి తలుపులు మూసేశారు - ఆచుట్టుపక్కల ఏన్నిటిలో చదక వచ్చిన

తనూ తనవంశ్మమనిషీ ఒకళ్ళిద్దరు బిచ్చగాళ్ళూ తప్ప మరెవరూ లేరు. కిందఉన్న కారులో డ్రైవరు నిద్రపోతున్నాడు.

జీవితంనుంచి పారిపోవాలని అనుక్షణమూ ఆరాటపడుతున్న వారిజకి ఆగానం ఎంతో తృప్తి అనిపించింది. కొన్ని క్షణాలు విన్నాక గొంతుగుర్తుకి వచ్చిందామెకి. ఉపాటే రికార్డు ఉంది తనదగ్గర. ఆ పాడుతున్నది మోహనమూర్తి. అజ్ఞాతంగా విజయవాడనగరంలో మామూలు బ్రతుకుతున్న తనకు, మోహనమూర్తికనిపించటం అసంభవం అనుకున్న తనకు అకస్మాత్తుగా ఈ మిట్టమధ్యాహ్నం మంగళగిరి పానకాలదొరగుడి ఆవరణలో అతను కనిపించటం చిత్రంగానే ఉంది. వారిజ నవ్వుకుని మెట్లెక్కటం ప్రారంభించింది.

తాళంవేసి ఉన్న గుడికెదురుగా పిట్టగోడనానుకొని మోహనమూర్తి పాడుతున్నాడు - అతనీ లోకంలో లేడు. వారిజ ముగ్ధురాలయి పోయింది.

దూరాన కొండ కిందుగా రావి చెట్టుకింద నిలబడిన తన కారుపక్కన మరో కారుఉంది - బహుశా ఇతనిదే కాబోలు అనుకొంది. కొంచెంసేపయినాక అతనొక్కడే ఆ గుడికి రాలేదనీ ఆ చిన్నఆవరణలో మరో అయిదారుగురున్నారనీ గ్రహించింది ఆమె.

తనలో విదేశీయుని రక్తం ప్రవహిస్తున్నది. అంతే కాదు. భారతీయసంస్కృతి అంటే తనకి అసహ్యం. భారతీయ సంస్కృతి పతితురాలైన తనతల్లిని రానీయలేదు. పాశ్చాత్యుడైన తనతండ్రిలోని ఉత్తమసంస్కారం తనతల్లిని దేవతలా ఆరాధించేట్లు చేసింది. ఒకప్పుడజ్ఞానంచేత తనుకూడా తల్లిని

అసహ్యించుకుంది. ఇప్పుడందుకు పశ్చాత్తాప పడుతున్నది. జీవితంనుంచి తనునేర్చుకున్న పాఠాలలో అదొకటి - అప్పై తను ఏనాడూ గుడికిగాని చర్చికిగాని వెళ్ళదు

కాని ఇప్పుడీ దేవాలయమూ దానిముందు నిమీలిత నేత్రాలతో పాడుతున్న మోహనమూర్తి తను ఎరుగని ఆధ్యాత్మిక ప్రపంచం తాలూకు తలుపులేవో తెరుచుకుంటు న్నట్లు అనిపించింది ఆమెకి.

పాటపూర్తి అయినాక కళ్ళు తెరిచాడు మోహన మూర్తి. ఎదురుకుండా లేత నీలంరంగులో మెరిసి పోతున్న అత్యద్భుత స్త్రీ - అతిలోక సుందరి వారిజ. తమాషాగా, ఉంది అనుకున్నాడు అతను. వారిజ నమస్కరించింది. అతను కూడా ప్రతినమస్కారం చేసి,

"క్షమించాలి-మీరెవరు? అని ప్రశ్నించాడు.

"నా పేరు వారిజ"

"విజయవాడ నగరానికున్న సమస్యలలో ఒకటైన వారిజ - బాగుంది" అనుకున్నాడు అతను.

"మీపాట విని వచ్చాను"

మోహనమూర్తి నవ్వాడు.

"మీరు భావాని కిచ్చిన ప్రాధాన్యత రాగాని కివ్వరు?"

ఈ మాట ఇదివరకు ఎవరూ అనక పోవటంచేత మోహనమూర్తి ఆశ్చర్య పోయినాడు. ఇంత చిత్రమైన స్త్రీ ఎక్కడా లేదు. ఈ పరమాద్భుత సౌందర్యవతికి పాట తెలుసా? అప్పుడప్పుడు సౌందర్యానికి సౌరభం కూడా

ఉంటుంది. కాని చాలా అరుదుగా ఉంటుంది. అతను మరో త్యాగరాజ కృతి ఆఖేరిలో ఎత్తుకుని స్వరంకన్న భావానికీ - భావానికన్న రాగానికీ ప్రాధాన్యత ఇస్తూ అరగంటసేపు పాడాడు.

ముగ్ధురాలయి పోయింది వారిజ. పాట ఆపి "ఇప్పు డెలాఉంది'' అని ప్రశ్నించాడ తను.

''అద్భుతంగా ఉంది. మీరు పాశ్చాత్య సంగీతం పాడతారా?'' అని అడిగింది వారిజ.

చికోవెన్ పాటా, యహూదీ మెనూహిన్ వయొలిన్ స్వర చిత్రాలూ నీగ్రోగాయనీ గాయకుల మధుర కంఠాలూ జ్ఞాపకంవచ్చి నల్లని ఛాయకీ సంగీతానికీ ఏదయినా సంబంధం ఉందా - అనిపించిం దతనికి. కోకిల దానికి గుర్తు అని నవ్వుకుని,

''అట్టే తెలియదు'' అన్నాడు. నిజానికి తెలియనిది ఏమీలేదు.

"నేర్చుకోండి" అంది వారిజ.

"ఇక్కడ నేర్పేవారు లేరండీ'' అన్నాడు మోహన మూర్తి.

"నేను నేర్పనా?''

''తప్పకుండా'' అన్నాడు మోహనమూర్తి, విషయం తనకి అనుకూలంగా పరిష్కార మైనందుకు సంతోషిస్తూ.

అది వారి మొదటి పరిచయం - తరువాత ఆరునెలలకి రెండో ఘట్టం జరిగింది.

నోట్సుచూస్తూ పియానో వాయిస్తున్నది వారిజ. పియానోని ఆనుకుని ఆ విచిత్రమైన స్వరగతుల్ని గమనిస్తు న్నాడు మోహనమూర్తి.

జలయంత్రంలా రంగురంగుల రాగాలని అటూ ఇటూ చింద కొడుతున్నది. పియానో - ఇటూ అటూ ఒరుగుతూ రెండు చేతులతోనూ వాయిస్తున్న వారిజని విచిత్రంగా చూస్తూన్నాడు అతను.

ఆఖరితడవ ఒక్కసారి అయిదారు మెట్లని నొక్కి - ఇంతవరకూ తను వాయిస్తున్న పాశ్చాత్య నృత్య గీతానికి చివరి మెరుగులు ఇచ్చింది వారిజ.

ఆమె లేచిన తరువాత అదే గీతాన్ని తు. చ. తప్ప కుండా వాయించాడు అతను. అదిచూసి ఆశ్చర్యం పట్టలేక అతని చేతిని తన రెండు చేతులలోకీ తీసుకుని "అద్భుతం" అన్నది ఆమె.

అది వారి మొదటి స్పర్శ.

తరువాత నాలుగు నెలలకి మూడో అంకం. ఒక పార్టీలో పూర్తిగా తాగివచ్చిన మోహనమూర్తి - తను వారిజని ఒట్టి ఆరాధించటమే కాకుండా ప్రేమిస్తున్నానని ఒప్పేసుకున్నాడు. వారిజ నవ్వుతూ ఊరుకుంది.

అప్పటినించి ఇద్దరూ ఒకరి నొకరు నువ్వంటే నువ్వు అనుకోటం ప్రారంభ మయింది. అంతర్గతమయిన దేహవాం ఛని ఇద్దరూ ఆపుకుంటున్నారు. చివరకి ఒకరినొకరు చూడ కుండా ఒక్క రోజు కూడా ఉండ లేని స్థితి వచ్చింది. వారిజ వ్యక్తిగత జీవితం గురించి అతనికి తెలిసింది ఇప్పుడే.

తను పెళ్ళయినవాడు. మతాంతరురాలూ జాతి భ్రష్టురాలూ అయిన ఈ యువతిని తను భార్యగా స్వీకరించలేడు. ఆమె తోనూ బ్రతకలేడు. రామలక్ష్మి అన్నట్లు చివరకి ఈ కథ విషాదాంతం అవుతుందా? తన కర్తవ్యం ఏమిటి? మోహన మూర్తికి మతి పోతున్నది.

* * *

"ఏమిటి డాక్టర్ అలా చూస్తున్నారు?"

ఆపరేషన్ పూర్తి అయిన తరువాత ఇంకా మత్తులో నుంచి కోలుకోని రోగిని చిత్రంగా చూస్తున్న డాక్టర్ సత్యనారాయణశాస్త్రిని ప్రశ్నించింది నర్సు కాత్యాయని.

"ఏంలేదు సిస్టర్ - మానవుడి శరీరంలో ఉన్న చైతన్యపు మీట కేవలం నాచేతుల్లోనే ఉన్నదా? - అని ఆలోచిస్తున్నాను" అని బేసిన్‌లో చేతులు కడుక్కున్నాడు శాస్త్రి.

ఆ ఆపరేషన్ థియేటరులోనుంచి ఇవతలకి వచ్చి అదే పనిగా అల్లుకు పోయిన మాలతీ తీగను చూస్తూ నుంచున్నాడు. సువాసన నింపుకున్న చిన్న చిన్న వెండిగిన్నెలు దాసిపూలు. వాటిలో కిన్నెర దొరసాన్లు విందు చేసుకుంటారు. విందుతరువాత ఆ బుట్టల్లోనే నిద్రపోతారు. నవ్వుకున్నాడు శాస్త్రి. కఠినమైన ఆపరేషన్ విజయవంతంగా ముగించిన ఆనందం అతనిలో స్పష్టంగా కనిపిస్తున్నది. ఒక పూలగుత్తి కోసుకుని డిస్పెన్సరీకీ నర్సింగ్ హోముకీ మధ్య ఉన్న తన ప్రైవేటు రూములోనికి వెళ్ళాడు అతను.

పడక కుర్చీలో పడుకుని సిగరెట్ వెలిగించిన శాస్త్రికి ఆ లేత నీలంరంగు పొగలోంచి వారిజ జ్ఞప్తికి వచ్చింది. తనలో తనే నవ్వుకుని "పిచ్చిపిల్ల" అనుకున్నాడు. ఆ సమయంలోనే కాఫీ తీసుకు వచ్చిన కాత్యాయని,

"ఏమిటి మీలో మీరే అలా నవ్వుకుంటున్నారు?" అని అడిగింది.

"వారిజ గుర్తుకి వచ్చింది" అన్నాడు కాఫీకప్పు నందుకుంటూ శాస్త్రి.

"మీరు సాక్షాత్తూ దేవుడు డాక్టర్!"

"ఎందుకని?"

"ఎవరికీ దగ్గరికి రావడానికీ ప్రియత్నించరు. దూరంగా పారిపోవటానికి అసలే ప్రియత్నించరు. వాళ్ళంతట వాళ్ళు దగ్గరికి వస్తే పొమ్మనరు. ఆపైన వరాలు కూడా ఇస్తారు. అందుకనే దేముడు అనిపిస్తుంది నాకు"

"వారిజని చూడాలనిపిస్తున్నది"

"కొత్తగా ఇదో ఆశ్చర్యం. మీకు అనిపించడాలు ఉన్నయ్యా అని - ఆమె వెళ్ళిన ఇంతకాలంనుంచీ నవ్వుతూ గడిపేస్తున్న మీకు హఠాత్తుగా ఆవిడ జ్ఞాపకం వచ్చిందే?"

"ఎందుకో తెలియదు. బహుశా ఆవిడ చిరునామా నీకు తెలిసే ఉంటుంది"

"తెలుసు. ఆనందంగా ఇస్తాను. మీరు సుఖంగా ఉంటటం కన్న నాకేం కావాలి డాక్టర్?" అని నిట్టూర్చింది కాత్యాయని,

శాస్త్రి నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"తాగుబోతూ అబద్ధాలకోరూ అయిన కాచివి నువ్వేనా అనిపించి"

"కారణంమీరే. గొంగళిపురుగుని సీతాకోక చిలుకని చేశారు"

"కాని ఈ సీతాకోక చిలుక ఎగర గలిగినంత ఎత్తుకి నేను ఎగరలేక పోతున్నాను ఇప్పుడు"

"సరే డాక్టర్! విజయవాడ ఎప్పుడు వెడుతున్నారు?"

"ఎందుకు?"

"ఇప్పుడేగా వారిజగారి ఎడ్రెసు అడిగారు?"

"చూద్దాంలే, అర్జంటు కేసులు బోలెడు ఉన్నాయి"

"మీ రెప్పుడూ ఇంతే"

"అంతే" అని నవ్వాడు శాస్త్రి.

"నామాట వినండి డాక్టర్! ఒకసారి వెళ్ళి వారిజని చూసి రండి" అన్నది కాత్యాయని.

శాస్త్రి ఆమెను ఆ ప్రసక్తినుంచి మరిపించాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూ,

"దాహం అవుతోంది కాత్యాయనీ" అన్నాడు.

"కాఫీ తాగి అయిదు నిమిషాలుకూడా కాలేదు" అన్నది అతని ప్రయత్నాన్ని గ్రహించిన కాత్యాయని.

"కాని ఈ దాహం చిత్రమైనది. యుగయుగాలుగా_ వికృతమైన లాలసలతో తపించి పోతూ - అర్థంలేని అతృప్త నీచవాంఛలతో అలమటించి పోతున్న మానవుడి నెత్రి

దాహం. ఇది కాఫీతో తీరదు కాత్యాయనీ" అన్నాడు శాస్త్రి.

"డాక్టర్! మీరు అమృతాన్ని పిల్లికి పోస్తున్నారు" అన్నది కాత్యాయని నిట్టూరుస్తూ.

"లేదు. ఈ లోకంలో నీలాటి స్త్రీ నాకెక్కడా కనిపించలేదు. నీకు అసూయలేదు. అస్తవ్యస్తమైన అభిమానపు ఇనపతెరలమధ్య ఊపిరాడకుండా చేయటం చేతకాదు. నీవు గొప్పదానివి కాచీ"

శాస్త్రి అన్న ఆ మాటలు ఆమెకు ఒక విధమైన తృప్తినీ - అంతకంటే ఉన్నతమూ రహస్య మయమూ అయిన ఏదో విచిత్రానుభూతినీ కలిగించినయ్. ఊబిలో కూరుకుని ఇంకా ఇంకా కూరుకు పోతున్న వ్యక్తికి అకస్మాత్తుగా దొరికిన చేయూతలాగా ఉన్నది ఆమాట. పసితనం నుంచీ మొన్నటి దాకా జరిగిన జీవితపు తాళపత్రి గ్రంథాన్ని కట్టకట్టి అటకమీద పారేసింది ఆమె. అప్రియాలూ, పిశాచ సదృశాలూ అయిన పాత అనుభవాలు నిద్రలేస్తాయేమో అనే భయంచేత వాటిని తాకటానికి కూడా భయపడుతోంది. తను ఎత్తిన జన్మలలో ఇది మూడోది - మొదట ఇల్లాలు - తల్లి, ధర్మ సమ్మతమైన పద్ధతిలో జీవిస్తున్న మామూలు స్త్రీ.

తరువాత ఆ అదృష్టాన్నుంచి వంచిత- త్రాగుబోతు, వ్యభిచారిణి, పొట్టకూటికోసం నర్సు. మూడోది మళ్ళీ వివాహం, మాతృత్వం. కాని ఆ వివాహం ఆ మాతృత్వం కూడా ధర్మ సమ్మతమైనవి కావు. అయినా తన సుఖానికి

లోపంలేదు. కాని తను గొప్పదానిననీ తనలో ఏవో ప్రత్యే కతలున్నాయని తనేనాడూ అనుకోలేదు.

ఈ అన్నికష్టాల మధ్య కూడా తనలో జీవనలాలస ఎంత మాత్రమూ తగ్గలేదు సరికదా హెచ్చిందేమో కూడా. తనుభగవంతుడిగా భావిస్తున్న ఉత్తమపురుషుడికి ఆత్మార్పణ చేసిన తరువాతనే ఈ లాలస - జీవ శోషకమైన దుస్వప్నం కాదనీ, ప్రకాశ వంతమూ శాశ్వతమూ అయిన అమృత యోగమనీ-ఆమెకు అర్థంఅయింది.ఇప్పుడు ఇన్నాళ్ళతరువాత డాక్టరు అన్న ఈమాట మరుభూమిలో పిల్లగాలిలా ఉంది.

"డాక్టర్ మీరు అన్న ఈమాట నా జీవితగమనాన్నే మార్చింది. ఇదివరకు చేయటానికి భయపడుతున్న కొన్ని పనుల్ని ఇప్పుడు ధైర్యంగా చేయగలను" అని నవ్వింది ఆమె.

శాస్త్రి ఆలోచించటం ప్రారంభించాడు "ఈస్త్రీ అంతర్యంలోని ఏ కోమల ప్రదేశాన్ని తను స్పృశించ కలిగాడో తనకు తెలుసు. కాని ఇంత కృతజ్ఞత తనుభరించలేడు.

ఇంతకాలానికి తన నిరర్థక జీవితంలో సత్యమైన సాఫ ల్యత గోచరించిందతనికి. ఆమెవల్ల తనకి కలుగుతున్న ఆనం దం కేవలం శరీరానికి సంబధించినదేకాదు. హృదయం, ఆత్మ బుద్ధి - శరీరం - సమస్తం ఒకఅపూర్వమైన ప్రకంపనాలతో కల్లోలమవుతున్నదని నేడే మొదటిసారిగాగ్రహించాడు శాస్త్రి.

అవివాహితగా ఉన్నప్పుడు ఒకసారి తనని స్పృశిం చాడు శాస్త్రి. ఇప్పుడు తను వివాహిత. ఒక బిడ్డతల్లి. కాత్యా యని శాస్త్రి పాదాలమీద వాలిపోయింది.

* * *

అననుభూతమైన ఒకవిచిత్రవేదన మోహనమూర్తిని బాధిస్తున్నది. తనచుట్టూఉన్న రహస్యపుపొరలన్నిటినీ ఒక్కసారి నలిచివేసి తన నిజస్వరూపం ఎందుకు చూపించదువారిజ?

తీరా నలిచివేస్తే మిగిలేది శూన్యంకాదుకదా? అయినా అయిఉండవచ్చును.

ఒకపార్టీలో పూర్తిగా బీరుపట్టించి వస్తున్నాడు. వారిజ ఇంటికివెళ్ళే కొండపక్కగా తూలుతూ నడుస్తున్న అతనిని ఒక విధమైన మంచునిషా ఆవహించింది. ఆ నిషాతోనే అతను గేటు తీసుకొని లోపలికి వెళ్ళాడు తను ఎందుకు వెడుతున్నాడో ఎందుకోసం వెడుతున్నాడో తెలియదు.

తూలుతూపోయి పియానో దగ్గర కూలబడి ఒక పాశ్చాత్య గీతం వాయించటం ప్రారంభించాడు. తనకి కొంత తెలుసు వ్యక్తి మానసిక స్తితిని బట్టి నిషాయొక్క ఆకారం రకరకాలుగా మారుతూ ఉంటుందని. తన స్తితికి తనే నవ్వుకుని మరింత ఉషారుగా వాయించటం ప్రారంభించాడు అతను.

"జిజ్జూ!"

"ఏమిటి?"

"ఈజు అంత ఉషారుగా ఉన్నావేమిటి?"

"తాగాను వారిజా. ఆ సంతోషంలో నా ఊహాలని గీతాలుగా వాయిస్తున్నాను" అని నవ్వాడు మోహనమూర్తి.

చాలా సేపటివరకూ వారిజ అతని వేపే చూస్తూ నిలబడింది. స్నిగ్ధమూ మోహనమూ అయిన చూపులతో ఆ

మహాగాయకుడిని - మత్తులో కూడా మనోహర గీతాలు లయతప్పకుండా వాయిస్తున్న ఆ మహోత్తమ కళాకారుడిని చూస్తూంటే ఆమె అంతర్యానికి గిలిగింతలుగా ఉంది. ఆమె సుందర నేత్రాలు ఏదో సుఖానుభూతి యొక్క తలపుతో తళుక్కు-మన్నాయి.

రకరకాల గాలి బుడగల్లా ఎగిరే ఆమె ఆలోచన లిప్పుడు ఒకే పరిధిలో నియమానుసారంగా తిరగటం ప్రారంభించినయ్. గత జీవితంలోని ఒక ప్రధాన సంఘటన గుర్తుకి వచ్చింది. ఇన్ని సంవత్సరాలనుంచీ తెలిసో - తెలియకో తన స్థితికి తనే కృంగిపోతున్న వారిజకి తన హృదయంలో ఏమూలో అణగిపడి ఉన్న నారీత్వం ఒక్కసారి జాగృతమై

'నీవు గడిచిన బ్రతుకులో నీచుట్టూ అల్లుకు పోయిన ఇనప తీగల చిక్కు-నుంచి బయట పడటానికి ఎందుకు ప్రయత్నించవు? అడుగడుగునా శాస్త్రిని జ్ఞాపకం చేసుకోటంలో అర్థంలేదు. అతను ఈ జీవితంలో నీవాడు కాలేడు.'

ఆ అనుభవాల ముళ్ళను నీకాళ్ళనుంచి తీసివేసి మహా వేగంతో జీవన నృత్యం ప్రారంభించు. జీవితంతో ఏమాత్రం అయినా సంబంధం పెట్టుకోవాలని నువ్వు కోరేట్లయితే నీ జీవన వలయంలోకి వచ్చిన ఈ మహావ్యక్తిని నీవాడిని చేసుకో. అలా అయితేనే నీ అనిశ్చిత జీవితంలో, ఒక ఆనందం లభిస్తుంది.' అని చెప్పినట్లనిపించింది ఆమెకు.

కొత్తగా కలిగిన ఆ సంజీవనీ మాధుర్యం తాలూకు మోహం వలన ప్రబోధిత అయిన వారిజ మోహనమూర్తి ఒడిలో కూర్చుని అతని కంఠాన్ని పెనవేసుకుంది.

వారిజ ఈ చర్యవలన మోహనమూర్తి నిషా మరింత ఎక్కువ అయింది. అతనిలో నిండిపోయిన గులాబీ నిషా వారిజ చెక్కిళ్ళలోకి ప్రవహించి వాటిని రాగరంజితం చేసింది. ఈ పనివల్ల తనశరీరమే ఉద్రిక్త మవుతోంది కాని-మనస్సు మామూలుగానే ఉందని గ్రహించిన వారిజ ఆశ్చర్య పోయింది. ఎందుకీ ఆత్మవంచన?

తను మోహనమూర్తిని ప్రేమిస్తున్నది. అభిమానిస్తున్నది. కాని దగ్గరగా పోలేక పోతున్నది. జ్వర పీడితుడైన రోగి తీయనిమందు త్రాగినట్లున్న ఈ మోహం తన అంతర్యంలో నుంచి రావటం లేదు.

తన ఒడిలోంచి ఒక్క ఉదుటున లేచిపోయిన వారిజని చూసి తనలో తనే నవ్వుకుని - 'వారిజా! నీకన్న త్రాగుడే నాకు ఆనందాన్ని కలిగిస్తున్నది' అనుకున్నాడు మోహనమూర్తి.

"స్త్రీలకన్న బీరుసీసాలే నయం" అని తనలో తను గొణుక్కుని పియానోమీద ఒక ఉజ్వల ప్రేమగీతం వాయించటం ప్రారంభించాడు అతను.

మోహనమూర్తి ఒడిలోంచి పారిపోయి వచ్చిన వారిజ బజారు గేటుని ఆనుకు నిలబడింది.

'వెన్నెల తీగలు పట్టుకుని జారి రాలిన దేవకన్యలా ఉన్న ఆ స్త్రీని అక్కడ ఎవరైనా చూస్తే తప్పకుండా భయపడతారు. ఈ అలౌకిక సుందరి ఏ భూతమో అని పిస్తుంది. కాని,సజీవురాలైన మానవస్త్రీ అనిపించదు.

క్షితిజరేఖమీద నిలబడి - విశ్వాంతరాళంలోకి తొంగి చూస్తున్నట్లు ఉన్నది ఆమె. అక్కడ అంతా అంధకారం. నిరామయమైన ఆ మహా శూన్యంలో తను ఎవరు? తనస్థానమేమిటి? తనకు మిగిలేదేమిటి? - అర్ధరహితమైన ఈ జీవితానికి గమ్యం ఎక్కడ? తెంపులేని ఈ జీవన యానంలో తనకి తోడు ఎవరు!

అనంత గగనంలో అటూ ఇటూ దూసుకు పోతున్న ఉల్కల మాదిరిగా ఆమెనీ ప్రశ్నలు పీడిస్తున్నయ్.

పొరపాటు చేసిన తల్లి - విదేశీయుడైన తండ్రి - తన మదరాసు జీవితం - మహాపురుషుడు శాస్త్రి - అనివార్య కారణాల చేత అతని నుండి తను పారి పోయి రావటం - ఆ తరువాత కొన్నాళ్ళ స్తబ్ధత - మోహనమూర్తి పరిచయం - అది ఆత్మవంచనగా పరిణమించటం - బ్రతుకు ఆల్బంలో రకరకాల ఫొటోలు తనకుకావలసిన వ్యక్తి శాస్త్రిగాని మోహనమూర్తి కాదు. మోహనమూర్తి-మోహనరాగం - మోహం ఈ మూడూ తనకి ఇష్టం - అంతే-అంతకన్న మరేంలేదు.

కాని తనకి కావాల్సింది వేరు - తను పొంద కల్గుతున్నది వేరు. శాస్త్రి కావాలి - నీతి అవినీతుల మిథ్యా మోహం నుంచి తను ఒక్కసారి బయట పడి శాస్త్రిని పొందాలి." అంతకన్న గత్యంతరం లేదు. అతను పురుషుడు, తను స్త్రీ. అన్వేషణే నిరంతర కార్యక్రమంగా భావించి పరిభ్రమిస్తున్న యుగయుగాల స్త్రీత్వపు రూపం - పురుషుడి హృదయోద్యానవనంలోని సజీవ సాలభంజిక.

అవినీతి కానీ అక్రమంకానీ తను శాస్త్రి లేకుండా జీవించలేదు. ఈ నిశ్చయానికి వచ్చిన మరుక్షణం వారిజకి ఎంతో శాంతి లభించింది.

. సరిగా అదే సమయంలో విజయవాడలో రైలు దిగాడు డాక్టర్ సత్యనారాయణశాస్త్రి - కాత్యాయని వ్రాసి ఇచ్చిన చిరునామా మరోసారి చదువుకుని రిక్షా ఎక్కాడు.

గేటు నానుకుని ఆలోచిస్తున్న వారిజ రిక్షా ఆగటం చూడనే లేదు. కొంచం సేపయిన తరువాత తనముందు ఎవరో నిలబడి ఉన్నట్లు తోచి తన ఆలోచనా ఉరులలోంచి బయటపడి పరీక్షగా చూసింది ఆమె.

అంతే. తుపానులో దీపకళికలా ఊగి ఊగి - ఆ దుమ్ములో శాస్త్రి పాదాలమీద అచేతనంగా పడిపోయింది ఆమె.

మోహనమూర్తి వాయిస్తున్న ఉజ్వల ప్రేమగీతం సాగిపోతూనే ఉంది.

* * *

రామలక్ష్మి ఇంటిముందు పూలమొక్కల మధ్య మోహనమూర్తి పచార్లు చేస్తున్నాడు. గేటు తీసుకుని లోపలకు వస్తున్న రామలక్ష్మికి ఎదురుగా పోయి-

"లక్ష్మీ! గంటనించి నీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు ఆదుర్దాగా.

"ఏం కథ!" అని నవ్వుతూ ప్రశ్నించింది రామలక్ష్మి.

"కావల్సినంత - ముందు నాళ్ళ అవశిష్టాలు తీర్చు

కునిరా" అని అక్కడే ఉన్న పేము కుర్చీమీద కూల బడ్డాడు అతను.

కొంచెం సేపయినాక పేముకుర్చీలో విశ్రాంతిగా కూర్చుని కాఫీ తాగుతూ "ఇప్పుడు చెప్పు-ఏమిటి సంగతి?" అన్నది రామలక్ష్మి.

"ఏమీ లేదు. రాత్రి శాస్త్రిగారు వచ్చారు."

"నిజంగా!" ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి ప్రశ్నిం చింది రామలక్ష్మి. అవునన్నట్లు తల ఊపాడు మోహన మూర్తి.

"చాలా చిత్రం. ఇన్నేళ్ళ తరువాత వాళ్ళిద్దరూ తిరిగి కలుసుకోవటం... ఇంతకీ ఏంజరిగింది?" అన్నది కాఫీ కప్పు క్రింద పెట్టి రామలక్ష్మి.

"ఏంజరిగిందీ తెలియదు"

"ఏం జరిగిందీ తెలియదూ? నువ్వీలోకంలో ఉన్నావా?"

"నిజం చెప్పాలంటే నిన్న ఈ లోకంలో లేను రెండు సీసాలు బీరు తాగి ప్రేమగీతాలు వాయించాను"

"మంచిపని చేశావు. ఇంతకూ శాస్త్రిగారు ఉన్నారా?"

"అన్నట్లు నువ్వుకూడా ఆయుని ప్రేమిస్తున్నావు కాబోలు" అని నవ్వాడు మోహనమూర్తి.

"అంత అదృష్టం నాకు లేదులే. ఇప్పుడింతకూ నువ్వు అసూయ పడుతున్నావా, ఏమిటి?"

"నాకే భావమూ కలగటంలేదు లక్ష్మీ! ఏదో ఒక అనుభూతి, ఏదో ఒక స్పందనం కలిగితే బాగుండు ననిపిస్తున్నది. కాని ఉగ్గ పిడకల గుడిసెలా ఉంది మనసు"

"దీన్నిబట్టి చూస్తుంటే మీ ఇద్దరూకూడా ఇంత కాలంనుంచీ భ్రమిస్తున్నారా? అనిపిస్తున్నది నాకు"

"అలా అనటానికీ వీలులేదు. వారిజ లేకుండా నేను జీవించలేనేమో! అనిపిస్తున్నది నాకు"

"వారిజతోనూ జీవించ లేవేమో అనిపిస్తున్నది నాకు"

"ప్రేమలేకుండా వైవాహికజీవితం సాధ్యమయినప్పుడు - వివాహం లేకుండా ప్రేమజీవితం ఎందుకు సాధ్యం కాదు!"

"అంటే నీ వుద్దేశ్యం? వారిజని పూర్తిగా నీతోటలో నాటకుండా ఆమె తోటలోనేఉంచి అవసరంఅయినప్పుడు అక్కడికే వెళ్ళి ఆనందించటం మంచిదనా?"

"అంత కటువుగా మాట్లాడకు లక్ష్మీ!"

"నిజం కటువుగానేవుంటుంది మూర్తీ. ఒక్కసంగతి చెబుతా విను. వారిజలాంటి జ్వాలాగ్నిని సముద్రంలాంటిశాస్త్రి మాత్రమే భరించగలడు. కళాకారుడివీ ప్రమాదంలేని బీరు తాగేవాడివీ నీకు ఆ అగ్నిని సహించేస్థైర్యం లేదేమో అనిపిస్తుంది నాకు"

"కాని..."

"కానీలేదు, నా మొహంలేదు... నిన్ను భయపెట్టాలని గాని, నీలో పిరికితనాన్ని జాగృతం చేద్దామనిగాని నేను అను

కోటంలేదు. నీవు కళని ప్రేమించినంత తీక్షణంగా మరేక దేన్నీ ప్రేమించలేవు. కళామూర్తిఅయినస్త్రీ నిన్నాకర్షస్తుంది, నిజమే. కాని ఆమెలోని కళకే ప్రాధాన్యంఇచ్చి స్త్రీత్వాన్ని అలక్ష్యం చేస్తావు నువ్వు. అది తప్పనికూడా అనబోవటంలేదు నేను. కాని స్త్రీ తన స్త్రీత్వానికే ప్రాధాన్యం ఇవ్వటంవలన తనని అలక్ష్యం చేస్తున్నావనే అనుమానంపెంచుకుని ఆత్మార్పణ చేయటానికి భయపడుతుంది. అక్కడే దెబ్బతింటున్నావు నువ్వు"

"కావచ్చును. అంతమాత్రంచేత ఇంతవ్యథ సహించాల్సి రావటం- చిన్ననేరానికి ఘోరమైన శిక్ష లక్ష్మీ"

"నిప్పు తెలిసి ముట్టుకున్నా కాలుతుంది - తెలియక ముట్టుకున్నా కాలుతుంది. నేరంకూడా అంతేనేమో, అని పిస్తుంది నాకు"

"అంతకటువుగా ఏడిపించకపోతే కొంచెం సానుభూతి ఇవ్వరాదూ!"

"సానుభూతా? దేనికి? పెళ్ళికానప్పుడు భవిష్యత్ జీవితాన్ని, పెళ్ళిఅయినతరువాత గతజీవితాన్ని తల్చుకుంటూ వర్తమానాన్ని నరకప్రాయం చేసుకోటం మగజాతికి అలవాటు. ఆనువంశికంగా వస్తున్న ఆ అలవాటుకి సానుభూతి సూచించటం శుద్ధఅనవసరం"

"వర్తమానంలోని ఆడవాళ్ళు ఇలా అఘోరించబట్టే గతాన్నీ భవిష్యత్‌నీ తల్చుకుని కుమిలిపోవటం" అన్నాడు కోపంగా మోహనమూర్తి.

రామలక్ష్మి పకపకానవ్వి "పద- వారిజగార్ని, శాస్త్రి గార్ని చూసివద్దాం" అనిలేచింది.

మోహనమూర్తి మొహం మటమటలాడించుకొంటూ ఆమెని అనుసరించి వీధిలోకి వచ్చాడు.

*　　*　　*

జీవితంలోని సమస్త బాధలనుంచీ - భయ సందేహాల నుంచీ - తప్పించుకున్నట్లుగా ఉంది వారిజ. మంచంమీద కుడిచేతిపైన తల మోపుచేసి ఒత్తిగిలి పడుకునుంది ఆమె.

ఆ మంచం పక్కనే ఉన్న పడకకుర్చీలో పడుకుని సిగరెట్ కాలుస్తున్నాడు శాస్త్రి. సింహం కళ్ళలా కోసుగా ఉండే అతని కళ్ళు అరమోడ్పులుగా ఉన్నయ్.

"ఏదయినా ఒక ఆశ్చర్య కరమైన పనికి అంతకంటె ఆశ్చర్యకరమైన కారణం ఒకటి ఉండి తీరుతుంది. అయినా ఇప్పుడు నేనా కారణాన్ని గురించి నిన్ను అడగబోవటం లేదు" అన్నాడు శాస్త్రి సిగరెట్‌కి కట్టిన కొడి విదిలిస్తూ.

"ఆ కారణం ఏమిటో నువ్వడిగినా నేను చెప్పలేల్చు కోలేదు. కాని ఇంతకాలమూ నువ్వు లేకుండా బ్రతకటానికి ప్రయత్నించాను. కాని అది అసాధ్యమనిపిస్తున్నది ఇప్పుడు" అని నిట్టూర్చింది వారిజ.

"ఆ సంగతి నాకూ తెలుసు వారిజా! కేవలం నీమీద ఉండే వాత్సల్యం చేత ఒక మాట చెపుతాను. నాతో నీకు సుఖం లేదు. నన్నడిగితే ఎవరినయినా పెళ్ళిచేసుకోటంమంచి దనుకుంటాను" శాస్త్రి సందేహిస్తూ అన్న ఈ మాటలకి వారిజ పకపకా నవ్వటం ప్రారంభించింది.

"ఎందుకు అంత నవ్వు?"

"లేకపోతే ఏమిటిచెప్పు – ఈ మాట చెప్పటానికేనా! నువ్విప్పుడు వచ్చింది?"

శాస్త్రి మనసులోని ఆకాంక్షా తంత్రుల్ని తిరిగి మరొకసారి బిగించి వాటిమీద మోహనరాగాన్ని ఆలాపించింది వారిజ.

అతనికి చక్రపరివేషమంతా యేదో ఆశ్చర్యార్థకంగా కనిపిస్తున్నది. ఒకప్పుడు సాధారణంగా – మరొకప్పుడు మనో మోహనంగా – ఇంకొకప్పుడు రహస్యమయిగా ఉన్న వారిజ ఒకవిధమైన విచిత్రమోహంలో అతని సమస్త శరీరాన్ని ఆత్మనూకూడా ముంచెత్తున్నది. చాలాకోజులనుంచీ అజ్ఞాత రూపంలో అణగిఉన్న పిపాస ఆమె మాటలవల్ల అధికమై ఉద్రిక్తమై పోయింది.

వేకనా హాసమయమైన ఆమెముఖంలో అపూర్వ సౌందర్యం శాస్త్రి కళ్ళముందు ఒక్కసారి గుప్పుమంది.

"ఇన్నాళ్ళనుంచీ ఈమెను చూడలేదు. నా అంత ర్యాన్ని చీల్చుకుని లోపల తన వ్యక్తిత్వాన్ని నాటిన ఈ వారిజని ఇదివరకు ఎరుగను" అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?

ఏమీలేదు. స్త్రీ అంటే కల్లుతో నింపిన మట్టికుండ – అని ఎవరో అన్నమాట జ్ఞాపకం వచ్చింది. కాని ఆ కల్లే రెండు గుక్కలు కూడా తాగలేని స్థితిలో ఉన్న – మానవుడికి ఇంత భ్రమ ఎలా కలుగుతున్నది!"

"అంటే!"

"ఏం లేదు వారిజా! ఇప్పట్లో ప్రపంచంలోని ప్రతి విషయం విసుగ్గానే ఉంది నాకు. లోకంలోని ప్రతిమనిషీ - ప్రకృతిలోని ప్రతి దృశ్యమూ - బ్రతుకులోని ప్రతి విషయం అర్థ రహితంగా హీనంగా - నిస్సారంగా కనిపిస్తున్నాయ్"

"శాస్త్రీ!"

"అవును వారిజా! అజ్ఞానంలో బ్రతుకుతున్న మన జీవితాల్లో ఎండ మావులలాటి భ్రమలూ-నీహారికలలాటి ఖాళీప్రదేశాలూ తప్ప మరేమీ లేవు. ప్రపంచంలోని ప్రతి మనిషీ ఎందుకోసం జీవిస్తున్నారో అర్థంకాదు."

"వైద్యుడివి - వేదాంతివి అవుతున్నావా ఏమిటి?"

"తప్పకుండాను - మన మునులూ తత్వవేత్తలూ ఏనాడో చెప్పేశారు."

"ఏమని?"

"ప్రపంచం అంతా భ్రమలోపడి బ్రతుకుతున్నదని- నేను ఇంటర్మీడియేటు చదువుతుండగా కొన్ని వేదాంత గ్రంధాలు చదువుతూ ఉండేవాడిని. తమాషా ఏమిటంటే అప్పుడవి చదువుతూ ఉంటే జీవితంఅంటే విరక్తికి బదులుగా కుతూహలం పుట్టేది. దాని అసలు పరమార్థం ఇప్పుడు అర్థం అవుతోంది."

"అంటే నువ్వు భగవంతుడిని నమ్ముతున్నావా?"

"నమ్మక తప్పదు. అన్నిటికంటే చిత్రం ఏమిటంటే; ఆ భగవంతుడిని ఎలా జ్ఞానంలో తెలుసుకోలేక పోవటం,

ఇప్పటికీ అర్థంలేని సంశయ-విశ్వాసాలతో నా ఆత్మ నిండి పోయే ఉంది."

"అంటే శాస్త్రీ! ఈ సమస్త విశ్వచలనానికీ వెనకాల ఏదో సైకానుశక్తి పనిచేస్తున్నది" అని నిట్టూర్చింది వారిజ.

"ఈ మధ్య నాకో కల వచ్చింది. ఉండి ఉండి నా గుండె ఏదో పాతాళంలోకి పడిపోతున్నట్లనిపించింది. శరీరంలో ఏవో ధ్వని తరంగాలు ఉత్పన్న మయినయి. చావు అంటే ఇదేకాబోలు అనిపించింది. అనంత శూన్యంలోంచి మహావేగంగా కిందపడిపోతున్నాను. వారిజా! అప్పుడు నేనేం చేశానో చెపితే నమ్ముతావా?"

"ఏం చేశావు?"

"అత్యంత ఆధునికుడూ, జీవ-పరిణామ - మానసిక శాస్త్రాలలో నిపుణుడైన గొప్ప డాక్టరూ చేసిఉండకూడని పని చేశాను - అంటే దేవుడిని ప్రార్థించాను."

వారిజ నవ్వింది.

"కేవలం కొన్నిక్షణాలు మాత్రమే ఈ పరిస్థితి ఉండి ఉంటుంది. ఈలోగా నేను పాతాళంలోనుంచి చైతన్యంలోకి లేవనెత్తబడ్డాను. ఏదో అజ్ఞాతశక్తి పరిశుద్ధమూ పరమానంద పూరితమూ అయిన దివ్యలోకంలో తిప్పితీసుకువచ్చి-ఈ అతి మామూలు పాడులోకంలోకి పారేసినట్లు అనిపించింది. కొంచెంసేపు అలాగే పడుకుని ఉన్నాను. ఇది నమ్మే విషయం కాదు. అయినా విను-ఆ తరువాత అంతర్యలో ఒక అపూర్వ జ్యోతి ఏదో వెలిగింది - చావుకి సంబంధించిన ఒక రహస్య మార్గం నాకు తెలిసినట్లుగా ఉంది"

"ఏమిటి నువ్వంటున్నది?"

"ఏం లేదు. ఇంత అందమయినది మరణమే కనుక అయితే పాతరులక మంచాన్ని అంటిపెట్టుకున్న వల్లిలాగా ప్రాణం ఈ జీవితాన్నెందుకు అంటిపెట్టుకుని ఉంటుందో నాకు బోధపడటంలేదు" అన్నాడు శాస్త్రి.

"నువ్వు చెప్పేది తమాషాగా ఉంది శాస్త్రీ!"

"కాని వారిజా! ఆ అనుభవం ఒక విచిత్రమైనది. అదలా ఉండను - ప్రస్తుతం ఈ ప్రపంచ చక్రం తన రకరకాల రంగులతో అ న జాలంలో నన్ను నేను చిక్కించుకోటమా; లేక నాలో మిలిచిఉన్న స్వల్పచైతన్యం వలన నాలోకి నేను ఇమిడి పోవటమా? - అన్నది సమస్యగా ఉంది."

"నువ్వు మాట్లాడేది అగాధమూ గంభీరమూ అయిన మరేదో మహత్తర విషయం.- అది నాకు అంతు బట్టటంలేదు శాస్త్రీ!"

"కాని నేను వాస్తవికతను ఎంత నిర్లక్ష్యంచేసినా - నా మనస్సుమాత్రం యీ జాలంలో ఇరుక్కోడంలేదు. నా లాంటి అతి మానవుడిని బంధనాలలో ఉంచటం అంత తేలికా కాదు; క్షేమమూ కాదు."

"నానుంచి నీవు వెళ్ళిపోతావా?" అని ఆదుర్దాగా ప్రశ్నించింది వారిజ.

గాఢాంధకారంలో ఇంతసేపటినుంచీఉన్న ఆమె మనో నేత్రాలు హఠాత్తుగా తెరుచుకొన్నాయ్. మంత్రముగ్ధురాలి లాగా అప్పటివరకూ శాస్త్రిమాటలు వింటున్న ఆమెకు ఏదో చిరంతన సత్యం లీలగా గోచరించినట్లయింది. శాస్త్రి తనని

విడిచిపెట్టి పారిపోవాలని చూస్తున్నాడు. ఇన్నాళ్ళనుంచీ తను చేసిన ఈ పనికి ఇది శిక్ష కాదుగదా?

"శాస్త్రీ! నువ్వు పారిపోవాలనే ఉద్దేశ్యంతో నాకీ వేదాంతబోధ ప్రారంభించావు. ఏమైనా సరే నువ్వు వెళ్ళటానికి వీలులేదు'' అన్నది వారిజ.

కిటికీలోంచి వచ్చే పిల్లగాలికి ఆమె జుట్టు ఎగురుతున్నది. అవ్యక్తమైన మధుర వేదనతో పులకితురాలైనట్లుంది ఆమె. అత్యంత సుందరమూ స్వాభావికమూ అయిన వారిజ రూపం చూసి అప్పుడే కొత్తగా చూస్తున్నట్లు ఆశ్చర్యపోయినాడు శాస్త్రి.

"వారిజ వాస్తవిక రూపం ఇదే-ఇదివరకు నేను చూసిన రకరకాల రూపాలన్నీ నా మస్తిష్కపు అర్థహీన కల్పనలు మాత్రమే'' అనుకొన్నాడు అతను. ఆ ఆలోచనల అశ్రుత రాగతరంగాల లయతాళాలలో అతని సమస్త చైతన్యం నిద్రితమైనట్లనిపించింది.

"మాట్లాడవేం? నువ్వు నన్ను వదలిపెట్టి వెళ్ళిపోతావు కదూ?... నేనుఉన్నచోట శాంతీ సుఖమూ ఉండదుకదూ?'' ఉన్మాదినిలాగా తిరిగి ప్రశ్నించింది వారిజ.

అజ్ఞాత మధురమైన వేదనాగ్నిలో ఆ ఇరువురి హృదయాలూ కరిగి ఒకే మూస పోసుకుంటున్నయ్. వారిజ ప్రశ్నకు శాస్త్రి జవాబు చెప్పలేదు.

"మోహనమూర్తి మీద నీకు ఈర్ష్యగా లేదు కద?'' అని అనుమానిస్తూనే ప్రశ్నించింది వారిజ. శాస్త్రి ఆ ప్రశ్నకి ఉలిక్కిపడ్డాడు. కొంచెంసేపు సమాధానం ఇవ్వలేదు. తరువాత

"అసూయ అనేది నా ప్రకృతికి విరుద్ధం అని తెలిసి కూడా ఈ ప్రశ్న ఎందుకు అడిగావో నాకు అర్థం కావటం లేదు" అన్నాడు.

"క్షమించు శాస్త్రీ! పొరపాటులే" అన్నది వారిజ. ఆమె లేచివచ్చి శాస్త్రి పాదాలవద్ద నిశ్శబ్దంగా కూర్చుంది.

మధురవేదనా పూర్ణమైన ఆనాటి అనుభూతులు తిరిగీ ఇద్దరికీ జ్ఞాపకం వచ్చినయ్. అనుభవ శూన్యమైన ఆనాటి యౌవన నవలతిక తిరిగి ఇన్నాళ్ళకు చిగిర్చినట్లనిపించింది. ఏదో అననుభూతమైన అజ్ఞాత సౌందర్యం వారి పూర్వ జీవితానికి గల సౌరభాన్ని తిరిగీ చైతన్యవంతం చేసింది.

ఈ నూతన రసవాహిని వారి అంతరాత్మలలో ఒక విధమైన రోజా మత్తుకలిగించింది. ఆ నిషా రుచి చూసిన తరువాత వారికి తెలియకుండానే వారి చుట్టూ ఒక వెన్నెల వలయం అల్లుకుపోసాగింది.

నిష్కల్మషమూ ఆనందమయమూ అయిన వాహినీ మాధుర్యం వారిని తిరిగీ ఆవహించింది.

శాస్త్రి చెయ్యి అప్రయత్నంగా వారిజ చెక్కిలిని తాకింది.

ఆ స్పర్శలో ఇదివరకు ఉన్న ఆనందమూ నిండూ ఇప్పుడు లోపించినట్లనిపించింది ఇద్దరికీ.

మోహనమూర్తి స్పర్శ తన శరీరానికి నిషా ఇస్తే — శాస్త్రి స్పర్శ తన మనసుకి నిషా ఇస్తున్నది. వీళ్ళిదరూ ఒకే వ్యక్తి అయితే తనకి ఆనందం లభిస్తుంది

సరిగ్గా శాస్త్రికూడా అదేఅనుకున్నాడు. కాత్యాయినీ, వారిజా ఒకరే అయితే బాగుండునని. అసంభవమూ ఐంద్రజాలికమూ అయిన ఈఊహ సఫలీకృతం కాజాలదని వారికీ తెలియకపోలేదు. అయినా ఆ ఊహ అందమైన ఆంతర్యపు లోతుల్లో పొటమరించిన లాలసాంకురం.

వారిజ లేచి మంచంమీద కూర్చుంది. రామలక్ష్మి, మోహనమూర్తి వచ్చి కూర్చున్నారని పనిమనిషి వార్త తెచ్చింది. వారిని ఇక్కడకే పంపమని వారిజ ఆజ్ఞాపించి సరిగా ఒళ్ళంతా చీర కొంగు లాక్కుంది.

గదిలో అడుగుపెట్టగానే వారిద్దరికీ శాస్త్రి నమస్కారం చేశాడు. అతన్నిచూసిఆశ్చర్యపోయిందిరామలక్ష్మి.

శాంతియుతమైన అపూర్వ కళతో నిండిన అతని ముఖం ఈ మామూలు ప్రపంచంలోని సుఖదుఃఖాలకూ - ప్రేమాసహ్యాలకూ - ఆశనిరాశలకూ అతీతమయి గౌరీ శంకర శిఖర ప్రదేశంనుంచి తన పుణ్య దీప్తిని ప్రసరింపచేస్తున్నాదా - అనిపించింది.

రామలక్ష్మిహృదయం ఏదో అపూర్వమైన భక్తి శ్రద్ధలతో నిండిపోయింది. ఒక చేత అభయముద్రపట్టి వర దానప్రదానానికి సిద్ధంగా ఉన్న దేవతామూర్తిలా కనిపించాడు శాస్త్రి.

అపరిమితమైన భక్తితో - 'నమస్కారమండీ' అన్న రామలక్ష్మినిచూసి శాస్త్రి ఆశ్చర్యపోయినాడు.

"మర్చి పోయినారా! ఇదివరకు మనం ఒకసారి కలుసుకొన్నాం" అన్నాడు.

"లేదండీ" అని నవ్వుతూ జవాబిచ్చింది రామలక్ష్మి.

"క్రొత్తగా నమస్కారం పెడుతుంటేను" అని సిగ రెట్ వెలిగించాడు శాస్త్రి.

ఉన్న ఒక్క కుర్చీలోనూ రామలక్ష్మి కూర్చోటంతో "ఇలా రా జిజ్జూ, ఇక్కడ కూర్చో" అని ఆ మంచంమీదే తను ప్రక్కకి జరిగి మోహనమూర్తికి చోటు చూపించింది వారిజ ఆమె సాహసానికి మనసులోనే అభినందించుకుంటూ వెళ్ళి కూర్చున్నాడు మోహనమూర్తి. ఎలా సంభాషణ ప్రారంభించాలో ఎవరికీ తెలియటంలేదు.

ముగ్ధ మనోహరమైన వారిజ రూపం రామలక్ష్మికి కుతూహలాన్ని కలిగించింది. రామలక్ష్మిని చూసి నవ్వుతూ -

"శాస్త్రి మీకు తెలుసుగదూ?" అన్నది వారిజ ఇంతవరకూ అశ్రుధారలతో కడిగినట్లున్న ఆమె ముత్తెపు అందం - ప్రేయ ప్రవాహపు వరదలలో శుభ్రమైన ఆమె ఆంత ర్యం స్పష్టంగా కనిపించింది రామలక్ష్మికి.

"బెంగుళూరులో ఒకసారి కలుసుకున్నాం వారిజ గారూ!" అని సమాధానం ఇచ్చి శాస్త్రివంక చూసింది ఆమె

"మీరు చాలా బాగా వ్రాస్తారు రామలక్ష్మిగారూ! మోహనమూర్తిగారు ఒకటి రెండుసార్లు మీగీతాన్ని పాడారు కదూ?" అన్నాడు శాస్త్రి

"పాడానండీ" అన్నాడు మోహనమూర్తి ఎలా మాట్లా డాలో తెలియక.

"ఏది జిజ్జూ! మళ్ళీ ఒకసారిపాడు" అంది వారిజ. ఈ సూచన అందరికీ నచ్చటంతో పాట ప్రారంభించాడు మోహనమూర్తి.

మామూలు మోహనమూర్తికన్న పాడుతున్నప్పటి మోహనమూర్తి అత్యంతాకర్షణీయుడు ఆతనిపాట వింటున్న శాస్త్రి ముగ్ధుడైపోయి - "ఇతన్ని ప్రేమించకుండా ఏ స్త్రీ మాత్రం ఎలాఉండగలదు?" అనుకొన్నాడు.

కృష్ణవేణీ శీతల జలాలలో శాశ్వత విశ్రాంతి పొంది బ్రతుకులో కళంకాలను కడిగివేసుకొన్న ఒక ప్రేమ వంచిత రాలి హృదయం ఆ గేయంలో వ్యక్తమైంది.

ఒక సెలయేరు కొండమీదనుంచి పరుచుకు ఏతూ నురగలు కక్కుతూ ఆయాసపడు తున్నట్లూ - అర్ధరాత్రి నీరవ నిశ్శబ్దంలో ఆ సెలయేటి విహ్వలరోదనం ఆ అభాగ్య రాలి గుండెతో సమ్మానంగా ధ్వనిస్తూన్నట్లూ ఉన్నది ఆ గేయం.

పాట పూర్తి అయినాక అందరూ 'అమ్మయ్య' అనుకొన్నారు.

"అబ్బ, ఎంత బాధ పెట్టావు జిజ్జూ" అన్నది వారిజ.

"ఆ సంగతి రాములక్ష్మిగార్ని అడిగితే బాగుంటుంది" అని నవ్వాడు మోహనమూర్తి.

"జీవితంలో ప్రేమానుభవం లేకుండా ఇలాటి విషాద గేయం వ్రాయటం ఎలాసాధ్యమయింది?" అన్నాడు శాస్త్రి సిగరెట్ వెలిగిస్తూ.

"మీలో మీరు అనుకుంటున్నారా; నన్ను ప్రశ్నిస్తున్నారా? ముందు ఆ సంగతి చెప్పండి" అని నవ్వింది రామలక్ష్మి.

"తన అనుభవంలోకి రానివికూడా రచయిత అప్పుడప్పుడు వర్ణిస్తూ ఉంటాడుగాని ఆ వర్ణన, అనుభవమే కనుక అయితే మరింత అందంగా ఉంటుంది" అన్నాడు శాస్త్రి.

"మీరు చెప్పింది కొంతమటుకు నిజమేగాని - అన్ని వేళలా అనుభవాలే ఎక్కడ వర్ణించగలం చెప్పండి?"

"అన్నివేళలా అనుభవాలే వ్రాయనక్కరలేదు. వ్రాసింది అనుభవాలా ? - అనిపించేట్లు వ్రాయటమే ఉత్తమ రచయిత ప్రత్యేకత" అన్నాడు మోహన మూర్తి.

"శ్రావ్యాన్ని దృశ్యంగా మార్చగల మీ పాటని చూస్తే నాకసూయగాఉంది" అన్నాడుశాస్త్రి. వారిజ ఉలిక్కిపడి శాస్త్రివంక చూసింది.

"మీకు అసూయ ఉన్నదా మోహన మూర్తి గారూ!" అని మరో ప్రశ్న వేశాడు శాస్త్రి.

"అర్భకుడిని - ఏం చెప్పగలను చెప్పండి!" అని రామలక్ష్మి వేపు సాభిప్రాయంగా చూశాడు మోహన మూర్తి.

కొంచెంసేపు అందరూ ఎవరి లోకంలో వారు ఉండి పోయినారు.

"అయిదు అయింది. ఇక వెడతానండీ" అన్నది రామలక్ష్మి. సంభాషణ అంత త్వరగా తుంచివేసినందుకు మనసులోనే ఆమెను అభినందించింది వారిజ.

"జిజ్జూ! నువ్వుండి పోరాదూ" అన్నది మోహన మూర్తితో వారిజ.

"మళ్ళీ వస్తా వారిజా!" అని ఆమె కోరికని సభ్యతగా తిరస్కరించి బయటికి నడిచాడు మోహనమూర్తి.

శాస్త్రివంకచూస్తూ "మీతో మాట్లాడాలని ఉన్నది. రేపొకసారి వస్తాను వీలయితే" అని నమస్కరించింది రామలక్ష్మి.

"తప్పకుండారండి. నేను ఎల్లుండి వెళ్ళిపోదామను కుంటున్నాను" అన్నాడు శాస్త్రి. వారిజ భయంభయంగా చూసింది అతనివంక.

రామలక్ష్మి బయటికి వచ్చేసరికే రిక్షా ఎక్కేశాడు మోహనమూర్తి.

"నువ్వెళ్ళులక్ష్మీ! నేను కొంచం సేపు తిరిగి వస్తాను" అన్నాడు.

అప్పుడే సూర్యాస్తమయం అవుతున్నది. ఆకాశం లోని మబ్బుగుంపులు రకరకాల సంగీత వాద్యాలలాగా ఉన్నయ్. ఈ నిశ్శబ్ద కృష్ణాతీరాన అసంఖ్యాకంగా ఉన్న ఇసుక రేణువులు తళతళా మెరుస్తున్నయ్. సుందరమైన ఈ కృష్ణా సైకతభూమి ఎవరో గంధర్వ కన్యలు తమ ప్రియుడి కోసం పరచిన పక్క కాదుకదా అనిపించేటట్లు ఉంది.

మోహనమూర్తికి అక్కడే పడుకోవాలనిపించింది. అతని కిప్పుడు ఎవరితోనూ మాట్లాడే ఓపిక లేదు. క్రిష్ణ ఇసకలో ఎవరూ రారనిపించినంత దూరం వెళ్ళి - ఆ నిర్జన ప్రకృతిలో ఆత్మ మగ్నంచేసి ఆ ఇసుకలో వెల్లకిలా పడుకుని ఆకాశంవంక చూడటం ప్రారంభించాడు.

క్రిష్ణా తరంగాల కలకలధ్వనులు ఆనకట్ట అవతలనించి జలతరంగిణిలా వినవస్తున్నవి. పైన అనంత నీల గగనపు నిర్మలరూపం - కింద క్రిష్ణవేణీ స్మితరోచులు - అతను నిశ్శబ్దంగా ఆకాశంవంక చూస్తున్నాడు. ఎన్నో ఆలోచించుకోవాలని ఈ ఏకాంత సుందర ప్రదేశాన్ని వెదుక్కుంటూ వచ్చాడుకాని ఏమీ ఆలోచించ లేక పోతున్నాడు.

ఇంతవరకూ కలిగిన వేదనతో అతని మెదడు అలసిపోయింది. అందుకనే నిరుద్దేశ్యంగా ఆకాశంవంక చూడటం తప్ప మరేమీ ఆలోచించలేక పోతున్నాడు.

అకస్మాత్తుగా ఆకాశంలో ఒక పక్షుల గుంపు-ఇంగ్లీషు అక్షరం 'వి' ఆకారంలో తూర్పునించి పడమరగా పోయింది. కళాకారుడైన అతని ఆత్మదీపానికి ఆ దృశ్యం స్విచ్ వేసింది. ఈ నిర్జన ప్రదేశంలో ఆదృశ్యం కనిపించేసరికి అతని అలసట తీరిపోయింది. ఆ పక్షులు కనిపించనంతవరకూ వాటి వంక చూశాడు.

క్రమక్రమంగా చీకటి చిక్కబడుతున్నది. నీలాకాశంలో ఒకో నక్షత్రం బొట్టు పెట్టుకుంది. గగనసుందరి చెక్కిలిమీది మకర రేఖగా ఈశాన్య దిక్కున సప్తర్షిమాల ఉదయించింది,

శుక్రి నక్షత్రం ఉజ్వల ప్రకాశంతో ఉదయించాడు. మృగశిరా నక్షత్రం తన స్థిర మహిమతో మోహనంగా ప్రకాశిస్తున్నది.

ఇంతగొప్ప వజ్రాలహారం ధరించటానికి ఆకాశం కూడా భయపడుతున్నది వారిజలాగానే - అనుకొని నవ్వుకున్నాడు అతను. ఈ రోజుకృష్ణపంచమి-కొంచెం ఆలస్యంగా చంద్రోదయం కావచ్చును.

ఈ ప్రశాంత నదీ సైకతాన్ని వదిలి ఇంటికి పోవటానికి ప్రాణం ఒప్పలేదు. మోహనమూర్తికి కొద్దిగా చలి వేస్తున్నది గాని - రక్తం అంతా ఉష్ణరాగంతో నిండి ఉండటం వలన ఆ చలికూడా వెచ్చగానే ఉంది.

శ్మశానాలు దగ్గర కావటంచేత నక్కల కూతలు జాస్తీ అయినయి. కదలకుండా పడుకున్న మోహనమూర్తిని చూసి నిర్జీవ శరీరం అని భ్రమించి ఒకటి రెండు దగ్గరగా కూడా వచ్చినయ్. అతని మనసు ఒకవిధమైన భ్రమాచ్ఛన్నమై ఉండకపోతే ఈ నిర్జన నదీ తీరంలో - శ్మశానానికి దగ్గరలో పడుకొని ఉండటం అంత తేలిక అయిన పనికాదు.

చాలా సేపటివరకూ యోగనిద్రలో ఉన్నట్లు స్థిరంగా పడుకొని ఉన్నాడు మోహనమూర్తి. కొంచెం సేపటికి తూర్పున నవోదయ చంద్రుని లేత కాంతులు కనిపించినయ్. క్రమక్రమంగా విభావరీ మనోహరుడి రజతోజ్వల కాంతిలో ఆ ఇసుక నేలంతా పులకితమై తళతళలాడటం ప్రారంభించింది.

కృష్ణాతరంగాలుకూడా ఆ కాంతిలో వెలుగుచారలు పెనవేసుకొన్నట్లు కనిపించినయ్. ఈ దివ్య సుందరమైన ప్రకృతిదేవి తాలూకు నగ్న స్వరూపం ఆ మహాగాయకుడికి ఒక దివ్యానుభూతిని కలిగించింది.

ఆ మధుర సుందర దృశ్యంముందు తను ఎంతో అల్పుడనిపించింది అతనికి – అనిర్వచనీయమైన ఆనంద ప్రవంతి కృష్ణవరదలా అతని మీదనుంచి ప్రవహించి పోయింది. ఆ దెబ్బతో అతన్ని బాధిస్తూ వచ్చిన సమస్యలూ ఆలోచనలూ తుడిచి పెట్టుకుపోయి. యేదో అపూర్వమైన ఉత్సాహం – జీవితానికి సంబంధించిన ఆశలూ పొంగి పొర్లసాగినయ్.

బంధనారహితమైన ఈవిచిత్ర ప్రకృతిలో మామూలు బాధలూ సమస్యలూ తుచ్ఛంగా కనిపించి అతని మనసులో ఒక విధమైన వైశాల్యం విస్తరించింది.

వారిజ నన్ను ప్రేమిస్తున్నది. నేను ఆమెను ప్రేమిస్తున్నాను. అంతకంటె మరేం కావాలి? ఎవరిమీదో కలిగే ఒకవిధమైన అసూయతో – ఎవరో విమర్శిస్తారనే భయంతో– వారిజను చూడకూడదని తను ఎందుకనుకున్నాడు!

స్వర్గ మర్త్యవ్యాప్తమైన ఒక ఆనందస్పర్శతో– అనిర్వచనీయమైన మధురానుభూతితో ఒకసారి కలుసుకుంటే చాలదా? ఆత్మప్రేరణతో ఐక్యమయిన అంతర్యాలకి–సామాజిక నియమాల అస్తిత్వం ఏనాడు జ్ఞాపకం ఉంది కనుక!

పవిత్రమూ ప్రాచీనమూ అయిన ఈ కృష్ణా తీరాన యీ సత్యాన్ని ఎంతమందో తెలుసుకుని ఉండవచ్చును- అనుకొని తనలో తనే నవ్వుకున్నాడు అతను.

అయ్యో, స్త్రీ! నీ ప్రియుని నీనుంచి పారిపోకుండా చేయుటానికి వెచ్చని కన్నీటి బిందువులు తప్ప మరోమార్గం లేదు కదా నీకు! అయినా అవిఎంత బలమైనవి. కఠినుడూ అతిసాహసుడూ అయిన మగవాడిని స్త్రీకన్నీరు కట్టివేసినంత బలంగా మరేదీ బంధించ లేదుగదా!

అతను బయలుదేరి వచ్చేప్పుడు ఉన్న అశాంతి ఇప్పుడు లేదు. ఆ యిసుకమీద అలాగే పడుకుని కొంచెం సేపు నిద్ర పోయినాడు. కొంత సేపటికి మెలుకువవచ్చి లేచి నిలబడ్డాడు. చుట్టూఉన్న ఈ అనంత సౌందర్యంలో ఇంకొంచెంసేపు ఉంటే ప్రాణం పోతుందేమో అనిపించి - వెళ్ళి పోవటానికి లేచాడు.

శ్మశానంలోనుంచి కాలి ఆరిపోయిన చితుల్ని దాటు కుంటూ నడుస్తున్న అతని కాలికి ఏదో గట్టిగా తగిలింది. చేతికి తీసుకుని అదేమిటో చూశాడు అతను. అది మృత మానవుని మస్తకం. చర్మం, మాంసం, సమస్తమూ హరించి పోయిన వికృతమైన నిజరూపం.

మోహనమూర్తి నవ్వుకుంటూ ఆ చితుల్ని దాటి వెళ్ళిపోయినాడు.

* * *

"జీవితం అనశ్వరమైనది వారిజా!" అన్నాడు మోహన మూర్తి.

వారిజ మాట్లాడలేదు.

"నేను నిజమే మాట్లాడుతున్నాను వారిజా! నా మాటలు నిన్ను కష్టపెడితే నన్ను క్షమించాలని ప్రార్థిస్తున్నాను. శాస్త్రిగారితో నీవు వెళ్ళిపోవటం. అనేవిషయం నాకు బాధ కలిగించదని అనను. కాని ఆ బాధను జయించేశక్తిని సంపాందించుకోటానికి ప్రయత్నిస్తాను. నీవు సుఖంగా ఉండటంకన్న నేను కోరేదేం లేదు"

మోహనమూర్తి మాటలకి వారిజ కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్.

"దీనివలన నీ హృదయం గాయపడటం మాత్రమే కాదు. నా యెడల నీ అభిమానం ద్వేషంగా మారుతుంది కూడా. అయినా అనుక్షణం నా అంతర్యపు పుటలు వగుసా వాపీ లేకుండా తిరగేస్తూ ముగింపుకోసం వెతుకుతూ పోతే - ఇంతకన్న మంచి ముగింపు నాకు కనిపించలేదు"

"అంటే శాస్త్రితో నేను జీవించటం వలన నీకు అసూయలేదా!"

"నాతో ఒకసారి రామలక్ష్మి ఏమందో తెలుసా! వారిజగారు - శాస్త్రిగారు - నువ్వూ - నేనూ- కాత్యాయనీ అందరి కందరం చాలా ఉదాత్త వ్యక్తులం- మనమందరం ఎదటి వాళ్ళకోసం త్యాగాలు చేస్తాం - వీళ్ళనే పాత్రలుగా తీసుకొని నవల వ్రాస్తే ఎంత గొప్ప రచయిత అయినా ముగింపు విషయంలో దెబ్బతింటాడు అన్నది"

"అంటే ఏం జరుగుతుందో తెలియదా?"

"ఏం జరుగుతుందో తెలియక పోవటం కాదు. కథ ఏ మలుపు తిరుగుతుందో తెలియదు. అదలా ఉంచు. ఇప్పుడు శాస్త్రితో బెంగుళూరు వెడుతున్నావా?"

ఎందుకో వారిజకి ఆ క్షణంలో తన సర్వస్వాన్ని పోగొట్టుకున్నట్లు తోచింది.

"జిజ్జూ! నాకు తల్లిదండ్రులుగాని-అన్నదమ్ములుగాని-అక్క చెల్లెళ్ళుగాని ఎవరూ లేరు. ఈ సభ్య సమాజపు నడి బొడ్డులో నాకు నిలబడటానికి కూడా అర్హత లేదు. ఈ లోకంలో నా అని చెప్పుకో దగిన వ్యక్తులు నువ్వూ శాస్త్రి మాత్రమే. కాని జిజ్జూ! మీ ఇద్దరూ ఒకరే అయితే బాగుండేది" అని నిట్టూర్చింది వారిజ.

ఐంద్రజాలిక లోకంలోని మాంత్రికుడెవరో ఆమెను నిద్రబుచ్చి - ఇంత విశాలంగా విస్తరించిన ఈ సహజ వాస్తవిక జీవితంనుంచి వంచితురాల్ని చేశాడు. ఆ మాంత్రికుడు శాస్త్రి కాదుగదా. అనిపించింది ఆమెకు. బహుశా ఈ మంత్రశక్తివలనే అతడు లేకుండా తను జీవించలేక పోతున్నదేమో!

మోహనమూర్తితో పరిచయం అయిన దగ్గరనుంచీ ఆమె మానసిక కల్లోలం క్రమంగా తగ్గిందని అనుకుంటోంది. దివారాత్రాలు తన హృదయాన్ని పట్టి పీడిస్తున్న శాస్త్రిస్మృతి కొద్దిగాతగ్గిపోయిందనేచెప్పాలి. మోహనమూర్తి స్నేహంతో తనజీవితానికి నారీత్వం సిద్ధించింది. కాని తను అనుభవించలేని ఆ మధుపాత్ర అంచుకి ఘోరవిషం అంటి ఉందని తను

చాలారోజులు గ్రహించలేదు. విచిత్రం ఏమిటంటే, ఆ విషం తన అధరాలదే అవటం. తనమనసులో శాస్త్రి స్మృతి ఇంకా వదలలేదు. తన మనసులో అతని విషయంలో ఉన్న తన అజ్ఞాత భయానికి అర్థమూలేదు. ఆ భయం తోనే చాలాకాలం అతన్ని తప్పించుకు తిరిగి చివరకి అతను లేకుండా జీవించటం కష్టం అనే నిశ్చయానికి వచ్చింది.

కాని ఇప్పుడీ క్షణంలో ఆ అజ్ఞాత భయం పుష్కలా వర్తక మేఘంలా ప్రశాంత నీలమైన తన హృదయాకాశాన్ని తిరిగీ అంధకారం చేస్తున్నది. ఈ అంధకారంలో కనిపిస్తున్న ఒకే ఒక వెలుగురేఖ మోహనమూర్తి.

అక్కడ ప్రేమగాని, వాంఛగాని లేక పోవచ్చును. అయినా భయంమాత్రం లేదు. పాపంమధ్య పుట్టి పెరిగిన తను మరో పాపం చేయబోతున్నాననే భీతిలేదు.

"జిజ్ఞా, నీవు లేకుండా ఉండలేనేమో!" అంది ఆమె.

గతసాయంత్రం నిర్జన క్రిష్ణా తీరంలో తనకి కలిగిన అనుభూతి - తన హృదయంలో ఒక్కసారి గుప్పుమన్న వైరాగ్య దీపశిఖ - తిరిగీ కొడిగట్టదు కదా అనుకున్నాడు మోహనమూర్తి. అతని కళ్ళల్లో ఆ వైరాగ్య భావం ఇంకా నిలిచేఉంది. వారిజ లేకుండా తను జీవించగలడు. ఈ ప్రపంచంలో ఎవరితోనూ ఎవరూ నశించరు. ఎవరి జీవితాలు వారివి. ఎవరి అవకాశాలు వారివి. కాకపోతే కొందరితో కలిసి జీవించాలనిపిస్తూ ఉంటుంది, అంతే. అంతకన్న మరో ప్రాధాన్యతకాని ప్రత్యేకత గాని ఉందనుకోవడం మనని మనమే భ్రమపెట్టుకోవటం అవుతుంది.

తన ఊహాలకి తనే నవ్వుకున్నాడు అతను. మరీ ఇంత వైరాగ్యమా? అసలేమయింది తనకు!

"ఎందుకు నవ్వుతున్నావు జిజ్జూ?"

"అసలు చివరకి ఈ మానవుడు ఏమయి పోతాడా-అని పించి నవ్వు వచ్చింది"

"అంటే?"

"అంటే మరేంలేదు వారిజా! రోజురోజుకూ వైజ్ఞానికంగా పెరిగిపోతున్న ఈనాటి మానవుడికి - కొంత కాలం గడిచేప్పటికి శారీరకమైన రసానుభూతులన్నీ హరించిపోయి చివరకి ఒక్క మెదడూ ఆలోచనా తప్ప మరేం మిగల దనిపిస్తోంది నాకు"

"శాస్త్రి లాగా మాట్లాడు తున్నావు నువ్వు"

"కావచ్చును. అప్పుడు కేవలం సంకల్పమూ - వాంఛాసిద్ధీ, ఒకటే అవటానికి అవకాశం లేకపోలేదు. అప్పు డయితే మనం ఇంత సేపు ఆలోచించ నక్కర లేదు"

"జిజ్జూ! ఏమిటీమాటలు?"

"అవును వారిజా! అప్పుడు మృత్యువుని తల్చుకుని తల్చుకోకుండానే ఆమె ప్రత్యక్షమయి సర్వ సమస్యల సమాధానం క్షణంలో దొరుకుతుంది."

వారిజ భయపడిపోయింది. మోహనమూర్తి ఏం చేయ బోతున్నాడు? తనని శాస్త్రితో వెళ్ళమని... ... ...

"అసలు విషయం చెప్పు. నీకేం జరిగింది?" అంది అతనికి దగ్గరగా జరిగి.

"ఏం లేదు వారిజా! ఈ జీవన గానానికి ఆఖరి చరణం పాడిన తరువాత మిగిలే ఆ నిశ్శబ్దం ఎలా ఉంటుందో అని పిస్తున్నది"

"జిజ్జూ!" ఆ కేక వేటగాడి దెబ్బతినబోతున్న లేడిపిల్ల నిశ్శబ్ద రోదనలా ధ్వనించింది వారిజ కంఠంలోనుంచి.

"జిజ్జూ! నిన్నింత బాధ పెట్టానా? శాస్త్రి మహాయోగి. నేను లేకుండానే అతను జీవించగలడు. నేను లేకుండా నువ్వు మాత్రం జీవించలేవు. నేను నీతో ఉండిపోతాను" రెండు చేతులతో ముఖం కప్పుకుని దుఃఖించసాగింది ఆమె.

శాస్త్రి లేకుండా తను బ్రతుకలేదు తనులేకుండా మోహనమూర్తి బ్రతకలేడు. కాని అందరూ త్యాగాలు చేస్తారు.

ఇంత సంస్కారం ఎంత బాధాకరమైనదో తన అను భవానికి వచ్చినట్లు మరెవరికీ రాదు. వీళ్ళిద్దరిలో ఎవరో ఒకరు తనని అనాగరికుడైన అడివి మనిషిలా బలాత్కారంగా ఎత్తుకు పారిపోతే తను సుఖపడిపోతుంది. స్త్రీని ఆలోచించ నిచ్చే నేటి పురుషుడి ఆధ్వర్యంలో కన్న ఆలోచనకి ఏ మాత్రం అవకాశమూ ఇవ్వని రాతియుగపు మానవుడి ఆధ్వర్యం లోనే స్త్రీ సుఖపడిందేమో - అనిపించింది వారిజకి.

"ఆత్మహత్య చేసుకుంటానని నిన్ను భయపెట్టటం లేదు. నేను ఊరికే అన్నాను. ఇక ఆ విషయం ఆలోచించకు - ఇంతకీ ఎప్పుడూ ప్రయాణం?" అన్నాడు మోహన మూర్తి.

"నువ్వు నన్ను హింసించదల్చుకుంటే అనేక మార్గాలున్నయ్. కేవలం ప్రయాణం సంగతే ఎత్తనక్కరలేదు" విసుగ్గా అంది వారిజ.

మోహనమూర్తి నవ్వుకుని "సాయంకాలం వస్తాను" అని లేచి వెళ్ళి పోయినాడు.

* * *

"చావు సంగతి చెప్పి ఆమెను భయపెట్టి వచ్చావన్న మాట! అంతేనా?" సూటిగా ప్రశ్నించింది రామలక్ష్మి.

"ఇంత క్రూరంగా మాట్లాడటం నీకొక్కదానికే చేతనవును" విసుగ్గా అన్నాడు మోహనమూర్తి.

"నిజంగా నీ మనసులో శాస్త్రి అంటే అసూయతో పాటు వారిజ నీకే ఉండిపోవాలన్న వాంఛ కూడా ఉంది. ఆ సంగతి బాహాటంగా అనటానికి భయం. అందుకే ఆదర్శపు ముసుగులో దూరి లోకాన్నీ వారిజనీ కూడా మభ్యపెట్టావు. ఇంతకన్న ఏదో ఔన్నత్యం నీలో ఉన్నదంటే నాకే విధమైన నమ్మకమూ కలగటంలేదు" రామలక్ష్మి నిర్భయంగా అన్న ఈ మాటలకి మోహనమూర్తి ఉలిక్కిపడ్డాడు.

నిజంగా తను అలాగే చేయలేదుగదా? కాదు. కృష్ణాతీరంలో తనకి కలిగిన అలౌకికానుభూతి అసత్యం ఎన్నటికీ కాదు. తను వారిజలేకుండా జీవించలేకపోతే జీవించటమే మానేస్తాడుగాని, ఆమె సుఖశాంతులకి మాత్రం అడ్డు తగలడు. ఇమాటే రామలక్ష్మితో అన్నాడు మోహనమూర్తి.

"ఇంతంత త్యాగాలు చేసి ప్రాణాలు తీసేకన్న మీ ఇద్దరిలో ఎవరో ఒకరు బలాత్కారంగా ఆమెను లేవతీసుకు పోతే సుఖపెట్టిన వాళ్ళవుతారు"

"అదేమిటి?"

"ఇంతంత త్యాగాలూ అసమర్థతా ఏ స్త్రీ కూడా ఎక్కువ కాలం భరించలేదు. జీవితం అంతా ఏదో జరుగుతుందనే ఆశతో నిరీక్షించవలసి రావటం అంతకంటె నరకం"

"అంటే?"

"అంటే ఏంలేదు. ఆమె దురదృష్టవశాత్తూ ప్రేమించటానికి ఇద్దరూ ఆదర్శపురుషులే దొరికారు. మీ ఇద్దరూ తెగించలేరు; ఆమె అసలే తెగించలేదు. మీ ఇద్దరి మధ్యా పరిభ్రమిస్తూ జీవించటం తప్ప వారిజగారు చేసేదేం కనిపించటంలేదు. ఈ కథకి అంతెక్కడ?"

"అంతు కావాలంటే చెయ్యాల్సినపని ఒకటే. ముగ్గురిలో ఎవరో ఒకరు మరణించటం"

"బాగుంది - మీరందరూ ఇంతంత ఆదర్శ ప్రాణులు గదా-ముగ్గురూ కలిసి బ్రతకటానికి ఎందుకు ప్రయత్నించరో బోధ పడటంలేదు."

"అంటే అతివాకబారుగా వారిజని పంచుకుంటూ బ్రతకమంటావు?"

"వారిజ మరో స్త్రీతో మిమ్మల్నిద్దరినీ పంచుకోటానికి సిద్ధపడనప్పుడు మీ ఇద్దరూ మరో పురుషుడితో

ఆమెను పంచుకోటానికి ఎందుకు భయపడతారో అర్థం కావటంలేదు"

"పంచుకోటానికి ఒప్పుకుంటోంది కాని, పంచబడ టానికి ఒప్పుకోదు ఆమె."

"పాదిత్యంలో పాతివ్రిత్యం అంటే నాకు అసహ్యం"

"నీ సహ్యాసహ్యాలసంగతి అలాఉంచి, ఇప్పుడు నా సంగతి ఏమిటో ఆలోచించి పెట్టు" అన్నాడు మోహన మూర్తి. రామలక్ష్మికి తిక్క రేగింది.

"చచ్చిపోవాలనుకుంటే నిరభ్యంతరంగా చచ్చిపో. నాకేవిధమైన అభ్యంతరమూ లేదు. కావాలంటే నేను వ్రాస్తున్న నవల అంకితంకూడా ఇస్తాను" అన్నది.

అంత కఠినంగా మాట్లాడిన రామలక్ష్మి మాటలకి మోహనమూర్తి మనసు చివుక్కుమంది. ఎప్పుడూ ఓదార్చే లక్ష్మి ఈ రోజు ఇదేమిటిలా మాట్లాడింది? తను ఆత్మ హత్య చేసుకోటం తప్ప నిజంగా మరోమార్గంలేదా? లేక పోతే ఏదో అజ్ఞాతశక్తి రామలక్ష్మి చేత అలా అనిపిం చిందా?

అసమర్థులందరికీ ఆత్మహత్య చేసుకోటం తప్ప మరో మార్గాంతరం లేదు. తను ఆత్మహత్యే చేసుకుంటే- ఆ పనికి కారణం నిజంగా హరిజేనా? స్త్రీకోసం పురుషుడు ఆత్మ త్యాగం చేస్తాడుకాని ఆత్మహత్య చేసుకుంటాడా?- ఆమాట కొస్తే ఆత్మత్యాగం అంటే ఏమిటి?

మోహనమూర్తి ఆలోచనలన్నీ గజిబిజిగా ఒకదాన్ని ఒకటి అల్లుకు పోయినయి. అర్థంలేని తన బలహీనపు ఆలో

చనలకి తనే నవ్వుతున్నాడు అతను. అసలిప్పుడేం మునిగి పోయిందని తను చావాలి ?

చావూ బ్రతుకూ ఒకటిగానే కనిపిస్తున్న ఈ సమయంలో ఏదైనా ఒకటే. రామలక్ష్మి అన్నట్లు వారిజని తను, చావుపేరు చెప్పి భయపెట్టి గాలేదు కద!

తను అన్న మాటలు కఠినంగా ఉన్నాయని అప్పటికి గ్రహించిన రామలక్ష్మి అనునయంగా-

"అదికాదు మూర్తీ! ఆదర్శ వాదులన్నా - అసమర్థులన్నా నాకు అసహ్యం. మీరుముగ్గురూ కూడా ఎలాబ్రతకాలో తెలియక జవితాన్ని అనిర్దిష్టంగా గడుపుతున్నారు. కాలం మీకోసం ఎలానూ ఆగదు. ఏదో ఒక క్షణాన మీరు కన్ను మూయకనూ తప్పదు. ఆ క్షణంలో గడిచిన బ్రతుకులో లాభనష్టాల్ని బేరీజు వేసుకు చూస్తే మీరు పొందగలిగిన దానికంటే పోగొట్టుకున్నదే ఎక్కువగా కనిపిస్తుంది. అప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదు" అన్నది.

"అయితే ఇప్పుడేం చేయాలి?"

"అతి తేలికైన సమస్యల్ని ఇంతంత బరువుగా ఎలా తయారు చేస్తారో నాకు అర్థంకావటం లేదు. వారిజగారు వెళ్ళాలనుకున్నప్పుడు వెళ్ళనియ్య"

"నేను వెళ్ళమనే చెపుతున్నాను"

"వెళ్ళమనే అంటూ వేదాంతం వల్లిస్తుంటే ఆవిడ భయపడి పోయారు. మూర్తీ! ఈ వ్యవహారం నాకు నచ్చలేదబ్బాయ్" అన్నది రామలక్ష్మి.

మోహనమూర్తి హైమవతీ రాగంలోని స్వరంలా చిరునవ్వు నవ్వాడు.

రామలక్ష్మికి మానవ స్వభావాన్ని ఆకళింపు చేసుకునే శక్తి పూర్తిగా ఉన్నది. రకరకాల అవస్థలలో - రకరకాల పరిస్థితులలో పైకి కనిపించీ కనిపించని భావ తరంగాలను అధ్యయనం చేయటం అంటే ఆమెకు అపరిమితమైన సరదా.

అతని చిరునవ్వు చాటున ఒక భయంకరమైన నిరాశ తన జీమూత పక్షాలని ఇటూ అటూ చాస్తున్నట్లు చూపు గలిగింది ఆమె ఉలిక్కిపడి.

"ఆత్మీయత అనేది మనిషి ప్రగతికి అన్నిటికంటె పెద్ద ఆటంకంగా తయారయింది మూర్తీ! ఒకేచోట పెరుగుతున్న రెండు మొక్కలలో ఆత్మీయతకి లోపం ఉండదు. అయినా ఏది బలమైన మొక్క అయితే దానిమీదవాలి రెండో మొక్క నిశ్చింతగా బ్రతికేస్తూ ఉంటుంది. మనిషిలో మాత్రం ఈ పద్ధతి అసమగ్రత కింద పరిగణించ బడుతున్నది. అందుకే ఆత్మీయత అనేది ఉత్త న్యూసెన్స్" అన్నది.

"ఒక్క ముక్క అర్థంకాక పోయినా విషయం మాత్రం మ్యాజికల్‌గా ఉంది"

"సరే నువ్వొకపనిచేయి. శాస్త్రిగారూ, వారిజగారూ వెళ్ళిపోయేదాకా నువ్వు నా కేరాఫ్‌లో ఉండు" అని నవ్వింది ఆమె.

"నువ్విలా చెపితే అలా చేస్తాను" అని వెంటనే ఒప్పేసుకున్నాడు మూర్తి.

యుగయుగాలుగా ఎవరికీ కనిపించకుండా గుహలో నిద్రిస్తున్న కుంభకర్ణుడు ఈ ఇరవయ్యో శతాబ్దంలో అకస్మాత్తుగా నిద్రలేచి గుహ బయటికి వచ్చి అనుక్షణం జీవన స్పందనంతో సాగిపోతున్న నాగరిక నరనారీబృందం తాలూకు సహస్ర నేత్రాల కుతూహల దృష్టులనుంచి తప్పుకో లేక మళ్ళీ గుహలోకి పారిపోదామంటే - అది ఉన్నచోట తృతీయ పంచవర్ష ప్రణాళిక తాలూకు మహాత్తర నిర్మాణాల్లో ఒకటైన ఫ్యాక్టరీ కనిపిస్తే అతని స్థితి ఎలా ఉంటుందో మోహన మూర్తి స్థితికూడా సరిగ్గా అలాగే ఉన్నది. తన సర్వభారాలూ ప్రియ స్నేహితురాలైన రామలక్ష్మి మీద వేసి నిశ్చింతగా ఉండటానికి ప్రయత్నించ సాగాడు.

"లక్ష్మి, కాఫీ కావాలి"

రామలక్ష్మి లోపలికి వెళ్ళగానే నిద్రమాత్రలు నోట్లో వేసుకుని హైమవతీ రాగానికి హమ్ చెయ్యటం ప్రారంభించాడు మోహనమూర్తి.

* *

"ఏడవటం అనేది అసమర్థతకి చిహ్నం వారిజా! అలా ఏడిచే వాళ్ళంటే నాకు నచ్చదు" అన్నాడు శాస్త్రి బెడ్డింగ్ తాళ్ళు బిగించుతూ.

వారిజ తన నిశ్శబ్ద రోదనని దిగమింగాలని గంట నుంచీ చేస్తున్న వ్యర్థ ప్రయత్నాన్ని విరమించి బిగ్గరగా ఏడ్చేసింది.

కడుతూ కడుతూ ఉన్న బెడ్డింగుని అలాగే వదిలేసి వారిజని దగ్గరకు తీసుకుని "ఎందుకు ఏడుస్తున్నావు?" అని ప్రశ్నించాడు అతను.

"నేను నీతో రాలేను...నన్ను క్షమించు" అని రెండు చేతులలో మొగం దాచుకుని ఏడవసాగింది ఆమె.

"నీకిష్టం లేకపోతే పోనీ – దానికోసం ఏడుపెందుకు?"

"శాస్త్రీ! నువ్వు లేకుండా జీవించలేను"

"ఉత్త పిచ్చిపిల్లవు. నాతో రాలేవు; నే లేకుండానూ బ్రతుకలేవు. ఎలా కుదురుతుంది?"

"నీవు నాతో ఉండకూడదా?"

"అసంభవం. అక్కడ హాస్పటల్ మూసివేయటం అంటే మాటలతో జరిగేపని కాదు. కేవలం నా ఒకడి సుఖం కోసం ఇతర్లని బాధించటానికి నే నిష్టపడను."

"మరి నాగతి ఏమిటి? నన్నేం చేసి పోతావు?"

"పిచ్చిదానిలా మాట్లాడకు. జీవితాన్ని అనుసరించి మనం నడిచేకన్న జీవితమే మనని అనుసరించి నడిచేలా చేసుకోవాలి. అప్పుడే మనం గెలుస్తాం" అన్నాడు శాస్త్రి సిగరెట్ ముట్టిస్తూ.

"అయితే ఒకసంగతి చెప్పు......నీ కథ ఏమిటి?"

వారిజ అడిగిన ఈ అర్థంలేని ప్రశ్నకి తెల్లబోయినాడు శాస్త్రి.

తన చిన్నతనంలో తల్లి యొక్క చిరపరిచితమైన పవిత్ర రూపం అతని కళ్ళ ఎదుట సాక్షాత్కరించింది. సరళ

హృదయా, అనుభవహీనురాలూ, ఏకాకినీ అయిన తనతల్లి ఏమై పోయింది? ఎక్కడ ఉన్నది?

శాస్త్రికి తన మనస్థితి యెడల తనకే ఆశ్చర్యం కలిగే సమయాలు చాలా ఉన్నయ్. ఇప్పుడు తన చరిత్రలో ఏ భాగాన్ని తెలుసుకోవాలనుకుంటున్నది వారిజ?

"ఎందుకూ?" అనిమాత్రం ప్రశ్నించగలిగా డతను.

అప్పటికిగాని తను వేసిన ప్రశ్న ఎంత భయంకర మైనదో వారిజకి అవగాహన కాలేదు. తెరచాటున రహస్యంగా ఉన్న తన అనుమానం నిజమేకనుక అయితే ఆత్మహత్య మినహా మరో మార్గాంతరం లేదు.

"వద్దు - వద్దు నేనడిగిన ప్రశ్నకి నువ్వు సమాధానం చెప్పనక్కరలేదు" అని ఆదుర్దాగా అన్నది ఆమె.

శాస్త్రి మళ్ళీ ఆశ్చర్యపోయినాడు వారిజ తననుంచి తెలుసుకో దల్చిన విషయం ఏమిటి? మళ్ళీ వెంటనే భయపడి పోవటానికి కారణం ఏమిటి? బహుశా ఈ ఒక్క విషయమే వారిజ తన దగ్గర దాచి ఉంటుంది. తల ఎత్తి వారిజ వంక చూశాడు శాస్త్రి.

అనురాగ విలాస భావనలు నురుగుల తరగలుగా - మానస జలధిని తరంగితం చేయటానికి అలవడిన పారవశ్య సమయాల్లో - నవ చైతన్యంతో అందాల తళుకులు స్పందించాల్సిన వారిజ తరుణ జీవితం - ఏ శాపవశానో బండ శాయిగా మారిపోయింది. ఆనంద రోచిస్సులు పరిగాఢ శైత్యంగా మారిపోయినయి. దీనికి సగం కారణం తనే అనిపించింది అతనికి. ఈ దురదృష్టానికి నిష్కృతి అంటూ ఇక

ఏమీలేదు. ఈ శాపగ్రస్త శిలామూర్తికి విమోచనంకూడా లేదు. శాస్త్రి నిట్టూర్చాడు.

మంత్రబద్ధుడైన మహా నాగుని ఫూత్కారంలా ఉన్న ఆ నిట్టూర్పుకి వారిజ ఉలిక్కి పడింది.

"శాస్త్రీ! ఏమిటది? నిన్ను నేను బాధపెట్టాను కదూ?"

"లేదు వారిజా! నీ జీవితంలో ఉండే సుఖ శాంతులకి నేను అనుక్షణమూ అడ్డువస్తున్నా నేమో అనిపిస్తున్నది"

"శాస్త్రీ! ... మీరందరూ ఇంతంత త్యాగాలు చేయటం నాకు ఇష్టం లేదు ఇంతకన్న నన్నొక్కసారి చంపేస్తే సుఖపడి పోతాను" తిరిగీ దుఃఖించటం ప్రారంభించింది ఆమె.

"మోహనమూర్తి అంతే - నువ్వూ అంతే. మీ అందరికన్నా నేనే హీనురాల్ని. నేను మీ ఇద్దర్నీ కూడా వదులుకో లేను"

"అలా అనకు - అంతులేని మొనాటనీగా మారి పోయిన ఈ జీవితంలో మనం ఏం చేస్తున్నామో మనకే అర్థంగాని ఈ మహాంధకారంలో గాలి ఎటుపోతే అటు కొట్టుకు పోతూ బ్రతికే మానం మన పనుల్ని - ఆదర్శాలని త్యాగాలనీ అనుకోటంకన్న శుద్ధ పొరపాటు మరోటి లేదు" అన్నాడు శాస్త్రి.

"బ్రతుకంటే రోగం పుడుతున్నది" విసుగ్గా అంది వారిజ.

"బ్రతుకంటే వెగటు - చావంటే అర్థంకాదు. ఈ సంధి యుగంలో మన బ్రతుకులన్నీ అల్లాగే ఏడుస్తున్నాయి" అని ఉదాసీనంగా చిరునవ్వు నవ్వాడు శాస్త్రి.

"అది కాదు శాస్త్రీ! ఈ విసుక్కీ, అర్థంలేని ఈ పాడు బ్రతుక్కీ మనం అంకితం అవటం తప్ప మరో మార్గాంతరం లేదా అని అడుగుతున్నాను?"

"లేక పోలేదు - ఉన్నది. కానయితే ఈ మార్గంలో చివరిదాకా వెళ్ళి గమ్యస్థానం ఎలా ఉంటుందో చూసివచ్చిన మానవుడు ఇంతవరకూ కనిపించలేదు. కనుక ఈ మార్గం సరి అయినది అవునా; కాదా? - అన్నది మనకు తెలియక పోయినా ఆ మార్గాన వెళ్ళటం తప్ప మరో గత్యంతరమూ లేదు"

"ఏమిటా మార్గం?"

"భగవంతుడిని నమ్మటం - చేరాలని ప్రయత్నించటం!"

"నా మొహంలా ఉన్నది?"

"నీ మొహంలా ఉన్నది భగవంతుడే అయితే అతని ఉనికి ఒక పెద్ద ఆశ్చర్యార్థకం! లేదా, కొశ్చన్‌మార్కు-"

"అంటే?"

"అంటే ఏం లేదు వారిజా! జీవితం మీద విసుగుపుట్టిన మనిషి యుగయుగాలుగా అనుసరిస్తున్న పద్ధతి ఇదే... ఇంత కన్న చేసేదేంలేదు"

"మరీ అంత అజ్ఞానమా!"

"అక్కడే పొరపాటు పడుతున్నావు. భగవంతుడిని నమ్మక పోవటం జ్ఞానం అయి, నమ్మటం అజ్ఞానం అనుకోటం శుద్ధ పొరపాటు. పైగా అతని అస్తిత్వం మన నమ్మకం మీదా అపనమ్మకంమీదా ఆధారపడి ఎప్పుడూ ఉండదు"

"నువ్వు శాస్త్రివేనా!"

"తప్పకుండాను. సుప్రసిద్ధ మానసిక శాస్త్రజ్ఞుడూ, గొప్ప సర్జనూ, అంతకంటె గొప్ప డాక్టరూ అయిన డాక్టర్ సత్యనారాయణ శాస్త్రిని"

"అంటే భగవంతుడిని నువ్వు నమ్ముతున్నావన్న మాట !"

"అత్యాధునికమైన శాస్త్రీయ పరికరాల్ని అతి నిపుణతతో మానవశరీరం మీద రకరకాలుగా ప్రయోగిస్తూ నేను గ్రహించిన మహాసత్యం ఏమిటంటే, చైతన్యపు స్విచ్చి నా చేతుల్లో లేదని" అంటూ సిగరెట్ వెలిగించాడు శాస్త్రి.

"అందుకని తన మనసుమీదకూడా తనకి అధికారం లేదంటావా!" అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది వారిజ.

పూర్తిగా అనను గాని, నిజం చెప్పాల్సివస్తే లేదనే అనిపిస్తుంది. ఆ విషయంలో నేనింకా నిర్ధారణకి రాలేదు"

"చిత్రంగానే ఉంది"

"ఆలోచిస్తే పెద్ద చిత్రం ఏమీ లేదు. అదీకాక చైతన్యం అంటే మనసేనేమో అనిపిస్తుంది. జాగృతికీ సుషుప్తికీ మధ్య మానవుడు ఒక విచిత్ర స్థితిలో ఉన్నప్పుడు

అపరిమితమైన సుఖం అనుభవిస్తాడు. ఆ సుఖ స్వరూపమే భగవంతుడేమో అనిపిస్తుంది."

"ఆ స్థితి ఎప్పుడు వస్తుంది?"

"స్త్రీ పురుష సమాగమంలో మెరుపులా అనుభవమయ్యే ఒక సుఖానుభూతీ - అపరిమితంగా తాగినప్పుడు ఇంద్రియాలు జడత్వం పొందిన కొన్ని సమయాలూ - ఇంద్రియాల్ని పూర్తిగా అదుపులో పెట్టి చేయగలిగిన తపస్సూ - ఆ స్థితికి ఒకదానితరువాత ఒక మెట్టు అన్నిటికంటె తేలిగ్గా లభ్యమయ్యేదీ సులభమయినదీ స్త్రీ పురుష సమాగమం. అందుకోసమే మనిషి ఎక్కువగా దానికోసమే వెంపరలాడతాడు. ఇక రెండో మెట్టు తాగుడు. సామాన్యంగా ఉన్నతమైన భావ సంపద కలిగిన వాళ్ళుకూడా తాగటానికి ఇదే కారణం. మూడోది తపస్సు. అంటే చివరిమెట్టన్న మాట. ఇది చాలా కష్ట సాధ్యమైన విషయం. ఈ మెట్టు ఎక్కిన తరువాత ఇక సాధించాల్సింది ఏమీ ఉండదు. మొదటి రెండుమెట్లూ ఎక్కకుండానే ఈ మెట్టు అధిరోహించిన వాళ్ళుకూడా ఉన్నారు వాళ్ళే యోగులు. మొదటి మెట్టుతోనే తృప్తిపడి జీవించేవాళ్ళు సామాన్య మానవులు. రెండోమెట్టు మీద ఆగిపోయేవాళ్ళు లాలసులు. మూడు మెట్లూ వరసగా ఎక్కేవాళ్ళు భక్తులు" సిగరెట్‌కి కట్టిన కొడిని విదిలించాడు శాస్త్రి.

"ఈ విషయం నువ్వు నాకెన్నడూ చెప్పలేదు!" అని నిట్టూర్చింది వారిజ.

జీవితంమీాదనూ స్త్రీత్వం మీాదనూ కలిగిన ఒక వెగటు పరిహాసంగా మారి అతని కళ్ళలోంచి ప్రవహించి వారిజని కలవర పరచింది.

"అయితే నువ్వు వెళ్ళక తప్పదంటావా!" అని మరో సారి ప్రశ్నించింది.

వారిజని బలంగా తన గుండెలకి అదుముకుని "ఇప్పుడీ కౌగలింత నాలో ఏ విధమైన స్పందనాన్ని కలిగించలేక పోతున్నది. ప్రస్తుతం మన ఆత్మలు ఉన్నంత సన్నిహితంగా శరీరాలు ఉండలేకపోతున్నయ్ దీనికి కారణం ఏమిటో నీకు తెలుసు"

శాస్త్రి అన్న మాటలకి వారిజ ఆశ్చర్యంగా అతని వంక చూసింది.

"నాలో పూర్వపుఉద్వేగం ఉన్నదో లేదో పరీక్ష చేసుకోటానికే నిన్ను చూడాలని విజయవాడ వచ్చాను"

సిగరెట్ వెలిగించి తిరిగీ చెప్పటం ప్రారంభించాడు శాస్త్రి.

"ఆ ఉద్వేగం ఇప్పుడు నాలో లేదు. వయసు కారణం ఒకటే కాకుండా మానసికంగాకూడా నేను చాలా తెలుసు కున్నాను. అలసి పోయాను. ఇప్పుడీ శాస్త్రి ఆత్మానుభూతి మాత్రమే నీకు ఇవ్వగలడు. అంతకన్న ఇతని నుంచి నువ్వు పొందగలిగేది ఏమీాలేదు"

"నీ నుంచి నేనేమీా పొందాలని అనుకోటంలేదు. నీ ఎదురుకుండా ఉంటే అంతేచాలు"

"లేదు వారిజా! లేదు. నీలో రెండు రక్తాలు ప్రవహిస్తున్నయ్. ఒకరక్తం ఉద్వేగభరితమైన పాశ్చాత్య రక్తం సకల విధాలయిన ఇహ వాంఛలనూ తీర్చుకోవాలని కోరుతున్నది. ఇక రెండో రక్తం శాంతికీ విరక్తికీ పేరుపొందిన ప్రాచీన బ్రాహ్మణ రక్తం. ఇది తన సర్వస్వాన్ని త్యాగం చేయమని నిన్ను తొందర పెడుతున్నది. పరస్పర విరుద్ధమైన ఈ రెండు రక్తాలూ నిన్ను సరిగా జీవించ నియ్యటం లేదు. దీన్నిబట్టి చూస్తుంటే ప్రాచ్య పాశ్చాత్య రక్తాలని కలపటం అంత మంచిది కాదేమో అనిపిస్తున్నది"

వారిజ ఆలోచించటం ప్రారంభించింది.

"నీలో ఉన్న వాంఛారూపం మోహనమూర్తిని వాంఛిస్తుంటే - నీలో ఉన్న వైరాగ్య స్వరూపం సత్యనారాయణ శాస్త్రిని ప్రేమించేట్లు చేస్తున్నది. వాంఛా పరిపూర్తి కానిదే వైరాగ్య రూపం అర్థంకాదు. నా ఉద్దేశ్య ప్రకారం ముందు నీకు వాంఛా పరిపూర్తి కావాలి"

"ఏమిటీ పురాణం శాస్త్రుల్లు గారి కబుర్లు?"

"ఇందులో అబద్ధంకాని నమ్మతగనిది కాని ఏదీలేదు. వాంఛకీ ప్రేమకీ సంఘర్షణ కలిగినప్పుడు ఆ రెండింటినీ ఒకటిగా చేయటం ఉత్తమ పద్ధతి. అది సాధ్యం కాకపోతే మొదట వాంఛ తీర్చుకోటమే చాలా మంచిది"

"అయితే మోహనమూర్తిని నేను వాంఛిస్తున్నానా?"

"అవును. ఆ వాంఛించటంలో అపరిమితంగా వాంఛిస్తున్నావు"

శాస్త్రి విచిత్రంగా వారిజవంక చూశాడు.

"దూరంగా ఉన్నప్పుడు నా అనుమానం నిరాధారం అనిపిస్తుంది. దగ్గరగా ఉన్నప్పుడు యదార్థమేనేమో అని పిస్తున్నది"

"నీ అనుమానం యదార్థమో కాదో నిర్ణయించటం ఎవరి తరమూ కాదు. నాతల్లి తప్పుచేసింది అని కొందరూ చనిపోయిందని కొందరూ అంటారు. ఏ సంగతీ నాకు తెలి యదు. నీతల్లీ నాతల్లీ ఒకటే కావచ్చు లేదా కాకనూ పోవచ్చును"

"సరే, ఇప్పుడు చెప్పు. నా కర్తవ్యం ఏమిటి?"

"ఏమీలేదు ఇందాక నేను చెప్పినదే. అంటే భగ వంతుడిని అన్వేషించటం"

"నా కది సాధ్యమా?"

"అలా అనుమానించకుండా ప్రయత్నించటమే నీ వంతు"

వారిజ మాట్లాడకుండా కళ్ళు తుడుచుకుంది.

"నువ్వు చెప్పినదే నిజమయితే నేను చాలా అదృష్ట వంతుడిని. మా అమ్మ మహా ఇల్లాలు. చాలా గొప్ప హృదయం కలిగిన స్త్రీ. ఆవిడ పొరపాటు చేసిందంటే నాకు నమ్మకం లేదు. అసలావిడ ఏది చేస్తే అదే సవ్యమైనపని. ఒకవేళ ఆమె చేసిన ఆ పొరపాటుకి ఫలితం నువ్వే కనుక అయితే అది ఎంత మహత్తరమైన సంగతో ఊహాకి కూడా అందదు"

"కాని ఆవిడని నేను అపరిమితంగా అసహ్యించుకున్నాను"

"నువ్వు అసహ్యించుకోవటం వలననే ఆమె తను చేసినది పొరపాటేమో అని అనుమానించి చనిపోయిందేమో అనిపిస్తున్నది నాకు"

"శాస్త్రీ! నువ్వు నా సోదరుడివే అయితే అదృష్టవంతురాలిని. కాకపోతే మరీ అదృష్టవంతురాలిని. ఈ సమస్యని, అంతులేని ఈ రహస్యాన్ని విడతీసే వారెవరు!"

"ఇంత బాహాటంగా మాట్లాడే నువ్వు ఈ రహస్యాన్ని ఎందుకు దాచావో నాకు అర్థం కావటం లేదు"

"ఏదో జరిగి పోయింది. ఈ రహస్యం నీకు చెప్పే శాక నాకు మిగిలిందేం లేదనిపిస్తున్నది"

వారిజ మాట పూర్తికాకుండానే వాకిట్లో కారు ఆగింది. అచేతనమైన మోహనమూర్తి శరీరాన్ని ఇద్దరు మనుషులు లోపలికి తీసుకు వస్తున్నారు. వాళ్ళ వెనుక రామలక్ష్మి దిగాలుగా నడిచి వస్తున్నది.

కెవ్వున కేక వేసి ఎదురుకుండా పరుగెత్తింది వారిజ.

"ఏమయింది రామలక్ష్మిగారూ? బజ్జా కేమయింది!"

రామలక్ష్మి వారిజ రెండు చేతులూ తనచేతిలోకి తీసుకుని "మీరు ఖంగారు పడకండి. ఏదో పొరపాటు జరిగింది. శత విధాల ప్రాణాని కపాయం ఉండకూడదు" అంటూ

అంతవరకూ నిర్ఘాంతపోయి నిలుచున్న శాస్త్రి వైపుకి నడిచి "ఏం జరిగిందో తెలియటం లేదు. పొరపొరిగిం పోతు

న్నట్లు తోస్తున్నది. సాయంత్రం మా ఇంటికి వచ్చాడు. నేను కాఫీ ఇచ్చాను. తాగాడు. ఆ తరువాత మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్రపోయినాడు. ఎంతపిల్చినా పలకలేదు. నాకు భయంవేసి మీదగ్గరకు తీసుకొని వచ్చాను-చూడండి" అన్నది.

శాస్త్రి అప్పటికి తేరుకొని మోహనమూర్తిని పరీక్ష చేశాడు.

"సరిగ్గా మాత్రలు మోతాదు మించినట్లున్నయ్" అంటూ ఒక ప్రిస్క్రిప్షన్ వ్రాసి అక్కడే నిలబడిన టాక్సీ డ్రైవరుకి ఇచ్చి వెంటనే ఆ మందు తీసుకు రమ్మన్నాడు.

వారిజ ఛాగాయకి అంతు లేదు. చైతన్యం తాలూకు స్పృహ్చ నా చేతుల్లో లేదు. అన్న శాస్త్రిమాటలే అనుక్షణం ఆమె చెవుల్లో గింగురు మంటున్నయ్. హఠాత్తుగా మోహన మూర్తి పడుకొన్న మంచం పక్కకి తల ఆనించి దుఃఖించటం ప్రారంభించింది ఆమె - నిశ్చలంగా ప్రశాంతంగా నిద్రి స్తున్న మోహనమూర్తికి ఆ క్షణంలో తన కోసమే హృదయ పూర్వకంగా వారిజ దుఃఖ పడుతున్నదని తెలిస్తే ఎంత బాగుండును అనుకొన్నది ఆమె.

ఆమె హృదయంలో కరాళ నియతి తాలూకు నీలి నీడలు దట్టంగా అలుముకు పోయినయి. ఆమె కళ్ళకి శాస్త్రీ రామలక్ష్మి ప్రేత చాయలులాగా కనిపించారు.

ఘోర భయంకరమైన నిరాశా లోకంలోకి - ఒక దుర్గమ పర్వత లోయలలోంచి పడిపోతున్నట్లు అనిపించింది. ఆ పడిపోవడంకూడా ఒక అనిర్దిష్ట గమ్యంలోకి దాక్కొవ

డానికి పోతున్నట్లు - ఆపోవడానికికూడా తగినంత కాలవ్యవధి లేనట్లూ - త్వరగా వెళ్ళ లేక పోయినట్లయితే తనకోసం పరుగిడి వస్తున్న క్రూరమృగాలు తనని మింగడానికితయారవు తున్నట్లూ ఆమెకు అనిపిస్తున్నది. ఆమె మానసికంగా వేగాన్ని అందుకుంది. పారిపోతోంది. ఆ ప్రయత్నంలో పడి పోతోంది. నుదుట గాయాలు అవుతున్నయ్. వెంటనే లేచి మళ్ళీ పారిపోతున్నది. కేవలం పరుగెత్తటమే తప్ప ఎక్కడికి! ఎటుపోవాలి. విశ్రాంతి ఎప్పుడు! ఆమె కీవిషయాలేం తెలి యవు.

"జిజ్జూ జిజ్జూ" అని ప్రాణాలన్నీ కూడ తీసుకొని ఒక సారి పిలిచింది వారిజ.

కాని మోహనమూర్తి ఈ పంచ భూతాత్మకమైన మామూలు ప్రపంచానికి కొన్ని యోజనాల దూరంలో ఉన్నాడు.

అతని శరీరం, ఆత్మ, మనస్సు భూమియొక్క అభేద చైతన్య చిత్రజాలంలోంచి దూరంగా పారిపోయినయ్.

తననుంచి ఆ మోహనరాగం ఊహించ లేనంతదూరం వెళ్ళి పోయిందనీ ఏ డాక్టరూ తిరిగి ఆ రాగాన్ని పునరు జ్జీవింపచేయ జాలరనీ వారిజ మనసులో భయం ప్రారంభ మయింది.

అర్ధ చైతన్య స్తితిలో కలిగిన ఈ భయంతో ఆమె హృదయం స్తంభించి పోయింది. రక్తం చల్లబడి పోయింది.

ఇదేదో మహా ప్రళయం - ఏ క్షణంలోనో సముద్రాలు భూమిమీద విరుచుకు పడతయ్. భూమి తునాతునకలై పోతుంది. ఇన్నేళ్ళనుంచీ తను అనుభవిస్తున్న జీవిత యంత్ర గమనం ప్రళయాసన్నసమయంలో ఆగి పోతుంది. తనకేం మిగలదు.

కెవ్వున కేక వేసింది వారిజ. రామలక్ష్మి ఖంగారుగా శాస్త్రి వంక చూసింది. శాస్త్రి వారిజపక్కని నిలబడి ఆమె తల నిమురటం ప్రారంభించాడు.

"వారిజా! నేనుండగా అతనికి ఏవిధమైన భయమూ లేదు. కొంచెం నిద్ర మాత్రలు అధిక మయినయ్ - అంతే. అంతకన్న మరేంలేదు" అని ధైర్యం చెప్పాడు.

వారిజ కళ్లుతుడుచుకుని శాస్త్రికి నమస్కరించి అక్కడి నించి లేచివెళ్ళి వీణ దగ్గర కూర్చుని మోహన రాగాన్ని ఆలాపించటం ప్రారంభించింది.

రామలక్ష్మి తనలో తను నవ్వుకుని "ఇప్పుడితను బ్రతికితే ముగింపు బ్రహ్మాండంగా ఉంటుంది" అనుకుంది.

"డాక్టరుగార్వా,అతను బ్రతుకుతాడా?" అని శాస్త్రిని ప్రశ్నించింది ఆమె.

"తప్పక - అయితే అతని ఇంట్లో ఈ సంగతి తెలియదా?"

"లేదు. చెప్పి రమ్మంటారా? మరేం ప్రమాదం లేదు గద?"

"లేదు" అని సిగరెట్ వెలిగించాడు శాస్త్రి. ఇంతలో డ్రైవరు మందుతీసుకువచ్చి బిల్లూ చిల్లర డబ్బులూ రామలక్ష్మికి ఇచ్చాడు

వెంటనే ఆ మందు ఉపయోగించాడు శాస్త్రి.

"సినిమాలో క్లైమాక్స్ సీనులా ఉంది" అనుకొన్నాడు ఆ డ్రైవరు.

వారిజ ఏకాగ్రతతో వీణమీద మోహనరాగం పలికిస్తున్నది.

"మోహనమూర్తిని వారిజ ఒట్టి వాంఛించటంతోనే ఆగిపోలేదు. ప్రేమిస్తున్నది కూడా" అనుకొన్నాడు శాస్త్రి.

"మోహనమూర్తి కళాత్మక సాహచర్యంలో వారిజ జీవితాన్ని తిరిగీ పొందగలిగింది" అనుకొన్నది రామలక్ష్మి.

జీమూత సదృశమైన భూతకాలంనుంచి – మసగ వెలుతుర్లు వర్తమానం లోకి పరుగిడి వచ్చిన వారిజ – ఉజ్వల కాంతివంతమైన భవిష్యత్‌నుకూడా ఆసమయంలోనే దర్శించ కలిగింది.

కొన్ని సంవత్సరాలుగా కాంతిరేఖల ప్రసారం కోసం అలమటించి పోయిన ఆమె హృదయం – ఆ మోహన రాగంతో – తిరిగీ నవచైతన్యాన్ని పొందింది. మోహన స్వరూపిని చూసిన మనుష్యులకే ఆమెకి జీవితంలోగల ప్రాధాన

కలిగింది. సహారా ఎడారిలో దిక్కుతెలియక తిరుగుతున్న ఒంటరి బాటసారికి ఒయాసిస్ కనిపించిన ట్లయింది.

దురదృష్టవశాత్తూ అది మృగతృష్ణ కాదుకదా - అనే అనుమానం ఆమెకు కలుగక పోలేదు. ఆ అనుమానంతోనే ఆమె ముందుకు నడుస్తోంది. ఇసుకలో కాళ్ళు కూరుకు పోతున్నయ్. సూర్యుడి తీక్షణతకి నెత్తి మాడిపోతోంది. దాహంతో నాలుక పిడచ కట్టుకు పోతోంది. అయినా ఆమె ముందుకు నడుస్తోంది.

అంతరాంతరాల్లో అది 'ఎండమావి' అనే భ్రమ ఆమెను వేధిస్తూనే ఉంది. ఇప్పటికీ గమ్యం చేరి అది మృగ తృష్ణ కాదనీ, నిజంగానే ఒయాసిస్ అనీ తెలుసుకునే సరికి ఆమె ఆనందం ఇంతా అంతా కాదు !

కాని ఏంలాభం! వెనకనించి ఇసుక స్తంభాలు భయం కరంగా పరుగెత్తి వస్తున్నాయి - ఇంకొంచెం సేపట్లో విరు చుకు మీదపడతాయి. ఈ పరిస్థితిలో తనింత వరకూ నమ్మని భగవంతుడిని ప్రార్థించటం తప్ప చేసేదేంలేదు.

ఇన్నాళ్ళకి తనకి ఆత్మార్పణకి అవకాశమూ సమ్మ కమూ కలిగింది. తనకోసం నిజంగా చనిపోవాలని ప్రయ త్నించిన మోహనమూర్తికి తన సర్వస్వాన్నీ అర్పించ టానికి అవకాశం కలిగించమని ఆమె భగవంతుడిని ప్రార్థిస్తోంది.

అయిదు నిముషాల కోసారి అతని నాడి చూసి మందు వేస్తున్నాడు శాస్త్రి.

'బ్రహ్మాండమైన ఆశాబలంతో బ్రతుకులోని కల్పిత సౌఖ్యాన్ని పొందటంకోసం సర్వశక్తులూ కూడ తీసుకుని మోహనరాగాన్ని ఆలాపిస్తున్న ఈ రహస్యమయ నారి అంతర్యం తనకి అవగతమై పోయింది' అనుకొంది రామలక్ష్మి.

మోహనమూర్తి నిశ్చైతన్య శరీరంలోని చైతన్యాణువులు ఒకటి రెండు కదలబారాయి.

ఆ చైతన్యాణువుల విచిత్ర స్పందనతో అతని మెదడు కూడా జాగృత మయింది.

తాను ఆత్మహత్య ఎందుకు చేసుకోవాలి? అతని అంతరాంతరాల్లో ఏమూలో నిద్రిస్తున్న లాలసాగ్ని హఠాత్తుగా భగభగ మండటం ప్రారంభించి అతనిలో జీవన వాంఛని పునరుజ్జీవితం చేసింది.

అతను కొద్దిగా కదిలాడు.

శాస్త్రి సిగరెట్ అవతల పారేసి అతని నాడి చూసి "ఇక ఫరవాలేదు" అని అవతలకి వెళ్ళిపోయినాడు. ఆ మహా వేదాంతి......తన సూటుకేసుతో కనిపించినంత వరకూ చూసి రామలక్ష్మి నిట్టూర్పు విడిచింది.

వారిజ వీణవిడిచి పరుగెత్తి మోహనమూర్తి తలని తన ఒళ్ళోకి తీసుకుంది. బలవంతాన తనకళ్ళు తెరిచిన మోహనమూర్తి సర్వశక్తులూ కూడ తీసుకొన్నాడు:

"వారిజా!"

"జిజ్జూ!"

శృతిచేసి ఉన్న వీణ మోహనరాగాన్ని పలికింది.

*　　*　　*

"ఇంకా ఎంతదూరం? నావల్లకాదు బాబూ" అన్నది, గోలుకొండ కోట చూడటానికి వెళ్ళిన వారిజ మోహన మూర్తితో.

"మొత్తానికి స్త్రీ ననిపించావు. అటుచూడు! ఆ బావి, అందులో కొన్ని వేల మంది స్త్రీలు కేవలం అభిమాన రక్షణ కోసం ప్రాణం తీసుకున్నారు"

"ఇప్పుడు ప్రాణరక్షణకోసం అభిమానం తీసుకుంటు న్నారు. ఇంకొక్క అడుగు కూడా నడవలేను"

అంటూ ఆ పాడు పడిన బావి గట్టున ఓ రాతి మీద కూర్చుంది వారిజ. ఆమె మోకాళ్ళకి తల ఆనించి కింద కూర్చున్నాడు మోహనమూర్తి. చుట్టుపక్కల శిధిల సౌందర్యం భయంకరంగా ఉంది.

"జిజ్జూ, ఒక కథ చెప్తా-వింటావా!"

"తప్పకుండా"

"అటుచూడు. ఆ బావిని చూస్తే నీకు ఏమీగా గుర్తు రావటం లేద్దూ!"

మోహనమూర్తికి ఎవరో చెళ్ళున కొరడాదెబ్బ కొట్టి నట్లు అనిపించింది. తెరపు మరపుల తెలి తెరలమధ్య ఏదో జ్ఞాపకం - అదేదో స్పష్టంగా తెలియడం లేదు.

"అటుచూడు. ఆ పడి పోయిన మేడ - ఇక్కడికి కని పిస్తున్న ఆ కిటికీ... గుర్తు వచ్చిందా?"

మోహనమూర్తి మెదడు కరిగి పోతున్నది. కాని ఏమీ జ్ఞాపకం రావడం లేదు.

"లేదు వారిజా!"

"నాకు అంతా స్పష్టంగా కనిపిస్తున్నది. ఇది యదార్ధమో అభూత కల్పనో - నా మనసు కల్పించుకున్న ఆకారమో నాకేం తెలియటం లేదు. ఈ పరిసరాలన్నీ నాకు తెలుసు. ఈ శిధిల సౌందర్యం సజీవంగా ఉన్నప్పుడు నే నిక్కడ జీవించాను. నేను యుగయుగాలనాటి స్త్రీని. అప్పటి నించీ ఇప్పటి వరకూ జీవిస్తూనే ఉన్న అద్భుత చైతన్య మూర్తిని"

మోహనమూర్తికి ఎందుకో భయంవేసింది. ఆ బావిలో పడి ప్రాణం తీసుకున్న స్త్రీలు సజీవంగా తనచుట్టూ నృత్యం చేసినట్లు అనిపించింది.

"జిజ్జూ, ఈ కథ అసత్యమే కావచ్చును కాని ఎంత అందంగా ఉంది! అది సత్యమే అనుకోవడంలో ఎంత ఆనందం ఉన్నది?"

"వారిజా!"

"అవును జిజ్జూ! నేను ఇక్కడ ఒక జీవితాన్ని అనుభ
వించాను. వజీరు కూతుర్ని నేను-గోల్గొండ ఆస్థానంలో ఉన్న
ఒక హిందూ గాయకుడిని ప్రేమించాను"

మోహనమూర్తికి ఏదో తెలిసినట్లయింది.

"జయ జయవంతి రాగంలో విన్న అతని మొదటిపాట
నన్ను అమితంగా ఆకర్షించింది. ఒక సాయంత్రం కాపలా
వాళ్ళ కళ్ళు కప్పి ఈ బావి దగ్గరే ఆ గాయకుడిని మొదటి
సారిగా కలుసుకున్నాను"

మోహనమూర్తికి ఒక తెర దిగజారింది.

"అతను నన్నుచూసి భయపడ్డాడు. వెళ్ళి పొమ్మ
న్నాడు. నేను అవమానంతో 'సిగ్గుతో' వెనక్కి తిరిగి
వచ్చేశాను"

"బాగుంది!"

"అతనుకూడా నన్ను ప్రేమిస్తున్నాడనీ నన్ను
పొందటం తెలియక తిరస్కరించినట్లు నటించాడనీ తరువాత
తెలుసుకున్నాను"

"ఊ"

"ఆ సాయంత్రం ఈ బావిదగ్గరే మళ్ళీ కలుసు
కున్నాను. ఈతడవ అతను భయపడలేదుగాని, ఖంగారు
పడ్డాడు. జిజ్జూ, అతని పెదవులు అచ్చు నీపెదవులలాగానే
ఉండేవి."

వారిజ చేతిని బలంగా పట్టుకున్నాడు మోహన మూర్తి.

"ఆ మరునాడు దర్బారులో అతని పాట జగన్మోహ నంగా ఉంది. అసభ్యంగా ఉంటుంది-అని కూడా ఆలోచించ కుండా నా ఆనందాన్ని పైకే వెళ్ళబుచ్చి నవ్వుల పాలయ్యాను ఆ రోజు"

"తరువాత?"

"నేను అంతఃపురంలోనుంచి బయటికి రాకుండా మా అమ్మ జాగ్రత తీసుకుంది. అతని పాట వినకుండా జీవించ లేని పరిస్థితి నాకు ఏర్పడింది. ఒక నమ్మకమయిన బానిసతో నేను కిటికీలో దీపం పెట్టగానే అదే బావి దగ్గరనుంచి పాడ మని చెప్పాను. అతను అలాగే చేసేవాడు."

మోహనమూర్తికి మరో తెర తొలిగింది.

"జయ జయవంతి - ద్విజావంతి - దీపక్ - మేఘ మల్హార్ ఈ రాగా లన్నిటిలోకీ నా కిష్టమైనది మోహన రాగం. కొన్నాళ్ళకి అదీ వీలు లేక పోయింది. ఈ సంగతి పసికట్టిన వాళ్ళెవరో అతనిని దేవిడీమన్నా చేశారు"

"అప్పుడేం జరిగింది?"

"గోల్కొండలో ప్రేమమతి, భానుమతి అని ఇద్దరు గాయనీ మణులు ఉండేవారు. అందులో భానుమతి ఇతన్ని ప్రేమించింది. ఇంకో చిత్రం ఏమిటంటే, వాళ్ళింట్లోంచి వాళ్ళు పాడుతుంటే కోటలోకి వినిపించేట్లుగా ఆనాటి శబ్ద

నిపుణులు ఆ ఇళ్ళు కట్టారు. అటుచూడు - ఆ కనిపిస్తున్న శిథిల సౌధాలే ఆ రెండూను"

మోహనమూర్తికి ఏదో జ్ఞాపకం వచ్చినట్లయింది.

"ఇతను భానుమతి ఇంట్లోంచి పాడుతుంటే నేను కోట లోకి వెళ్ళి ఒక సౌధాగ్రం నుంచి వినేదాన్ని"

"చివరకి ఏం జరిగింది?"

"రోజూ కోటలోకి వెళ్ళవలసి రావటం వలన జలాలుద్దీన్‌షా అనే ఒక షాజాదా నన్ను ప్రేమించి మా నాయన అనుమతితో పెళ్ళి చేసుకున్నాడు. నా పెళ్ళినాటి రాత్రి కూడా అతని పాట వినటానికి సౌధాగ్రం మీదకి పోయాను. ఆరోజు అతను దీపక్ రాగం ఆలాపించాడు. ఆ రాత్రి గోల్కొండ కోటలో గుర్రాలశాల తగలబడి పోయింది"

"ఊఁ"

"ఆ తరువాత నేను రెండు మూడు సంవత్సరాల కన్న ఎక్కువ జీవించలేదు. ఈ రెండుమూడు సంవత్సరాల్లో నా ప్రేమకథ నా భర్తకి తెలిసింది. అయినా ఆయన ఏమీ అనలేదు. నేను ఆత్మహత్య చేసుకోకుండా జాగ్రత తీసుకున్నారు. కాని నా చావు తప్పలేదు."

మోహనమూర్తికి ఏదో తెలియని జ్ఞాపకం తళుక్కు మన్నది.

"ఆఫ్రును"! అన్నాడు.

"ఏమిటి అవును!"

"నేనే ఆ గాయకుడిని"

"అవును, నువ్వే ఆ గాయకుడివి"

"పూర్వజన్మ పునర్జన్మలని నువ్వు నమ్ముతావా!"

"తప్పకుండా. నేను రామలక్ష్మిగార్ని కాదు- ఇంత మంచికథ కల్పించటానికి"

"అంటే ఇది యథార్థమేనా!"

"ఏం, ఎందుకు కాకూడదు!"

"వారిజా! నేను చాలా అదృష్టవంతుడిని. నిజమయినా కాకపోయినా ఎన్ని జన్మాలనుంచో వస్తున్న అనుబంధం మనది- అనుకోటాలో ఎంత ఆనందం ఉన్నది!" అన్నాడు మోహనమూర్తి.

వారిజ అతని చెంపకి తన చెంపని ఆనించింది. మరు క్షణంలో మానవుడి ధ్యేయం తాలూకు చైతన్య వాహిని వేగంగా ప్రవహించటం ప్రారంభించింది.

ఆ మహాగాయకుడి కంఠంలోంచి మోహనరాగం తీయగా జాలువారింది.

అదే తన్మయ స్థితిలో - క్రిందటి జన్మలో మొదట కలుసుకున్న ఆ శిథిలకూపం దగ్గర మోహనరాగ స్వనాల జల్లులో వారిద్దరూ తడిసి పోయినారు, మానవుడు [illegible]

పోవచ్చును- మానవత్వం చిరంజీవి. అనుభవం హరించి పోవచ్చును- భావం జన్మాంతరాలవరకూ నిలచే ఉంటుంది. ఆ భావమే అమోఘమూ శాశ్వతమూ అయిన మహా మానవతకు ఆధారం.

మోహనమూర్తి వారిజముఖం తనవైపు తిప్పుకుని ఆమె కళ్ళలోకి చూస్తూ అన్నాడు:

"వారిజా! నీవెవరు?"

"నేను యుగయుగాలనాటి స్త్రీని - అప్పటి నుంచి ఇప్పటి వరకూ జీవిస్తూనే ఉన్న అద్భుత చైతన్య మూర్తిని" అన్నది వారిజ.



స మా ప్తం



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B106 |
| పుస్తకం పేరు | వారిజ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 241 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | 1 – 4 |
| తయారు చేసేవది | Apsar |
| పేజీలు విడదీసేవది | Apsar |
| స్కాన్ చేసేవది | Mounika |
| పరీక్ష చేసేవది | DAVEED |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |